# ఈ గ్రంథం

సమాజంలో అవిద్య అజ్ఞానం విలయ తాండవం చేస్తున్నాయి. అక్షరాస్యుల సంఖ్య అత్యల్పం. స్త్రీలలో అల్పాతి అల్పం. కనుక ప్రబోధానికి వక్తల అవసరం ఎంతైనా ఉంది.

బోధకులకు, పరిశోధకులకు పండితుల సాయం తప్పనిసరి. విమర్శకుల అండ దండలు ఆవశ్యకం. మహిళా సంక్షేమం యెడ స్త్రీ విమోచన పట్ల అచంచల విశ్వాసం ఉన్న వనితల బలం మహిళోద్యమానికి ఆలంబనం.

అన్ని సాహిత్య రీతులు స్త్రీ జనోద్ధరణకు ఉపకరిస్తాయి. సంగీతం, నృత్యం అందరికీ ఆహ్లాదం కలిగించేవైనా అందరినీ అలరించలేవు. పాట ఆకర్షిస్తుంది. ఆట ఆనందాన్ని అందిస్తుంది. కాని పద్యం, గేయం ప్రబోధానికి పనికిరావు. పాండిత్య ప్రకర్షకు అనువైనవేమో కాని సమాచారాన్ని, జ్ఞానాన్ని తర్కయుక్తంగా, సూటిగా ఒక వ్యక్తి నుండి మరో వ్యక్తికి తరలించలేవు. చదివే వ్యక్తిలో ఉత్కంఠను, జిజ్ఞాసను, జ్ఞాన తృష్ణను పెంపొందించేది వ్యాసం.

వ్యాసం వ్రాయడం తేలికని చాలా మంది భావం. అది పొరపాటు. అదొక విశిష్ట సాహితీరీతి. దాని రచనా పాటవం అందరికీ అందుబాటులో లేదు. దానికి కృషి, అభ్యాసం, వస్తునిష్ఠ, సత్య నిరతి, చదువరి అవసరాలపై ఆసక్తి, చిత్తశుద్ధి, పదాల వాడుకలో పొదుపు, పాఠకులకు మంచిది ఏదో తెలియజేయాలనే తపన విధిగా ఉండాలి.

ఉద్యమ కార్యకర్తల ప్రబోధానికి వ్యాసం సమర్థవంతమైన సాధనం. మల్లాది సుబ్బమ్మ తన ఆశయసిద్ధి కోసం వ్యాసాన్ని ఎన్నుకున్నారు. వందలు, వేలు వ్యాసాలు వ్రాసి పేరెన్నిక గన్నారు. స్త్రీ జాతి సమస్యలను కొన్నింటిని ఈ పుస్తకంలో వారు చర్చించారు. ఈ వ్యాసాలు అనేక పత్రికలలో, రేడియోలో, టి.విలో, సెమినార్లలో ఇంతకు క్రితమే ప్రకటితం. ఈనాడు అవి సంకలన రూపంలో దర్శనమిస్తున్నాయి.




రచన

మల్లాది సుబ్బమ్మ

మల్లాది సుబ్బమ్మ ట్రస్టు
9, ఎం.ఐ.జి.హెచ్. కాలనీ,
మెహిదీపట్నం—హైదరాబాద్
పిన్ : 500 028

# వనితాలోకం

మల్లాది సుబ్బమ్మ ట్రస్టు ప్రచురణ నెం-7

ప్రతులు : వెయ్యి
ఆగస్టు 1988
రచన : మల్లాది సుబ్బమ్మ




ప్రచురణ కర్తలు : మల్లాది సుబ్బమ్మ ట్రస్టు
9, ఎం ఐ.జి హెచ్, మెహిదీపట్నం,
హైదరాబాద్-500 028.

సోల్ డిస్ట్రిబ్యూటర్సు : వికాసం
9, ఎం.ఐ జి.హెచ్, మెహిదీపట్నం
ఫోను : 35429

వెల : రు|| 12-00

ముద్రణ : డాన్ ప్రెస్,
ఖైరతాబాద్, హైదరాబాద్-500 004

# ఈ పుస్తకంలో

# కృతజ్ఞతలు : సుమాంజలులు

'సెకండ్ సెక్స్' అనే పదంలో ఇది పురుష ప్రపంచం అనే ధ్వని వుంది దాని ప్రతి పదార్థమే స్త్రీ రెండవ తరగతి వ్యక్తి అని. ఆ భావం అనాదిగా అమల్లో ఉంది. అది ఈనాటిది కాదు; ఈ దేశానికే పరిమితం కాదు. నాగరిక సమాజావిర్భావం నుండి స్త్రీని రెండవ తరగతికి నెట్టి వేశారు. అది పవిత్రమనే భావంతో స్త్రీలు సైతం ఆమోదించి ఆచరిస్తున్నారు.

సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలో ఈనాడెన్నో మార్పులు వచ్చాయి. కాని సాంస్కృతికంగా మారనిది స్త్రీ జీవిత విధానం, స్థాయి, హోదాలు మాత్రమే. అవి మారనిదే సమాజానికి, దేశానికి అభ్యుదయం సిద్ధించదు అనే దృష్టితో వ్రాసినదే ఈ వనితాలోకం.

ఈనాడు సైన్సు, టెక్నాలజీ, ఆర్థిక శాస్త్రాల సాహిత్యం విపరీతంగా పెరిగి పోయింది. స్త్రీ ఉనికిని వర్ణిస్తూ, ఏఏ రంగాలలో ఎలా మార్పులు రావాలనే సాహిత్యం ఇటీవలనే వృద్ధి అవుతున్నది. కొన్ని పాశ్చాత్య దేశాలలో మహిళా విముక్తి ఉద్యమాలు, స్త్రీ విమోచన సిద్ధాంతాలు కొంత మెరుగుగా ఉన్నాయి. వారు క్రొత్త రీతులలో అభివృద్ధిని గురించి వ్రాస్తున్నారు. మన సమాజం వేల సంవత్సరాలుగా సంప్రదాయాలకు పుట్టినిల్లు. అణగారిన స్త్రీ పరిస్థితిని వక్రీకరించి గణనీయమని శ్లాఘిస్తున్నారు. ఇది కుట్ర లేక అజ్ఞాన జనితం. ఆమె ఇంటా బయటా ఎలా దోపిడీకి గురి అవుతున్నదో తెలిసి బహిర్గతం చేయకుండా ఉండటం ఆత్మద్రోహం. స్త్రీ అభివృద్ధి అంతా బూటకం. కాకపోతే ఈ స్త్రీల హత్యలు, ఆత్మహత్యలు, సతిలాంటివి ఎందుకు జరుగుతున్నాయి? వాటికి మూలమేమిటి, వాటిని ఎలా పరిష్కరించాలి అనే విషయాలను వివరించటానికే ఈ వనితాలోకం వ్రాయాల్సి వచ్చింది.

ప్రతి రంగంలో స్త్రీల సమస్యలకు పరిష్కార మార్గాలను సూచించటం జరిగింది. ఈనాటి స్త్రీ సమానత్వాన్ని మాత్రమే కాంక్షించటం లేదు. పూర్వం నుండి సమాజంలో స్త్రీలపై నున్న దురభిమానం పోవాలనే తపన ఈ పుస్తకం నిండా గోచరిస్తుంది. తమ హక్కులను ఎలా కాపాడుకోవాలో తెలియచేస్తుంది.

ఈ గ్రంథంలో వ్యాసాలు అన్నీ అనేకానేక పత్రికలలో, రేడియోలో, టి.వి.లో, సెమినార్లలో, సావనీర్లలో ఇంతకు క్రితమే ప్రకటితమయినాయి. కనుక ఆయా పత్రికాధిపతులకు, డైరెక్టర్లకు ధన్యవాదాలు సమర్పిస్తున్నాను. నా సహచరులు అఖిలభారత హేతువాద సంఘాధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎం.వి. రామమూర్తి సహాయ సహకారాలు విస్మరించరానివి. ముఖచిత్రం వ్రాసి యిచ్చిన జి. శివరాం గారి సహాయాన్ని నేను మరవజాలను.

ఈ గ్రంథం తెలుగు విశ్వవిద్యాలయం వారిచే ఆర్థిక సహాయం పొందినది. కనుక వారికి నా కృతజ్ఞత తెలియజేస్తున్నాను.

రచయిత

# క్రొత్త శతాబ్దానికి స్వాగతం

భవిష్యత్తులో స్త్రీ స్థానం సమాజంలో ఎలాఉంటుందని అంచనా వెయ్యాలంటే శాస్త్రీయదృష్టితో విషయాన్ని పరిశీలించడం అవసరం. పూర్వం ఎలాఉండేది, ఇపుడు ఎలాఉన్నది, ఈ తేడాకు కారణాలు ఏమిటి అని తెలిస్తేగాని భవిష్యత్తును ఊహించ లేము. దానికి కొంత చారిత్రిక దృష్టి అవసరం లేకపోతే పూర్వాపరాలకు సంబంధించిన గందరగోళంలో పడిపోతాము. అపుడు కేవలం కోరికలే గుర్రాలతాయి. మన ఊహలకు అంచనాలకు వాస్తవిక ప్రాతిపదిక ఉండదు.

1820 కాలంనుండి స్త్రీల పరిస్థితిపై జిజ్ఞాసువులలో కొంత అలజడి ప్రారంభ మయింది. తరువాత వచ్చిన సంస్కరణోద్యమాలు మహిళాభ్యుదయానికి దోహదం చేశాయి. రాజా రామ్‌మోహన్‌రాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ ప్రభృతులు మహాను భావులు. కందుకూరి విరేశిలింగం పంతులుగారు, గురజాడవారు సంస్కరణకు బాటలు వేశారు. విప్లవోద్యమాలు, గాంధిగారి సత్యాగ్రహోద్యమం, కమ్యూనిస్టు ఉద్యమం ఇవన్నీ మహిళాలోకపు జాగృతికి, పురోగతికి తోడ్పడ్డాయి. తత్ఫలితంగా ఈనాటి స్త్రీకి రాజ్యాంగం ప్రకారం, లాప్రకారం చాలావరకు సమానత్వం సిద్ధించింది. కాని అది అంతా ఆచరణలోకి రాలేదు. దీనికి కారణం స్త్రీలు అజ్ఞానం నుండి ఇంకా బయటపడలేక పోవటం వల్లనే.

అసలు ప్రగతి లేదనడం ఎంత అవివేకమో బ్రహ్మాండమైన ప్రగతి సంభవిం చించిందని ప్రకటించడం అంత సాహసం. ఈ సందర్భంగా సరియైన అవగాహన, అంచనా ఉండాలంటే మనకు సమతుల్యదృష్టి అవసరం. ఆవేశ కావేషాలకు దూరంగా, ఒక విధమైన నిర్లిప్తతతో విషయాన్ని అధ్యయనం చేయాలి.

ఎంతవరకు సాధించగలిగాం, ఇంకా ఏమి సాధించవలసి యున్నది స్పష్టంగా తేల్చుకోవాలంటే సమాజంలో మహిళ హోదాను, స్థానాన్ని సాంస్కృతికంగా, సామాజి కంగా, ఆర్థికంగా, రాజకీయంగా విడివిడిగా పరిశీలించ వలసిన అగత్యం ఉంది. సాంస్కృతికంగా ఒకనాడు స్త్రీని పురుషుడు వస్తువుగా పరిగణించాడు. కాకపోతే ఆమె అస్తిత్వాన్ని గుర్తించాడు. అయితే ఆమెను బానిసగా చూచాడు. కొంత కాలానికి మార్పు వచ్చింది. ఆమెను తనకన్నా తక్కువ హోదాగల మానవవ్యక్తిగా పరిగ ణించడం ప్రారంభించాడు.

<u>సాంస్కృతికంగా:</u> సమాజంలో ఉద్భవించిన భావాలు అలాయిదా అస్తిత్వాన్ని కలిగి ఉంటాయి. వాటి సూత్రాల ప్రకారం అవి పరిణామం చెందుతాయి. భావాలు సామాజిక శక్తులపైన పనిచేస్తాయి. అలాగే సామాజిక పరిణామం భావ ప్రపంచాన్ని ప్రభావితం చేస్తుంది. పరస్పరం ఒకటి మరోదానిపై తనశక్తి ప్రసరింప చేస్తుంది.

ఒకసారి పుట్టిన భావాలు అంత తేలికగా చావవు. ఏపరిస్థితుల్లో ఆ భావాలు ఉదయించాయో ఆ పరిస్థితులు మారినా ఆ పాత భావాలు సమాజాన్ని వదలిపెట్టవు. పట్టుకొని వ్రేళ్ళాడుతూనే ఉంటాయి. అందువల్ల స్త్రీని గురించిన పాతకాలపు భావాలు అంటే వస్తువు లేక బానిస, లేక ద్వితీయశ్రేణి వ్యక్తి అనేవి ఇప్పటికీ మనగలుగుతున్నాయి. ఇక్కడ మరో విషయాన్ని మనం స్పష్టం చేసుకోవాలి భారతదేశంలో తెగల సమాజం ఆటవిక సమాజం, వ్యవసాయ సమాజం, పారిశ్రామిక సమాజం సహజీవనం చేస్తున్నాయి. అందుచేత పై మూడు రకాల ఊహలు ఏకకాలంలో దేశంలో వ్యాప్తిలో ఉండటంలో విస్మయం కలిగించే విషయంలేదు. 21వ శతాబ్దంలో పరిస్థితి మారటానికి కొంత అవకాశంఉంది. కాని సాంస్కృతికంగా పెద్దమార్పు వస్తుందనే ఆశ కనపడటం లేదు. నాగరికత వృద్ధి పొందుతుంది కాని సంస్కృతి విషయంగా పెద్దగా అభివృద్ధి ఉండక పోవచ్చును. కాకపోతే భావాల సందర్భంగా కొంత మెరుగుదల కన్పడ వచ్చును. స్త్రీని వస్తువుగా చూచేవారు ఆమెను బానిసగా చూపడం ప్రారంభిస్తారు. బానిసగా ఆమెను పరిగణించేవారు ఆమెను ద్వితీయశ్రేణి మానవిగా చూస్తారు. ఇప్పుడు ఆమెను ద్వితీయశ్రేణి వ్యక్తిగా గమనిస్తున్నవారు ఆమెను సమాన స్థాయిగల వ్యక్తిగా గుర్తించటం మొదలు పెడతారు. అయితే ఇదీ వాంఛనీయమైన మార్పే. సామాజికంగా స్త్రీ భవిష్యత్తుగురించి ఊహించడం అంత కష్టమేమీ కాదు.

<u>సామాజికంగా:</u> ప్రస్తుతం గృహవిజ్ఞాన శాస్త్రం స్త్రీలకు మాత్రమే కేటాయించబడింది. తతిమ్మా విషయాలుకూడా స్త్రీలకు అందుబాటులోకి వచ్చాయి. కాగా విశ్వవిద్యాలయాలలో సైన్సు విభాగములో స్త్రీవిద్యార్థినుల సంఖ్య తక్కువగా ఉంటున్నవి. కొన్ని తెగలలో, కొన్ని కులాలలో బాల్యవివాహాలు ఇంకా కొనసాగుతూ ఉన్నా దేశం మొత్తంమీద స్త్రీల వివాహ వయః పరిమితి పెరిగింది. అయితే, ఒకనాడు కొన్ని కులాలలో కన్యాశుల్కం ప్రబలంగా ఉండేది. ఇప్పుడు ఇంచుమించుగా అన్ని కులాల వారిలో, అన్ని మతాలవారిలో వరకట్న పిశాచం విలయ తాండవం చేస్తున్నది. భార్యల హత్యలు పెచ్చుపెరుగుతున్నాయి. వాటిని ఆత్మ హత్యలుగా చిత్రించడం

జరుగుతున్నది. స్త్రీలపై అత్యాచారాలు ఇతోధిక సంఖ్యలో కొనసాగుతున్నాయి. భార్యలపై హింస విపరీతమవుతున్నది ఇదంతా చూస్తూంటే స్త్రీలయెడ గౌరవం పెరుగుతున్నదా అనే సందేహం కలుగుతున్నది. విశ్లేషణ చేస్తే ఒక అంశం తేటతెల్లమవుతుంది. ఇది సంధికాలం. పాత విలువలు మారిపోతున్నాయి. కొత్తవిలువలు ఇంకా ప్రవేశ్యానలేదు.

విద్యావంతులైన స్త్రీలు భార్యలుగా కావాలని తాపత్రయ పడుతున్నారు. వారి సంపాదనను తాము స్వతం చేసుకోవాలని ప్రయత్నిస్తున్నారు. మధ్యతరగతి స్త్రీలు ఉద్యోగాలుచేస్తూ కూడా, గ్రామిక స్త్రీలు కూలినాలి చేసుకుంటూ కూడ ఇంటిపని చేయక తప్పటంలేదు. సామాజిక ప్రజాస్వామ్యం లోపిస్తున్నది.

21వ శతాబ్దంలో సమాజరూపం మారక తప్పదు. స్త్రీ పురుషులు ఇద్దరూ పని చేస్తేకాని సంసారం గడవని పరిస్థితి గట్టిగా వస్తుంది. ఇప్పుడు స్త్రీలలో జాగృతి వచ్చింది. కాని హక్కులను సాధించుకోగల చైతన్యం రాలేదు. మున్ముందు ఆ చైతన్యం, లక్ష్యసాధనకు కావలసిన సంఘటనా సామర్థ్యము వారికి లభిస్తుంది. వివాహ వ్యవస్థతో పూర్వం ఒక వ్యక్తిఅంటే స్త్రీ, అణగారిన శాంతి ఉండేది. ఇప్పుడు అలజడి ప్రవేశించింది. మున్ముందు, ఇలాంటి వ్యవస్థ బీటలుపారుతుంది. వివాహమైన రెండుమూడు సంవత్సరాలలో ఆమె తల్లి అవుతున్నది. భర్త హింసను తప్పించుకోవాలనుకుంటే అతనిని వదలి వేయగల స్థితిలేదు. తన సంతానమే తనకాళ్ళకు బంధము అవుతున్నది. వచ్చే శతాబ్దంలో స్త్రీలు ఈ విషయమై జాగ్రత్త పడగల అవకాశాలు ఉన్నాయి. జన్మనిగ్రహ సాధనాలు అందుబాటు లోకి రావడం వల్ల లైగిక విప్లవ సామాజిక ఫలితంగా ఆమె పూర్వంలాగా త్వరపడి తల్లికాబోదు. తల్లి కాని భార్యఅయినా, సంపాదన పరురాలైన భార్యఅయినా అవసరమస్తే తిరగబడ గలదు. ఆశక్తి ఆమెకు ఏర్పడుతుంది. ఇది ఎవరి ప్రబోధం వల్లనో జరిగే పనికాదు. అనుభవం వల్ల స్త్రీలోకం నేర్చుకునే విషయం. మొదట్లో విడాకుల సంఖ్య పెరుగుతుంది. పురుషాధిక్యతా భావాలుగల మగవారు మొదట్లో కొంత వ్యతిరేకించినా తరువాత సర్దుకుంటారు. ఆలా స్త్రీ పురుషుల మధ్య 21వ శతాబ్దపు ఉత్తరార్థంలో సామరస్యం వస్తుంది. ఇది ఒకరకంగా వాంఛనీయమైన పరిణామం.

<u>ఆర్థికంగా:</u> స్త్రీలు సంపాదిస్తున్నా, వారి సంపాదనపై, ఆదాయంపై, ఆస్తిపై వారికి యాజమాన్యం లేదు ఆస్తి పేరుకు వారిది. వినియోగించే హక్కు తండ్రిది లేక

భర్తది. ఆమె సంపాదించే యంత్రం ఈనాడు. వచ్చే శతాబ్దంలో పరిస్థితి మారగలదు. ఎన్నాళ్ళు శ్రమిస్తూ జంతుస్థాయిలో ఆమె ఉండగలదు? తన సంపాదనపై తన హక్కును ఆమె స్థిరీకరించుకోగల సూచనలు ఉన్నాయి.

రాజకీయంగా: ఇంతవరకు రాజకీయ రంగంలో పరిపాలనా రంగంలో కీలక స్థానాలన్నీ పురుషుల వశమే. ఒకరిద్దరు స్త్రీలు ఉన్నత పదవులలో ఉన్నంత మాత్రాన స్త్రీ జాతికి ఒరిగేదేమీ లేదు. స్త్రీలకు ఓట్లు ఉన్నా వాటిని వినియోగించుకునే పరిస్థితిలేదు. ఏ ఒకటి రెండుసార్లు మాత్రం వారు ఓటుహక్కును స్వేచ్ఛగా వాడుకున్నారు. మిగతా సందర్భాలలో వారు తండ్రుల, భర్తల చెప్పుచేతల్లో ఉండి వారు నిర్దేశించిన వారికి ఓట్లిచ్చారు. 50%గా వున్న స్త్రీలు 5శాతం కన్నా ఏనాడు ప్రాతినిధ్యాన్ని పొందలేదు.

ఇకముందుకూడా అలాగే ఉంటుందా? పెద్దగా మార్పుఉండదు. స్త్రీ ఎన్నిరంగాలలో పోరాడగలదు? సామాజిక రంగం ఒక్కటే ఆమెను క్రుంగ దీస్తుంది. కుటుంబం అనే గుదిబండతో, పరువుమర్యాదల బరువుతో ఆమె నడుము విరిగి పోతుంది కదా! అలాంటి పరిస్థితిలో ఆమె రాజకీయ రంగంలో తనవంతు ప్రాతినిధ్యానికి పోరాడలేక పోవచ్చు. కాకపోతే ఇపుడు శాసన సభలలో 5 శాతం ప్రాతినిధ్యం ఉంటే ఆమెప్రాతినిధ్యం 15 శాతంకు పెరగవచ్చు. అంతకన్నా పెరుగుదల ఉండబోదు. డిగ్రీ తేడాలో పెరుగుదలయే గాని స్వభావంలో ఆమెస్థాయిలో మార్పు రాబోదని అంచనా వేయడం పొరపాటు కాదేమో!

# సామాజిక పరిణామంలో స్త్రీ

క్రీ. శ. 20వ శతాబ్దంలో కూడ స్త్రీల స్తితి శోచనీయంగా ఉంది. స్త్రీని వస్తువుగా చూడటం, ఆమెను బానిసగా పరిగణించడం, ఆమెను ద్వితీయశ్రేణి మానవ వ్యక్తిగా లెక్కవేయడం జరుగుతున్నది. ఈ మూడురకాల వైఖరులు ప్రపంచంలోను, మన దేశంలోను పలు ప్రాంతాలలో ఏకకాలంలో ప్రదర్శితమవుతున్నాయి. ఇలాంటి స్తితి ఎందువల్ల సంభవించింది, ఎందుకు కొనసాగుతున్నది అని మనం పరిశీలిస్తేనే మనకు సమాధానం దొరుకుతుంది. కాగా పరిశీలనకు చారిత్రత దృష్టి అవసరం.

సామాజిక పరిస్థితులు మారినా ఒకసారి ఉద్భవించిన భావాలు తేలికగా చావవు; మారవు. అందుకని ఆ పాత కాలపు భావాలను వ్యతిరేకించడానికి భావాల పరంగా పోరాటం అవసరమవుతుంది. అందుకనే 1959లో చైనాలో కమ్యూనిస్టు ప్రవేశపెట్టిన తదుపరి కూడ 1966లో మావో సాంస్కృతిక విప్లవాన్ని ప్రబోధించాడు. సామాజిక విప్లవానికి ముందు భావ విప్లవం రావాలని ప్రముఖ తత్వవేత్త ఎం. ఎన్. రాయ్ సిద్ధాంతీకరించాడు. నూతన భావాలవల్ల ఉత్తేజితులైన కార్యకర్తలు సమ సమాజాన్ని ఊహించగలరు; దానిని స్థాపించగలరు. ముందు సామాజిక విప్లవం వచ్చి తరువాత భావ విప్లవమా లేక మున్ముందు భావ విప్లవము తరువాత సామాజిక విప్లవమా, అలాకాక రెండూ సామాజిక విప్లవమూ, భావవిప్లవమూ, ఏకకాలంలో సాగాలా అనే అంశంపై అభిప్రాయ భేదాలుండవచ్చును. కాగా పాతకాలపు భావాలను చీల్చిచెండాడవలసిన అవసరం ఉంది.

స్త్రీలస్థితి మానవ సమాజ తొలి రోజుల్లోనుంచి ఇప్పటివరకు ఒక లాగునలేదు. మారుతూ వచ్చింది. ఆ మార్పులో ఒకదిశ కన్పిస్తున్నది. మరోఅంశాన్ని విస్మరించరాదు. ఏక కాలంలో ఒక దేశంలోఉన్న స్తితి మరోదేశంలో లేదు. కాగా సామాజిక పరిస్థితులు ఒకే రకంగా ఉండే దేశాలలో స్త్రీల స్తితి ఇంచుమించుగా ఒకేరకంగా ఉండేది. ఈ సూత్రాలను గమనించి మనం సామాజిక పరిణామాన్ని అధ్యయనం చేయవచ్చు.

మనిషి సగము పశువు సగము మానవుడుగా ఉన్న రోజుల్లో జంతు ప్రవృత్తి మానవునిలో ఎక్కువగా కన్పించేది. కోతి జాతినుండి ఉద్భవిల్లిన మానవజాతి తెలివైన జంతువుల సముదాయంగా ఉండేది, కేవలం మనుగడకే ప్రాధాన్యతను ఇచ్చే కాలమది.

జంతు వాసనతో జీవితం సాగించేది. ఆనాడు స్త్రీ పురుషులిరువురు కలసి ఆహారం సంపాదించు కునేవారు. కనుక పెద్దగా హెచ్చుతగ్గులకు అవకాశం ఉండేదికాదు.

వేటాడి పచ్చిమాసం తిని లేక తర్వాత కాల్చుకున్న మాంసాన్నితిని బ్రతికే రోజుల్లో స్త్రీలపై పురుషుల దౌర్జన్యం ఉండేదికాదు. ఇరువురు కలిసి వేటాడి ఆహార సముపార్జనం చేసుకునేవారు.

పశువులను మచ్చిక చేసుకొని వాటిని సాకి వాటి పాలతో, మాంసంతో జీవ యాత్ర సాగించేటప్పుడు స్త్రీలను తక్కువ చూపు చూడటం సంభవించలేదు.

అడవిలో కాయకూరలను పళ్ళనూ ఫలాలనూ ఏరి తెచ్చిన దశలో, పడి మొలిచిన ధాన్యపు మొక్కలనుండి ధాన్యాన్ని సేకరించిన దశలో స్త్రీ ప్రముఖపాత్ర వహించింది. కనుక ఆమెస్థితి దిగజారలేదు. వ్యవసాయయుగం ప్రారంభమయింది. మెట్ట వ్యవ సాయంలో గుంటక లేక గొర్రు తోలే వ్యవసాయ విధానం వచ్చింది. అపుడు కూడా స్త్రీలు గొర్రు తోలే వారు. నేలను సమతలం చేసే వారు. అపుడు వారు ప్రధాన భూమి కనే వహించారు సామాజిక ఉత్పత్తిరంగలో.

నాగలితో-కొయ్యనాగలిగాని ఇనుపనాగలికాని-వ్యవసాయం ప్రారంభం కాగానే కొంచెం శారీరక శ్రమతో కూడిన పని కనుక 'నేను చేస్తానులే అపని: నాగలి నేను దున్నుతాను' అన్నాడు పురుషుడు. తనకు తేలికపని కేటాయించి నందుకు స్త్రీలోకం సంతసించింది. ఆమెను ఇంటిపట్టున ఉండమన్నాడు పురుషుడు. అది అంతా తన మంచికే అనుకుంది ఆమె. అయితే పొలంలో పనిచేసి స్త్రీని ఇల్లాలును చేసిన పురుషుడికి ఒక సందేహం వచ్చింది. తను ఇంటికి దూరంగా పొలంలో ఉంటే, తన భార్య ఇంట్లో తనను విడిచిఉంటే ఆమెకు కల్గే సంతానం తనదయినట్లు ఎలా అని సందేహం కల్గింది దాంతో ఆమెకు కొన్ని కట్టుబాట్లు ఏర్పరచాడు. పర పురుషులతో మాట్లాడ వద్దన్నాడు. వారిని ఇంట్లోకి రానివ్వ వద్దన్నాడు. ఆమెకు పతివ్రతా ధర్మాలు బోధించాడు. ఆమె చేత వ్రతాలు చేయించాడు. తన సౌభాగ్యమే ఆమె సౌభాగ్యమని ప్రకటించాడు. ఇలా ఆమెను లొంగదీసుకున్నాడు.

ఈ పై ప్రక్రియ అంతా ఒకరోజులో జరగలేదు; ఒకదశాబ్దంలో జరగలేదు. వేల సంవత్సరాల క్రమంలో జరిగింది. మొదట్లో స్త్రీ ఎదురు తిరిగింది. పోరాడింది. చివరకు లొంగి పోయింది. అప్పటినుండి ఇప్పటివరకు అణచివేతకు దోపిడీకి గురి అవుతున్నది.

దీనినిబట్టి తేలిందేమంటే సామాజిక పరిణామంలో సమాజ ధోరణులకు, ప్రక్రియలకు స్త్రీ పురుషులు బానిసలు. కాగా పురుషుడికి స్త్రీ బానిస. అంటే బానిసకు బానిస అన్నమాట. అంటే సమాజమూ, పురుషాధిక్యత రెండూ ఆమెను అణచి వేస్తున్నవన్నమాట.

పైన వివరించింది ఒక పరిశీలనా విధానం. కాగా స్త్రీ పురుష సంబంధ సమస్యను మరో కోణంనుండి కూడా గమనించ వచ్చును.

ఒక తెగ ఒక భూభాగాన్ని ఆక్రమిస్తుంది. తమ పశువుల పెంపకానికి బీళ్ళు కావాలి కదా! బీళ్ళకోసం, పచ్చిక బయళ్ళ కోసం పోరాటాలు సాగుతాయి తెగలమధ్య, తండాలమధ్య, మానవ నాగరికత తొలిరోజుల్లో ఒకతండా మరొకతండాను యుద్ధంలో ఓడించేది. శత్రుతండాలోని పురుషులను చంపేపద్ధతి ఉండేది. కాగా స్త్రీలను అందులో ముఖ్యంగా యవ్వనంలోఉన్న స్త్రీలను చెరపట్టే వారు. వారిని భార్యలుగా, ఉంపుడు కత్తెలుగా వాడేవారు. కాలం గడిచింది. శత్రువులను చంపేదానికన్నా వారిని పశుతుల్యులుగాచేసి అంటే బానిసలను చేసి తమకు తమ సమాజానికి లాభకరంగా వాడుకునేవారు. పశువులను పెంచిన పద్ధతిలో బానిసలను పెంచేవారు. బానిస పురుషులకు బానిస స్త్రీలను భార్యలుగా ఇచ్చారు. వారి సంతానం బానిస సంతానం. వారు యజమాని ఆస్తి. ఈ బానిస సమాజంలో స్త్రీ పురుషులు బానిసలుగా ఉండేది. కాగా స్త్రీ పతికి బానిస, అలా రెండు రకాల బానిసత్వాన్ని ఆమె అనుభవించింది.

బానిసత్వంపోయి వ్యవసాయ రంగంలో అర్ధబానిసత్వం వచ్చిన రోజుల్లో కూడా స్త్రీ పరిస్థితి మారలేదు. కాగా ఆమె కొంతగాలి పీల్చుకోగల్గింది. వ్యవసాయ విప్లవం వచ్చి రైతుకు భూమిపై యాజమాన్యం వచ్చింది. కాని ఆస్థి పురుషునికి దక్కింది. స్త్రీ రైతుభార్యగా, అతని దయా దక్షిణ్యాలపై బ్రతికే జీవి అయింది.

పారిశ్రామిక విప్లవం వచ్చింది. మనిషి చేతితోచేసే పనులను యంత్రంతోచేయనారంభించాడు. యంత్రాలు నడపటానికి శ్రమశక్తి అవసరమయింది. గ్రామాలలో రుణభారంతో భూఖామందుకు కట్టుబానిసలుగా ఉన్న స్త్రీ పురుషులను విముక్తి చేసి పట్టణాలకు నగరాలకు తరలింప చేసింది సమాజం. భూస్వామ్య సమాజంలో యజమాని 'దయాదాక్షిణ్యాలపై' బ్రతికే రైతుకు కాస్త భద్రత ఉండేది. పారిశ్రామిక సమాజంలో అతడు కార్మికుడుగా, ఆమె కూలీగా తయారయ్యారు. ఆర్థిక భద్రత ఎగిరిపోయింది. కేవలం కూలిపై బ్రతకవలసి వచ్చింది. 16 నుండి 18 గంటలు పనిచేయాల్సిన పరి

స్థితి కల్గింది. ఈ సమాజంలో కూడా స్త్రీ పురుషుని అధీనంలోనే ఉండవలసి వస్తున్నది. కూలిడబ్బులు, నెలజీతం ఆమె చేతిలోకి వచ్చినా ఆమె వాటిని పతిదేవుని పాదపద్మాల వద్ద సమర్పించు కోవలసినస్థితి కొనసాగుతున్నది.

ఇక సోషలిస్టు సమాజాలు తీసుకుందాము. రష్యాలాంటి దేశంలో స్త్రీ పురుషులిద్దరూ 6 గంటలో 7 గంటలో రోజుకు పని చేస్తారు. వేతనం ఇద్దరికీ సరిసమానమే. కాని స్త్రీ ఇంటికి వచ్చినతరువాత కనీసం మూడుగంటలు వంటపని, ఇంటిపని చేయవలసి ఉంటుంది. ఇంటి యజమాని లేక ఇతర పురుషులు టి. వి. చూడటమో, నృత్య నాటికను లేక సినిమాను చూడటానికి థియేటరుకు వెళ్ళటమో చేస్తారు. కాకపోతే క్లబ్బులకు వెళ్ళి కాలక్షేపంచేస్తారు. ఇది దరహంమీద ప్రజానీకపు స్థితి. కనీసం భార్యతో గోష్టికైనా ఆయన ఇంటిలో ఉండడు. దాంతో ఆమెకు చిరాకు ఎత్తుతుంది. భర్తను నిలదీసి అడుగుతుంది. "నీకు కవిత్వం సంగతి, నాట్య శాస్త్రపు విషయం, చిత్రలేఖనం శిల్పం ఇత్యాది కళలగురించి తెలియదు కదా! నీతో ఏమీ మాట్లాడేది" అంటాడు. దాంతో ఆమెకు మరీ ఒళ్ళు మండుతుంది. భార్యాభర్తలు మాటామాటా అనుకుంటారు. విడిపోతారు. నగరాలలో క్రొత్త వివాహాలలో విడాకుల రేటు 50 శాతం, గ్రామాలలో 30 శాతం. ఇది శోచనీయ పరిస్థితి.

ఇక ముఖ్య విషయాలను కొన్నింటిని స్పృశిద్దాం. అమెరికా లాంటి పెట్టుబడిదారీ దేశాలలో సామాజిక ప్రజాస్వామ్యం ఉంది. స్త్రీపురుషులిరువురూ ఇంటిపనిని పంచుకుంటారు. ఆచరణలో ఆర్థిక ప్రజాస్వామ్యం కొంతవరకుఉంది. రాజకీయ ప్రజాస్వామ్యం లేదు. సమాజపు కీలకపు స్థానాలలోకి స్త్రీను దరిజేరనియ్యరు. రష్యాలో ఆర్థిక ప్రజాస్వామ్యం ఉంది. కీలక స్థానాలలో స్త్రీలసంఖ్య అత్యల్పం. సామాజిక ప్రజాస్వామ్యం లేదు. ఇంటి పనిలో పురుషుడు వేలుపెట్టడు. భారతదేశంలో లాప్రకారం రాజకీయ ప్రజాస్వామ్యం ఉంది. ఆచరణలో ఇంచుమించుగా ముఖ్యమని చెప్పవచ్చు. సామాజిక ఆర్థిక స్వాతంత్ర్యాలు సున్న. ఇవన్నీ దరహంమీద చేసే సూత్రీకరణలు. ఈ సూత్రాలకు మినహాయింపుగా ఉండే కుటుంబాలు వర్గాలు అన్ని దేశాలలోనూ ఉన్నాయి.

దీనినిబట్టి సామాజిక వ్యవస్థలు మారినా పాతకాలపు వ్యవస్థల తాలూకు భావాలు నూతన సామాజిక వ్యవస్థలలో కూడా మనగల్గుతున్నాయని తేలుతుంది. సూత్రం ముఖ్యంగా స్త్రీల దోపిడీ, ఆమె శ్రమశక్తిని, మేధాశక్తిని కారుచౌకగా సమాజం వాడుకోవటం అనేది ఒకటయితే పురుషాధిక్యతా భావబోదిత సమాజంలో పురుష ప్రాధాన్య

విలువలు స్త్రీల నెత్తిపై రుద్దబడతాయనేది రెండవది. స్త్రీపురుష అసమానత్వం అంత తేలికగా నశింపు కావటం లేదు.

ఇలాంటి సామాజిక భావాలు ఉదయించటానికి కారణం స్త్రీపురుషుల మధ్య పని విభజన ఒక కారణమయితే సమాజానికి అవసరమయిన సంతానాన్ని ఉత్పత్తిచేయటంలో స్త్రీ స్థానం రెండవదని ఎంగెల్సు చెప్తాడు. సామాజిక వస్తువుల ఉత్పత్తి, ప్రజా పునరుత్పత్తి రంగాలలో స్త్రీల స్థితిని గమనించిన తర్వాత చెప్పినమాటలవి. స్త్రీ అబల కనుక ఆమెకు రక్షణ అవసరం కనుక ఆమెను ఇంటిలో చల్లనిచోట కూర్చోపెట్టి పురుషుడు సామాజిక ఉత్పత్తి రంగంలో పనిచేస్తూ ఇతోధికంగా శ్రమిస్తున్నాడని సంప్రదాయవాదుల విశ్వాసం. ఇటీవల మరో సిద్ధాంతం వచ్చింది. పురుషుడు స్త్రీని తన స్వార్థంకోసం ఇంటిలోకి నెట్టలేదని స్త్రీయే తనకు భద్రత, సౌఖ్యం, విశ్రాంతి, భారమైన పని లేమికోరి పురుషుని బుజ్జగించి తానే బుద్ధిపూర్వకంగా గృహ సామ్రాజ్యాన్ని ఏలుకోవటానికి పూనుకున్నదని ఆ క్రమంలో తెలివితక్కువగా తన పతనాన్ని తనే కోరితెచ్చుకున్నదని ఈ వాదన సారాంశం. ఇది యుక్తియుక్తం కాదు. మాతృస్వామ్య వ్యవస్థనుండి పితృస్వామ్య వ్యవస్థకు మారేదశలో స్త్రీలు వ్యతిరేకించినట్లు పోరాడినట్లు చరిత్రకారులు చెప్తున్నారు. అదీగాక ఎవరూ బుద్ధిపూర్వకంగా తమ అధికారాన్ని - సమాజంలో కాని, ఇంటిలోకాని - వదలుకోరు. కనుక ఈ వాదనను త్రోసిరాజనాలి.

ఇకపోతే శారీరక బలం విషయంలో, ఒకనాడు సమానంగా శారీరక బలాన్ని ప్రదర్శించిన స్త్రీలు ఎందుకు శారీరకంగా బలహీనమయినారని విచారించాలి. శారీరక బలాన్ని చూపవలసిన పరిస్తితులు తక్కువఅయితే వాడుక లేక వాడుకలేని శరీరావయవాలు చిక్కిపోవటం, సన్నగిల్లిపోవటం సహజమే. దరహంమిద ఈ పరిణామం సంభవించింది.

అయితే వీటికి మినహాయింపు లేకపోలేదు. ఇప్పటికీ కొన్ని వర్గాలలోని స్త్రీలు తతిమ్మా వర్గాలలోని పురుషులకన్న శారీరకంగా బలవంతులని మనఅందరికీ తెలుసు. అసలు శారీరక బలానికి ప్రాధాన్యత ఇచ్చే రోజులు పోయాయి; పోతున్నాయి. చేతులతో చేయలేని పనులను యంత్రాలతో చేస్తున్నాం. ఒకనాడు పశుబలాన్ని వాడుకున్నాం. ఈనాడు యంత్రబలాన్ని వాడుకుంటున్నాం. స్త్రీ పురుషుల మేధాశక్తిలో వస్తుతః తేడాలు లేవు. కాగా కొన్ని రంగాలలో స్త్రీలను ప్రవేశించనీయనందునను, వారు చొరవగా ముందుకు రాలేకపోయినందువలనను కొన్ని విషయాలలో వారి మేధా

శక్తి తక్కువ అయినట్లుగా కన్పడుతుంది. కాని వాస్తవానికి ఆమె మేధస్సు, బుద్ధి పురుషునితో సమానమైనదే. కాగా అలవాటుప్రకారం, ఆచరణలో పురుషుని బుద్ధికి సానపెట్టడం జరిగింది. ఆమె బుద్ధి వజ్రతుల్యమైనా అది సానపెట్టబడని వజ్రం. అవకాశాలు ఇస్తే, వాటిని ఆమె వాడుకుంటే, ఆమె పురుషునితో అన్నిరంగాలలో సమదీటుగా నిలబడకలదు.

కేవలం గతాన్ని సమీక్షించుకుంటే చాలదు. గతకాలపు సమీక్ష భవిష్యత్ కార్యాచరణకు తోడ్పడాలి. ఆ దృష్టితో మాత్రమే గతసమీక్ష చేయటం జరగాలి.

స్త్రీ పురుషుల అసమానత దరహంమీద ఇలా ఉండాలి. సెక్సు జీవితంలో స్త్రీ సంకల్పాలకు విలువలేదు. ఎంతమంది పిల్లలను కనాలో భర్త నిర్ణయిస్తాడు. పిల్లల చదువులు, పెళ్ళిళ్ళు, గృహనిర్మాణం, ఆస్తి సంపాదన, ఆస్తిని ఎలా వినియోగించాలి, ఆస్తి నిర్వహణ, ఇరువురి సంపాదనపై ఆధిపత్యం, ఇరువురు ఏ వృత్తులను అవలంబించాలి, కుటుంబం ఎక్కడ నివశించాలి, ఎక్కడ స్థిరనివాసం ఏర్పరచుకోవాలి మొదలుగాగల ముఖ్యమైన కీలకాంశాలలో పురుషునిదే తుది నిర్ణయం. కనుక అసమానత పోవటంలేదు. ఈ అసమానతను ఎలా తొలగించాలనేదానికి పలువురు పలుమార్గాలను సూచించారు. పెక్కు సిద్ధాంతాలను ప్రతిపాదించారు. వాటిని ఇలా పేర్కొనాలి.

1. ఉదారవాద స్త్రీ విమోచన సిద్ధాంతం :- దీనిలో పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థను మార్చే ఊసు లేదు. కాగా తతిమ్మా అన్నివిషయాలలో స్త్రీపురుష సమానత్వాన్ని వాంఛిస్తుంది; దానికోసం కృషిచేస్తుంది.

2. మార్క్సిస్టు స్త్రీ విమోచన సిద్ధాంతం :- సోషలిజం వస్తే అన్ని సమస్యలు వాటంతటవే పరిష్కారమవుతాయని వారి విశ్వాసం. కనుక సోషలిజం కోసం కృషి చేయడం స్త్రీ పురుషుల విధ్యుక్త ధర్మం. అందుచేత స్త్రీలు తమ విమోచనకోసం చేసే ప్రణాళికలను, కార్యక్రమాలను, ఉద్యమాలను సామాన్య పోరాటాలకు, ఉద్యమాలకు లోబడి నిర్వర్తించాలి.

3. సోషలిస్టు స్త్రీ విమోచన సిద్ధాంతం :- సోషలిజం వచ్చినా దానంతట అదే స్త్రీ విమోచన సిద్ధించదు. దానికోసం అలాయిదాగా కృషి చేయాల్సిఉంటుంది కనుక స్త్రీ విమోచన కార్యక్రమమూ, సాధారణ కార్యక్రమమూ ఏక కాలంలో కొనసాగించాలి. సాధారణ కార్యక్రమం విజయవంతమై సోషలిస్టు సమాజస్థాపన తరువాత స్త్రీ విమోచన పోరాటం జరపడంకాని, స్త్రీ విమోచన కార్యక్రమం సాధారణ కార్యక్రమానికి లొంగి

ఉండడం కాని జరుగరాధు. సాధారణ కార్యక్రమం ప్రధానమైనదిగాను, స్త్రీ విమోచన కార్యక్రమము ద్వితీయ శ్రేణికి చెందినదిగాను భావించ వీలులేదు. దీనిని సృజనాత్మక కమ్యూనిస్టులు ఆమోదించి ఆచరిస్తున్నారు.

4. హ్యూమనిస్టు స్త్రీ విమోచన సిద్ధాంతం :- ప్రక్రియలో వీరికే సోషలిస్టు స్త్రీ విమోచన సిద్ధాంతవారులకూ తేడాలేక పోయినా ఆదర్శ సమాజరూపం విషయంలోను, నీతివిషయంలోను తేడాలున్నాయి. సోషలిస్టు స్త్రీ విమోచన వాదులకు సోషలిజం లక్ష్యమయితే హ్యూమనిస్టు స్త్రీ విమోచన వాదులకు సహకార శ్రేయోరాజ్యం ఆదర్శం. సోషలిస్టు స్త్రీ విమోచన వాదుల దృష్టిలో నీతి కేవలం సాపేక్షం. లక్ష్యసాధనకు ప్రాధాన్యత వస్తుంది. హ్యూమనిస్టు స్త్రీ విమోచన వాదులకు నైతిక విలువలకు శాశ్వత ప్రాతిపదిక ఉంటుంది. కాని దేశకాల పాత్రలను బట్టి నీతియొక్క రూపాలు మాత్రం మారతాయి. లక్ష్య స్వరూపానికీ, మార్గాల రూపాలకూ సమన్వయమే కాక సారూప్యం కూడా ఉండాలి. మంచి ఆదర్శాలను చెడ్డ పద్ధతుల ద్వారా సాధించలేమని అది నొక్కిచెప్తుంది.

ఇతర స్త్రీ విమోచన వాదాలు :— స్త్రీత్వం యొక్క గొప్పతనాన్ని విపరీతంగా నొక్కి చెప్పేది. 'రాడికల్ ఫెమినిజం'. వీరు పురుషద్వేషులుగా తయారవుతారు. మెక్సికో సభలో పురుషులను 'పురుష దురంహంకార సూకరాలు' అని తిట్టిన స్త్రీ, రవికెలను తగలేసి కేవలం చొక్కాలతో తిరిగిన స్త్రీలు అలాంటివారు. మరోవర్గం వారున్నారు. స్త్రీలకు మాత్రమే సహజంగా కొన్ని లక్షణాలు ఉంటాయని, అవి స్త్రీత్వలక్షణాలుగా పేర్కొన వలెనని, ఆ లక్షణాలు పురుష లక్షణాలకన్న మంచివని వారివాదన స్త్రీల సంస్కృతి ఉత్తమ మైనదని వారిభావం. దీనిని 'సాంస్కృతిక స్త్రీ విమోచన సిద్ధాంతం' అంటాం. దీనిని చివర వరకు కొనసాగిస్తే సమాజంపై స్త్రీల ఆధిపత్యాన్ని వాంచించేదాకా పోతుంది. అపుడు మరోరకపు అసమానత్వం సమాజంలో నెలకొంటుంది; సంఘర్షణ అనివార్యమవుతుంది. స్త్రీ పురుషుల సహజీవనం అసాధ్యమవుతుంది.

ఈ సందర్భంగా ఒకటి రెండు అంశాలను మనం గమనించాలి. సోషలిజం వచ్చిన రష్యాలో స్వార్ధ పర్వతం, పని తలాయింపు మనస్తత్వ, అధికార వాంచ, ఆశ్రిత పక్షపాతం, పెత్తందారీతనం, సదుపాయాలకోసం హక్కులకోసం తాపత్రయం సాధారణ ప్రజానీకం యెడ నిరాదరణ ఇలాంటి ధోరణులు నశింపు కాలేదని రష్యా కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి గోర్బచెవ్ ప్రకటించాడు. అందుకోసం సమాజ పునర్నిర్మాణానికి పూనుకున్నాడు. దానికి ప్రాధాన్యత ఇస్తున్నాడు. మావో సాగించిన సాంస్కృ-

తిక విప్లవ కాలంలో అసహనం, దుందుడుకు విధానాలు, 'పవిత్ర' మనస్తత్వ ధోరణులు ప్రబలాయి. కనుక కేవలం సమాజ స్వరూపానికే కాక ఆ సమాజ సాధనలోనూ, ఆ సమాజంలోనూ మానవ విలువలకు ప్రాధాన్యతనిచ్చే నీతికి పెద్దపీట వేస్తేనే కాని సత్వం, పెత్తందారీ తనం, అసమానత్వం, వర్గ సంకుచితధోరణి, అహంకారం, న్యూనతాభావం, కేవల స్వార్థపరత్వం నశించవు. అవి నశించనిదే, అవి నశించటానికి మనం కృషిచేయనిదే స్త్రీ విమోచన సాధ్యంకాదు; లభ్యంకాదు. తాత్కాలికంగా లభించి నట్లు కన్పట్టినా అది నిలువదు.

మరో అంశాన్ని పేర్కొని ఈ వ్యాసాన్ని ముగించవచ్చు. సమాజ పరిణామం మూసపోసిన ధోరణిలో ప్రపంచ మంతటా జరగ లేదు. వడిదుడుకులు, వ్యత్యాసాలు, తేడాలు, మార్పులు గోచరిస్తున్నాయి. ఒక దేశంలో స్త్రీకి సాంఘిక విషయాలలో స్వేచ్ఛ ఉంటే (ఉదాహరణకు రుగ్వేద కాలంలో స్త్రీలకు) మరోదేశంలో ఆర్థిక స్వేచ్ఛ ఉండదు. (ఉ॥ బ్రిటనులో, 1940 వరకు, వివాహిత స్త్రీ ఆస్తిపై భర్తదే యాజ మాన్యం.) అలాకాక ఒకే దేశంలోనే భిన్న కాలాలలో భిన్న విధానాలు ఉంటాయి. భారత స్త్రీ సామాజిక స్వేచ్ఛను కోల్పోయిన మధ్యయుగంలో ఆస్తిహక్కును పొందింది. కొన్ని తెగలలో సామాజిక స్వేచ్ఛ ఉన్నట్లు కనిపిస్తుంది. తీరా పరిశోధన చేస్తే అది మృగ్యమవుతుంది. 9వ శతాబ్దంలో కామసాని అను ఆమె రాణిగాఉంటే ఇంచుమించుగా అదే కాలంలో అస్సాంలో స్త్రీలు రాజరికం సాగించారు. 20వ శతాబ్దంలో ఇండియాలో సింహళంలో, ఇజ్రాయిలులో, బ్రిటనులో స్త్రీలు ప్రధానమంత్రు లయితే అలాంటిస్థితిని అమెరికా లాంటి అగ్రరాజ్యంలో కాని రష్యాలో కాని ప్రస్తుతం ఊహాతీతం. అయితే ఒక స్త్రీ రాజ్యం చేసినంత మాత్రాన స్త్రీలకు ఒరిగేదేమీ లేదు. ఆమె పురుష ప్రాధాన్య సమాజంలో, వారి సహకారంతో బలంతో అధికారాన్ని చలాయించినంత మాత్రాన పురుష ప్రాధాన్య సమాజపు నీతిని కాదనగల స్థితిలో లేదు. కాబట్టి దరహం మీద స్త్రీల స్థితి ఎలా ఉందని పరిశీలించాలి కాని పైపై పూత మెరుగులను చూచి మోసపో రాదు. ఆత్మ వంచనకు గడంగరాదు.

స్త్రీ విమోచనకు ఉద్యమమంటే స్త్రీలు కాని పురుషులు కాని మౌలిక అంశాలను, లక్షణాలను విస్మరించరాదు. మొదటిలో ఎక్కువమంది స్త్రీలు చైతన్యవంతులు కానపుడు పురుషులలో కొంతమంది సహృదయులు ముందుకువచ్చి స్త్రీ జనాభ్యుదయానికి పాటు పడ్డమాట వాస్తవం. ఈనాటి పరిస్థితి వేరు. ఇపుడు తమ విముక్తికోసం స్త్రీలే ముందంజ

వేయాలి. సహృదయులూ సంస్కారవంతులూ అయిన కొందరు పురుషులు వారికి మద్దతు ఇస్తారు. ప్రధాన బాధ్యత స్త్రీలదేనని విస్మరించరాదు.

భారతదేశం కాలమానం ప్రకారం 20వ శతాబ్దంలోనూ, పారిశ్రామికంగా 19వ శతాబ్దంలోను, భావాలపరంగా మధ్యయుగంలోనూ ఉన్నది. కనుక అన్ని యుగాల భావాలు బలీయంగా మనకు కన్పిస్తున్నాయి. ఏక కాలంలో మనగల్గు తున్నాయి. ఇపుడు ఈ పరిస్థితుల్లో క్రొత్త ఆలోచనలు ఉత్పన్న మవవలసి వస్తున్నది. వేదకాలపు ఆలోచనలు, ఏసుక్రీస్తు నాటి ఊహాపోహాలు, మహమ్మదునాటి సామాజిక రీతులు, మన్వాదుల శాసనాలు, 19వ శతాబ్దపు భావాలు, ఆమాటకు వస్తే 70, 30 ఏండ్లనాటి లెనిన్, మావోల భావ వారసత్వం మనలకు సంపూర్ణమైద పరిష్కార మార్గాన్ని చూపించదు. ప్రతిసమస్యను కూలంకషంగా పరిశీలించి, దాన్ని అంటి పెట్టుకొనియున్న సామాజిక పరిస్థితులను అధ్యయనంచేసి, ఆనాటి స్థితిగతుడకు ఈనాటి వాటికి ఉన్న తేడా గమనించి స్త్రీ విమోచన వాదులు తమ కార్యక్రమాన్ని నిర్ణయించు కోవాలని ఆకాక్షించటంలో తప్పులేదు.

# స్త్రీలు:అభివృద్ధి

అసలు అభివృద్ధి అంటే ఏమిటి? స్త్రీల అభివృద్ధిని గురించి ఈరోజుల్లో చాలా శ్రద్ధ చూపడం జరుగుతోంది. సభలు, సమావేశాలు, చర్చలు, సెమినార్లు విరివిగా జరుగు తున్నాయి. 'స్త్రీలు—అభివృద్ధి' అంటే ఏమిటి? స్త్రీ జనాభివృద్ధా? లేక స్త్రీల ద్వారా దేశాభివృద్ధా? అనే విషయం మళ్లా ఆలోచనీయాంశ మయింది. సర్వ సాధార ణంగా ఆర్థికాభివృద్ధి గురించే ఆలోచిస్తాం. ఆ అపోహ ఈనాడు సన్నగిల్లి పోయింది. వ్యక్తి పరంగా, సామాజిక పరంగా, ప్రాంతీయ పరమైన, దేశ పరమైన ఆర్థిక, సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక రంగాల్లోని అభివృద్ధినే అభివృద్ధి అని నిర్వచించ వచ్చు. ఈ విషయాలన్నీ ఒకదానిపై మరొకటి పెనవేసుకొని వున్నాయి. బహుకాలము నుండి ఆర్థిక రంగ మే ముఖ్యమనే భావన ప్రబలంగా వుండేది. తదుపరి కాలంలో ఆర్థికం మాత్రమే అభివృద్ధిని సమకూర్చ లేదని రుజువయింది. అయినప్పటికీ ఆర్థికాభివృద్ధి చాలా అవసరమనేది నగ్నసత్యం. మానవ శరీరానికి ఆర్థికమనేది పాదాలతో సమానం; దానికి సాంఘిక రాజకీయాలు రెండూ రెండు చేతులతో సమానమైతే సాంస్కృతిక అభివృద్ధి అనేది మేధస్సు (BRAIN)తో పోల్చవచ్చు. అందువల్ల సాంస్కృతిక అభి

వృద్ధే మానవ వికాసానికి దోహదకారి అనేది తథ్యమని తేలిపోయింది. 1966 తరువాత మావో సాంస్కృతిక విప్లవం చాలా అవసరమని ప్రచారం సాగించాడు. సాంఘిక, రాజకీయాభి వృద్ధులు ఆర్థికాభివృద్ధికి దోహదం చేస్తాయని పేర్కొనటం మంచిది.

ఇలా అన్ని రంగాల అభివృద్ధి కూడా ఒక దానితో మరోటి సంబంధాన్ని కలిగి వుంటాయని నిరూపించ వచ్చు. ఈ విషయంలో ఇంకా లోతుగా చర్చించే ముందు స్త్రీల యొక్క అభివృద్ధి, లేక 'స్త్రీలు: అభివృద్ధి' అనే అంశాలను గుర్తించటంలో వీటి తేడా ఏమిటో గమనించటం మన తక్షణ కర్తవ్యం. ఇందులో మొదటిది స్త్రీల అభివృద్ధి గానూ రెండోది అభివృద్ధి పథకాల్లో స్త్రీలు భాగస్వాములు కావటం అని చెప్పుకోవచ్చు. ఈ రెండవ దానిలో స్త్రీలు అభివృద్ధిని కేవలం తమ స్వార్థానికి తమ అభివృద్ధికి వాడు కోరు. కనుక మనం మొదటిది అంటే 'స్త్రీల అభివృద్ధి' అనే దాని మీదనే నొక్కు పెట్టాలి. ప్రపంచం మొత్తం మీద జనాభాలో సగంమంది స్త్రీలున్నారు. వారి అభివృద్ధి లేని దేశంకాని, సమాజం కాని మూడు పువ్వులూ, ఆరుకాయలుగా వికసించదు.

అభివృద్ధి యొక్క లక్ష్యం ఏమిటి? అని ఆలోచిస్తే సాంఘిక పరమయిన 'స్కీము'ల్లో స్త్రీలపాత్ర లేక వారి అభివృద్ధి ముఖ్య భాగమై వుండాలి. ఇంతరకు స్త్రీ అంటే పురుషుని సుఖానికి, ఆనందానికి, అవసరానికి కావాల్సిన ఒక పనిముట్టుగా చిత్రించింది మన సంప్రదాయం. ఆమె తనకు ఉపయోగించని, తన వున్నతిని కోరు కోని విధంగా మలచ బడింది. ఆమె శక్తి సామర్థ్యాలు, తెలివితేటలు, అన్నీ పురుషులు అంటే తండ్రి తాత, భర్త, కుమారుల సంక్షేమానికే వాడబడు తున్నాయి. ఆమె వారి కొరకే జీవించాల్సిన స్థితిలో వుంటోంది. కాని ఆధునిక వాతావరణంలో ఆమె ముందుగా తన వ్యక్తిత్వం కోసం బ్రతకాలనే వాదన ప్రబలంగా వుంది. అంటే ఒండొరుల స్నేహపూర్వక వాతావరణంతో, ఒకరి కొకరు సహాయపడే ఈ రోజుల్లో స్త్రీలు సైతం పురుష ప్రపంచానికి తమ తోడ్పాటును అందివ్వటం ధర్మ సమ్మతమే. ఏది ఏమయినా ఆమె తన అభివృద్ధికి ముఖ్య పాత్రధారి కాక తప్పదు.

స్త్రీ విమోచన సిద్ధాంతం:- స్త్రీ జనాభివృద్ధిని ఎలా కొనసాగించాలి? అన్నప్పుడు వైవిధ్యంతో కూడిన కొన్ని సిద్ధాంతాలను తెలిసి కొందాం. సిద్ధాంత పరంగా అవి అన్నీ స్త్రీ స్వేచ్ఛను, సమానత్వాన్నీ ప్రతిపాదించినా రూపాంత రాలలో తేడాలు వున్నాయి. ఆ సిద్ధాంతాలన్నీ స్త్రీ విమోచనను కోరినా విధానాలు మాత్రం వేరువేరుగా ఆలోచిస్తు న్నాయి. కనుక ఆ విధానాలు తెల్సుకొని ఏది ఆచరణయోగ్యమో ఏది కాదో ఆలోచిద్దాం.

లిబరల్ ఫెమినిజం— అనేది పెట్టుబడి దారీ సమాజ పరిధిలోనే స్త్రీకి స్వేచ్ఛ వుంటుందని వాదిస్తుంది. మార్కిస్టు ఫెమినిజం–సోషలిజం ప్రాతిపదికగా గల సమాజం మీద విశ్వాసం కలిగి ఉంటుంది. ఇది స్త్రీ విమోచన పోరాటం సామాన్య పోరాటం క్రింద లొంగి వుండాలంటుంది. కాని, సోషలిస్టు ఫెమినిజం అలా అనుకోవడం లేదు. సనాతన కమ్యూనిస్టుల యొక్క తత్వం మొదటిది అయితే సృజనాత్మక మార్కిస్టుల యొక్క తత్వం రెండవ పద్ధతిని ఆమోదిస్తుంది. రాడికల్ ఫెమినిజం- స్త్రీ తత్వమే గొప్పది అంటుంది. అంటే పిల్లల్ని కనడాన్ని స్త్రీ యొక్క ప్రత్యేకతగా భావిస్తుంది. స్త్రీత్వాన్ని స్త్రీ వునికిని ఉజ్వలంగా చిత్రిస్తుంది. ఇది పురుషుణ్ణి కించ పరుస్తుంది కూడా. స్త్రీ పురుషుల మధ్య సహకారం వుంటుందనేది విస్మరిస్తుంది. సాంస్కృతిక ఫెమినిజం- స్త్రీత్వాన్ని కాక స్త్రీ యొక్క గుణగణాలను, లక్షణాలను కీర్తిస్తుంది. స్త్రీలో శాంతి, దయ కరుణ, సహకారం, ఓర్పు, క్షమలాంటి గుణాలున్నాయనీ అందువల్ల స్త్రీత్వమే గొప్పదని పొగుడుతుంది; పురుషుణ్ణి తక్కువగా చూస్తుంది. ఇకపోతే అన్నిటి కన్నా చివరిది హ్యూమనిస్టు ఫెమినిజం దీనిని మానవార స్త్రీ విమోచన సిద్ధాంతం అని పిలువ వచ్చు. న్యాయమైన, సమానత్వ భావనతో కూడిన సహకార సమాజం ఈ సిద్ధాంతానికి ప్రాతిపదిక. అలాంటి సమాజాన్ని కొంత వరకైనా సాధించే క్రమంలో సామాన్య మానవ పోరాటాలతో పాటు అదే కాలంలో స్త్రీల పోరాటాలను కూడా నడప వలసి వుంటుంది. ఈ సిద్ధాంతం మనకు సరియైన, తగిన తత్వాన్ని అందించి మన చర్యలను సన్మార్గంలో వుంచుతుంది.

అసలు స్త్రీల అభివృద్ధి సమాజంలో జరిగిందా లేదా అని నిర్ణయించటానికి ఒక అంశాన్ని గీటు రాయిగా తీసుకోవాలి. అదేమంటే ఎన్నుకో బడిన కార్యక్రమం అభివృద్ధి సాధించటానికి ఉద్దేశింప బడినదై వుండాలి. అంతేకాక స్త్రీల అభివృద్ధిని సాధించ గలిగేదిగా వుండాలి.

ఆర్థికాభివృద్ధి:- పురుషలు తాము శ్రమ చేస్తున్నా తమ సంపాదన ద్వారా కుటుంబాలను పోషించలేక తమ స్త్రీ లను పనిచేయ నిస్తున్నారు. ఇది మధ్య తరగతుల లక్షణం. కార్మిక వర్గాల్లో స్త్రీలు పురాతన కాలం నుండి శ్రమిస్తూ, కూలి సంపాదించుకుంటూ కుటుంబం కొరకు కృషిచేస్తూనే ఉన్నారు. ఏదయినా స్త్రీలు జీవనోపాధికోసం పని చేయక తప్పటం లేదు. కాని వాస్తవమేమంటే, తన సంపాదనమీద, తన ఆదాయం మీద, తన ఆస్తిమీద స్త్రీకి యాజమాన్యం లేదు. వాటిని తన ఇష్టం వచ్చినట్లు వాడుకో

డానికి, నిర్వహించటానికి భర్త అధికారం చెలాయిస్తున్నాడు. కనుక స్త్రీల చేతుల్లో అధికంగా డబ్బు ఉన్నంత మాత్రాన ఒరిగేది ఏమీ లేదు. కనుక వారి జీవితాలను వారే నిర్ణయించు కోవటానికి సాయపడే విధంగా స్త్రీలకు పని కల్పించే కార్యక్రమాలు కాని, వారికి ఆదాయాలను ఒక గూర్చే కార్యక్రమాలు కాని చేపట్టాలి. ఇంతవరకు స్త్రీల యొక్క ఆర్థికాభివృద్ధి పురుషుల స్థితిని మెరుగుపర్చటానికి వుపయోగ పడింది. శ్రామిక స్త్రీలకు చాలా కొద్దిపాటి లాభం మాత్రం చేకూరింది. ఇక ముందు అలా జరగటానికి వీలులేదు. స్త్రీలకు అనుకూలమైన పద్ధతిలో ఆర్థిక కార్యక్రమాల లక్ష్యమూ, స్వభావమూ మారాలి.

సామాజికాభి వృద్ధి:- ఇంతవకూ కుటుంబంలో కాని, సమాజంలో కాని పురుషుడి కన్నా స్త్రీ తక్కువ హోదా కలదిగా యెంచబడు తున్నది. అనేవిషయం అందరికీ తెలిసిందే. సమాన స్థాయి ఆమెకు నిరాకరించ బడింది. సామాజిక సమస్యల పరిష్కారానికి జరిగే సామాజిక సమావేశాల్లో ఆమెకు ప్రవేశం లేదు. చివరకు తన జీవిత భాగస్వామిని ఎన్నుకునే విషయంలో కాని, తన పిల్లల సంరక్షకత్వంలో గాని ఆమెకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లేవు ఆమె అనేక కష్ట నష్టాలకు, ఇబ్బందులకు, అనర్హతలకు లోనయి పరిమిత పరిధిలో జీవయాత్ర సాగిస్తున్నది. ఈనాడు ఆమె ఆచారానికి, సంప్రదాయానికి, సామాజిక ఆర్థిక వ్యవస్థకూ, పురుషాధిక్యతకూ బానిసగా వుంటున్నది. అందువల్ల ఆమె వ్యక్తిగత హోదా, సామాజికహోదా పెరిగే లాగున సామాజికాభివృద్ధి జరగడం అవసరం.

రాజకీయాభి వృద్ధి:- స్త్రీలు రాజకీయ కార్య కలాపాలలో పాల్గొనకపోతే వారు సాధించుకునే ఆర్థిక ప్రయోజనం కాని, సామాజిక పురోగతి కాని, వారు సంపాదించు కోలేరు. ఒకవేళ సాధించుకున్నా దానిని స్థిరపరుచుకోలేరు. ఈ రెండు పనులు చేసినా వాటిని పెంపు చేసుకో లేరు. ఇంతవరకూ ప్రభుత్వంలో, పరిపాలనా వ్యవస్థలో, శాసన సభలో వున్న కీలక స్థానాల్లో స్త్రీల ప్రాతినిధ్యం నామమాత్రం; కేవలం అలంకార ప్రాయం. ఈ పరిణామ ప్రక్రియ మారాలి. స్త్రీలు తమకు తగిన స్థానాన్ని రాజకీయ వ్యవస్థలో పొందాలి. అనేక మంది సంస్కరణాభి లాషులు, ఉదారవాదులు అయిన పురుషులు మహిళాభ్యుదయానికి కృషి చేసిన మాట వాస్తవమైనా తమస్థితిని తాము మెరుగుపర్చు కోవటానికి స్త్రీలే బాధ్యత వహించాలనే పచ్చి నిజాన్ని మనం గుర్తించాలి. రాజకీయ ప్రక్రియలో సమర్థవంతులైన, స్వావలంబులైన స్త్రీలు ఇతోధికంగా పాల్గొనటానికి అవసరమైన కార్యక్రమాలను రూపొందించడం ప్రస్తుత మన కర్తవ్యం.

సాంస్కృతికాభి వృద్ధి:– తనయొక్క మేధా శక్తిని, శక్తియుక్తులను అభివృద్ధి పరచు కోటానికై స్త్రీ తన దృష్టిని కేంద్రీకరించ వలసి వున్నది. కనీసం తన ఆనందం కోసమయినా, సుఖ సంతోషాల కోసమయినా సంస్కారి అయిన స్త్రీ తన జీవిత భాగస్వామి కావటం అవసరమని పురుషుడు గుర్తించాలి. ఎవరి ప్రయోజనాల దృష్ట్యా చూచినా, ఏకోణం నుంచి పరిశీలించినా స్త్రీ యొక్క సాంస్కృతికాభివృద్ధి అత్యంతావశ్యకమని తేలుతుంది. సమ్యక్ వ్యక్తిత్వాన్ని సంపాదించు కోవడమే ఆమె తన లక్ష్యంగా స్వీకరించాలి. ఆ లక్ష్య సాధనకోసం ఆమెకు అన్ని అవకాశాలను చేకూర్చాలి.

విధానాలు:– ఇంత వరకూ మాతృత్వం, శిశుపోషణ పోషకాహార సముపార్జన స్త్రీ యొక్క అభివృద్ధికి కావాల్సిన అంశాలుగా పేర్కొన బడుతున్నాయి. ఈనాడు ఈ పరిధులను దాటాలి. ఉ॥ ఇంతవరకు గృహవిజ్ఞానం స్త్రీల కొరకు మాత్రమే ఉద్దేశింపబడింది. సంతాన కనే శక్తి స్త్రీకి మాత్రమే కలదన్నమాట నిజం. కాగా భార్యాభర్త లిరువురూ శిశుపోషణ చేయగలరు; చెయ్యాలి కూడాను. అలాగే గృహనిర్వహణ బాధ్యతను కూడా వారిరువురూ చేపట్టాలి కుటుంబ నియంత్రణ విధానాలు అందుబాటులోనికి వచ్చినందువల్ల అధిక సంతానంవల్ల కలిగే కష్టనష్టాల నుండి స్త్రీ విముక్తురాలవుతున్నది. కనుక ఇంత వరకూ పురుషులకు ప్రత్యేకముగా నిర్ణయించబడిన పనులను, ఉద్యోగాలను కూడా స్త్రీలు నిర్వహించటానికి వారికి అవకాశాలు కల్పించాలి; అందుకను వైన మార్గాలను సాధనాలను సమాజం అన్వేషించాలి. ఈ లక్ష్యాన్ని పెట్టుకొని తగిన కార్యక్రమాలను రూపొందించటం అవశ్య కర్తవ్యం.

స్త్రీలు సమాజంలో ఒక ప్రత్యేక 'సెక్షన్'. కనుక సమాజంలో వారికి న్యాయంగా రావల్సిన స్థానాన్ని సంపాదించుకొనే నిమిత్తం వారు మహిళా సంఘాలలో చేరి కృషిచేయవలసి ఉన్నది. అంతటితో ఆగక అందరికీ చెందిన ప్రజా సంఘాలలో కూడా వారు పురుషులతో కలిసి పనిచెయ్యాలి.

ఏ కార్యక్రమాలు మున్ముందుగా చేపట్టాలనేది వివాదాస్పదం కావచ్చును. ప్రప్రథమంగా సంపాదనను సాధించే కార్యక్రమాలా లేక విద్యా ప్రణాళికలా లేక చైతన్యాన్ని స్ఫూర్తినీ కలిగించే కార్యక్రమాలా, లేక సమానత్వాన్ని సాధించేవా, ఏవి ముందు, ఏవివెనుక అని తికమక పడటం సహజం. కాని అలాంటి సందేహాలకు తావు లేదు. సర్వతో ముఖ్యమైనకృషి ఇప్పుడు చాలా అవసరం. ఒకరకమైన కార్యక్రమాన్ని

చేపట్టినంత మాత్రాన తరిమ్మా వాటిని నిర్లక్ష్యం చేస్తున్నామని, నిరాదరణ చేస్తున్నామని భావించరాదు. సమ్యక్ దృక్పథం తగివున్నది; అది వాంఛనీయం కూడా. కనుక స్త్రీల అభివృద్ధికి సంపూర్ణమైన, సర్వతోముఖమైన కృషి చాలా అవసరం. ఆనాడే స్త్రీల అభివృద్ధి ఫలవంతమయి తద్వారా దేశమూ సమాజమూ పురోగమిస్తాయి. అందువల్ల ఈనాటి స్త్రీకి రెండు బాధ్యతలొచ్చాయి. తమను తాము ఉద్ధరించు కుంటూనే సామాజికాభివృద్ధికి తోడ్పడాల్సిన బాధ్యత కూడా ఆమె భుజస్కంధాలమీద పడ్డది. అయినా అతివలు అతి నేర్పుగా ఆ రెండూ నిర్వహించ గలరని ఆశిద్దాం.

# స్త్రీలకు రిజర్వేషన్లు కావాలి

మగువలు మగధీరుల నెదిరించారు–నిరుద్యోగులను పెంచారు. స్త్రీలకు కేటాయించిన రిజర్వేషన్ల వల్ల పురుషుల విద్యా ఉద్యోగావకాశాలు తగ్గిపోతున్నాయనేది తథ్యం. రిజర్వేషన్లు లేకపోతే కష్టపడి చదివి వుద్యోగాలు చేస్తారు. స్త్రీలకు విజ్ఞానం, శక్తి పట్టుదల, అలోచన అన్నీ వున్నప్పుడు రిజర్వేషన్లను పెంచడం జరిగితే అదివారిని అవమాన పరచడ మవుతుంది కనుక స్త్రీలకు రిజర్వేషన్లు అనవసరమని, వారికి స్వేచ్ఛ నిచ్చి వారి వ్యక్తిత్వాన్ని గౌరవిస్తే చాలని అప్పుడు వారికి వారే ఉన్నత స్థాయికి చేర గలరని ఒకరు ఆవేదనతో, ఆవేశంతో వ్రాశారు.

టీచరు ట్రయినింగులో 50% కల్పించారని, నర్సరీ టీచర్లు, నర్సులాంటి వుద్యోగాలు టైలరింగు ఎంబ్రాయిడరీ అద్దకాలు, లేసుల అల్లకాల లాంటివన్నీ స్త్రీల పరమయినాయని పొగిడారు ఈ ఉద్యోగాలన్నీ చాలా చికాకు కలిగించే పనులు. స్త్రీలకు చాలా ఓపిక, ఏకాగ్రత, శక్తి వున్నాయి. కనుకనే జిలుగు పనులు విసుగు పుట్టించే పనులు వారికి కేటాయించి ఉన్నత పదవులు, అధికార పదవులు, ఆర్థికాధిపత్యం వహించే ఉద్యోగాలు పురుషులు నిర్వహిస్తున్నారు. కేవలం టీచర్సు, నర్సులు, టైపిస్టులు, 'పి. ఏ'లు లాంటి వుద్యోగాలు వీరికిచ్చి జీతాలు తక్కువ ఇచ్చి పురుషులు ఆధిపత్యం వహిస్తున్నారు. ప్రపంచ ఆదాయంలో 60% స్త్రీల చాకిరి వల్ల వస్తుంటే వారు అనుభవించేది 10శాతం అని" ఆర్థిక వేత్తలే తేల్చి చెప్పారు. అందువల్ల ఈ చాకిరీ కూడా ఏదో దయాధర్మాల మీద ఇస్తున్నట్లు చెప్పుకోవటం అవహేళన అనక తప్పదు.

ఒక స్త్రీ రిజర్వేషన్ల ద్వారా ఉన్నత విద్య-ఎం. ఏ., పి హెచ్.డి. లాంటివి–చదివి డాక్టర్ ఇంజనీర్ చేసి పెళ్ళాడుతుంది. ఆమె భర్త ఏ గుమస్తా, లేక వుద్యోగియైనా ఆమెను వృత్తిమానిపించి ఇంటి పని పిల్లల పనిలోకి నెట్టేస్తున్నాడు. అందువల్ల మరో యువకుడికి సీటు పోతూంది. ఉద్యోగమూరాదు. ఇది నిరుద్యోగ సమస్యను క్లిష్టం చేస్తున్నది. అంతేకాదు ఇలా చదువుకున్న స్త్రీలు ఎంత వరకు ఆ విద్యను వుపయోగించు కుంటున్నారో ఆలోచించకుండా ఏదోచేసినట్లు చేతులు దులిపేసుకోవటం సబబు కాదట. తగాదా పెట్టిన పెద్దమనిషి ఈ విషయంలో సునిశితంగా ఆలోచించ లేదని పిస్తోంది. టెక్నికల్ కోర్సులుగాని, పెద్ద చదువులుగాని చదివిన ఏ ఒక్క స్త్రీ కూడా ఈ రోజుల్లో ఇంట్లో కూర్చోవటం లేదు. కాకపోతే కరస్పాండెన్సు కోర్సులు కేవలం విజ్ఞానానికో, డిగ్రీలకో, కాలక్షేపానికో చదివే వారుంటే వుండవచ్చు. వారు సైతం 90%

ఉద్యోగాన్వేషణ చేస్తూనే ఉన్నారు. కాని స్కాలర్ షిప్పుల వల్లగాని, రిజర్వేషన్ల వల్ల గాని, ఉద్యోగాపేక్షతో చదివిన వారుగాని ఏ ఒకరిద్దరో తప్ప వంటఇంటికే పరిమితం కావటం లేదు. పైగా వారు ఇంటిపని చూచు కుంటూనే ఉద్యోగ ధర్మాన్ని నిర్వర్తి స్తున్నారు. ఏ ఒక్క 'కేసో' పట్టుకొని వాదించడం అసందర్భం. అంతేకాదు. నిజానికి కొన్ని సందర్భాలలో ఉద్యోగపు స్వేచ్ఛను స్త్రీ తన వివాహంతో పోగొట్టు కుంటోంది. ఇది పురుష ప్రపంచం కావడమే కారణం; పురుషాధికారం మీదనే ఈ సమాజం నడు స్తోంది. అతనెలా శాసిస్తే అలా జరగాలి, కాదంటే మరి స్త్రీకి చోటులేదు. ఆ పరిస్థితిని తట్టుకో లేనివారు ఉద్యోగాలు మానేసి గృహిణులుగానే బ్రతుకుతున్నారు. ఇదెవ్వరి లోపం? ఎవరి నేరం? నిస్సందేహంగా పురుషులదే. ఒకవెంప అర్హత ఉన్నా ఉద్యోగం నేయనీయక మరోవైపున ఉద్యోగం చేయటం లేదుగనుక విద్యా విషయకంగా ప్రోత్సాహం కూడదనే కుతర్కంతో కూడిన వాదన 'పురుష పుంగవులకే' చెల్లును.

అనేక రంగాలలో అనేక రకాలుగా శక్తి సామర్థ్యాలను నిరూపించుకున్న మహి ళలు రిజర్వేషను కోరటం అనుచితమని కొందరు పురుషుల భావం. ఇక్కడ పెద్ద పొర పాటు ఉన్నది. రెండు తరగతుల పౌరులను పోల్చిచూచుటపుడు సర్వ సామాన్యమైన అంశాలను తీసుకుంటాము. అలానే స్త్రీ పురుషుల విషయం. పురుషులలో ఎంత శాతం ప్రతిభా వ్యుత్పత్తులను ప్రదర్శించ గలుగు తున్నారు. స్త్రీలలో ఎంతశాతం అనేది ముఖ్యాంశం వస్తుతః తెలివి తేటల విషయం కాదు. అవకాశాలు శిక్షణ, సదుపాయాలు పురుషులకు ఎక్కువ. కనుక వారిలో అధిక శాతం రాణించ గల్గుతున్నారు. ఈ విష యాన్ని విస్మరించి స్త్రీలలో ప్రతిభావంతులు ఉన్నారు కనుక రిజర్వేషనులు అక్కర లేదని వాదించటం తప్పు.

ఒకవైపు స్త్రీలకు విద్య అక్కర లేదని వాదించేవారు అనంతంగా ఉన్నారు. వివాహంతో విద్య మాన్పిస్తున్నారు. మరో వైపు. ఇదంతా చూస్తే అమ్మాయి ఇంటి పనికి అబ్బాయి ఉద్యోగానికి అంకితం కావాలనే భావన ప్రస్ఫుటంగా దర్శన మిస్తోంది. ఈనాడు ఇలాంటి ఆలోచన గర్హనీయం.

మహిళలకు 30%, ఎస్.సి., బి.సి., ఎస్‌టి, వికలాంగులకు మాజీ సైనికులకు కేటాయించినది పోగా కేవలంగా 15% మాత్రమే బహిరంగ సీట్లు అందరికీ అందు బాటులో ఉంటున్నాయని మరో వాదన. ఇదీ పొరపాటే. రిజర్వు అయిన ఎస్. సి. సీట్లలో స్త్రీలకు 30 శాతం, అలాగే అన్ని వర్గాలలో. అలావచ్చిన స్త్రీలను లెక్కలోకి తీసుకొని మొత్తంమీద స్త్రీలు 30 శాతం ఉన్నారా లేదాఅని చూస్తారు.

సమాన హక్కులు కావాలంటున్నపుడు ప్రత్యేక హక్కులు కోరడం అసంద ర్భమని కొందరు, రిజర్వేషనులు ఉన్నంత కాలం స్త్రీలలో విద్వత్తు పెరుగదని మరి కొందరు, ఎవరి వ్యక్తి వికాసానికి వారే కృషి చేయాలని మరొకరి దయా దాక్షిణ్యాదు లపై ఆధార పడడం తప్పని ఇంకా కొందరు వాదిస్తున్నారు. ఈ వాదనలు ఏదో సాకుతో స్త్రీల తిరోగమనానికి దారితీసేవి.

రిజర్వేషను ప్రశ్న అసలు ఎందుకొచ్చింది? తర తరాలుగా వెనుక పడ్డది స్త్రీజాతి. ఎన్నో విధాలయిన అడ్డంకులు వారిని అనుక్షణం అణగ త్రొక్కు తున్నాయి. వారిని వంట ఇంటిలోకి నెట్టి వేసింది సమాజం. అలా ఇబ్బంది స్థితిలో ఉన్న స్త్రీలను ఒక్క సారిగా పురుషులతో సమానంగా ఎదగ మంటే సాధ్యమా? ఉదాహరణకు 50 కిలోల బరువున్న వారిని 100 కిలోల బరువున్న వారితో పోటీ పడమని అనగలమా! పరుగు పందెంలో బలహీనులను కొంత దూరం ముందుగా నుంచోపెట్టి పరుగెత్త మంటాము కదా! అలాగే స్త్రీలకు రిజర్వేషను ఇవ్వటం న్యాయం. ఎస్‌సి., ఎస్‌టి.లకు ఏ కారణం వల్ల రిజర్వేషనులు ఇస్తున్నారో ఆ కారణం వల్లనే స్త్రీలకు ప్రత్యేక సదు పాయాలు కల్గించాలి. కొంత కాలం వరకు ఇది తప్పదు. స్త్రీలకు అనవసర మయి నపుడు వారే వద్దని ప్రకటించ గలరు.

అసలింతకు నిరుద్యోగం అనేది సమాజంలో ఉన్నపుడు స్త్రీ పురుష లిద్దరిలో ఎవరు నిరుద్యోగి అయితే ఏమి? భేదం, తారతమ్యం ఎందుకు? ఎవరికి శక్తి సామర్థ్యా లుంటే ఎవరికి అవకాశముంటే వారికి ఉద్యోగం దొరుకుతుంది. రెండోవారు ఇల్లుచూచు కుంటారు. ఉద్యోగం కేవలం పురుష లక్షణమని, గరిటె పనిపూర్తిగా స్త్రీ బాధ్యత అని అనుకోవటం వల్లనే ఈ రకపు అపభ్రంశపు ఆలోచనలు చోటు చేసు కుంటున్నాయి. ఉద్యోగినులు పెరగటం వల్లనే పురుషులు నిర్వీర్యులవు తారనుకోవటం చాలా పొరపాటు భావం. తరతరాలుగా అధికారాన్ని ఉద్యోగపు హోదాను అనుభవిస్తున్న పురుషులు స్త్రీలు అభ్యుదయ మార్గాన పయనించటాన్ని సహించలేని వాదం ఇది. పురుషులే సర్వదా ఉద్యోగులుగా ఉండాలనే అహంభావం సమర్థనీయం కాదు. ఈ వాదన తర్కా నికి నిలవదు. న్యాయ సూత్రాలకు అనుగుణం కాదు.

స్త్రీలకు రిజర్వేషనులు ఉంటే పురుషులకు నష్టమని, స్త్రీలు ఉద్యోగంచేస్తే పురుషులలో నిరుద్యోగం వస్తుందని పురుషజాతిని భయ భ్రాంతులను చేయడం నింద్యం. 'మీరు ప్రతిభావంతులు మీకు రిజర్వేషనులు అక్కర లేదన'డం మరో ఎత్తుగడ. అన్నింటికన్న మిన్న 'మిమ్మల్ని మీ గుమస్తా భర్తలు ఉద్యోగాలు చేయనీయరు కనుక మీకు చదువు దండుగ' అనడం చావగొట్టి చెవులు మూయడం లాంటిది. ఇంత కన్న అవమానకరమైన విషయం మరొకటి ఉండదు. స్వార్థ తత్వ ప్రదర్శన, బుజ్జగింపు, బెదిరింపు ఇలా అన్నిటినీ వాడి స్త్రీజాతిని వెనుకకు నెట్టే ప్రయత్నాన్ని సహృదయులు ఆమోదించరు; హర్షించరు.

# కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు: ఒక పరిశీలన

కుటుంబ నియంత్రణ విధానాన్ని అనేక కారణాల వలన ఆమోదించ వచ్చును. వ్యక్తి సంక్షేమానికి, కుటుంబ సౌభాగ్యానికి, దేశ కళ్యాణానికి, దానిని సాధనంగా స్వీకరించ వచ్చును. అపరిమిత సంతానం స్త్రీ ఆరోగ్యాన్ని భంగ పరుస్తుంది. ఆమెపై అతి ఎక్కువ భారాన్ని మోపుతుందని, తండ్రికి ఆర్థికకంగా చిక్కులు తెచ్చి పెట్టుందని కుటుంబ నియంత్రణను అభిమానించటం కద్దు. తల్లి దండ్రులకు తీరిక లేకుండా చేసి వారి సాంస్కృతికాభి వృద్ధికి ఆటంక మవుతుందని తలంచి సంతాన భారాన్ని అభిల షించని పరిస్థితి వస్తుంది. అంతేగాక పెరుగుతున్న జనాభాకు విద్యా వైద్య ఆహార ఉద్యోగ వసతులను ప్రభుత్వం కల్పించలేని స్థితి ఏర్పడు తుందని ప్రభుత్వాలు పరి పాలకులు తలంచి కుటుంబ నియంత్రాన్ని ప్రోత్స హిస్తున్నారు.

మున్ముందుగా కొన్ని వ్యతిరేక ధోరణులను పేర్కొనడం అవసరం. జనాభా ఎంతగా పెరిగితే అంతగా విప్లవావకాశాలు పెరుగు తాయని భావించే వారున్నారు. వీరిది పొరపాటు అభిప్రాయం. బీదరికం పెరిగినంత మాత్రాన, జనాభా వృద్ధి పొంది నంత మాత్రాన దేశాలలో విప్లవ శక్తులు పెరగవు. అలాగయితే బెంగాలులో కరువు వచ్చి నప్పుడు. (బ్రిటీషు వారి రోజుల్లో) విప్లవం రావలసి యుండెను. రాలేదు. విప్లవం రావడానికి రెండు అంశాలు అవసరం. ఒకటి బాహిర పరిస్థితి. రెండవది ప్రజల మానసికస్థితి. ప్రజలు విప్లవ చైతన్యంతో తొణికసలాడకపోతే బాహిర పరి స్థితులు ఎంత అనుకూలంగా ఉన్నా విప్లవం రాదు. ఎంత బీదరికం ఉంటే అంతగా విప్లవం రావడానికి అవకాశం ఉంటుందను కోవటం-ఒక రకంగా-విధివ్రాత లాంటిది. వ్యక్తి గతంగాను, సమిష్టిగాను, విప్లవ చైతన్యం కలవారు తమ బాధ్యతను విస్మరించ డానికి, మానసిక క్లేశాన్ని నివారించు కోడానికి ఈ వాదన ఉపకరిస్తుంది. ఇక పోతే జనాభా పెరుగుదల వల్లనే బీదరికం వస్తుందనడం మరో రకపు వితండ వాదం.

ఈనాటి ఆర్థిక వ్యవస్థ, ప్రణాళికల తీరు, సామాజిక నిర్మాణం, రాజకీయ సంఘటనా స్వరూపం, సాంస్కృతికస్థాయి అన్నీ బీదరికం ప్రబలడానికి కారణాలు. అయితే ఒక్క అంశాన్ని మరవరాదు. జనాభా పెరుగుదల బీదరికాన్ని పెంచుతుంది. ప్రస్తుత పరిస్థితుల్లో ఒకనాడు అది సమాజానికి ఉపకరించింది. ఈనాడు సమాజ సంక్షే మానికి నష్టదాయకంగా పరిణమిస్తున్నది.

ప్రభుత్వాలు ప్రజలకు కనీస అవసరాలను తీర్చలేక జనాభా పెరుగుదలను గురించి ప్రచారం చేస్తున్నాయని మరోవాదన ఉంది. ప్రభుత్వాల పనితీరు సంతృప్తి కరంగా లేనిమాట వాస్తవమే. ప్రణాళిక ఫలితాలు కొద్దిమందికే అందుతున్న వనటం నిజమే. కాని కుటుంబ నియంత్రణ అవసరాన్ని వ్యక్తిగత దృష్టితో, కుటుంబ సంక్షేమ భావంతో పరిగణిస్తే దాని ఆవశ్యకతను కాదనలేము. కొంతమంది ప్రజోపయోగ కార్య క్రమాలను చేపట్టాలని కోరుతూ, దానికై వారికి బరువు భారం నుండి విముక్తిని ఆకాంక్షిస్తూ కుటుంబ నియంత్రాన్ని కుటుంబ పరంగా చేపడుతున్నారు. కాని వారే కష్ట జీవులను, శ్రామికులను ఈ కార్యక్రమాలకు దూరంగా ఉండదని ఉద్బోధిస్తున్నారు. ఈ వైఖరి శోచనీయం.

ఇక ప్రభుత్వం చేపట్టే కార్యక్రమాలను పరిశీలించడం అవసరం. మొదట్లో ఏ వ్యక్తికి ఏరకమైన కుటుంబ నియంత్రణ విధానాన్ని అవసరమో దానిని అందించ డానికి దానికి సలహాలివ్వడానికి ఒక కార్యక్రమాన్ని రూపొందించారు. దీనిని వైద్య సలహా విధానం (CLINICAL APPROACH) అంటారు. తరువాత ఒకటో లేక మరొకటో కుటుంబ నియంత్రణ విధానాని ప్రచారం చేయటం, దానిని మూక ఉమ్మడిగా అమలు పరచటం (CAMP APPROACH) అమలులోకి వచ్చింది. ఇలా క్యాంపులు పెట్టి ఆపరేషనులు చేస్తుంటే ఆపరేషన్ తర్వాత ఆపరేషను చేయించుకున్న మనిషిని గురించి పట్టించుకోవడం జరగ నందున కొన్ని కష్టనష్టాలు సంభవించాయి. దాంతో ఆ పద్ధతికి స్వస్తిచెప్పి సమీకృత విధానాన్ని అమలు పరుస్తున్నారు. మాతాశిశు సంక్షణ కార్యక్రమంతో జోడించి ఇపుడు కుటుంబ నియంత్రణ కార్యక్రమాలను నడి పిస్తున్నారు. దీనిలో కొన్నిలోపాలు కన్పిస్తున్నాయి. స్త్రీలపై నొక్కిపెట్టి కార్య క్రమాన్ని నడపటం ఒకటి. ఆపరేషనులు ప్రచారాలు అన్నీ స్త్రీలనే మనస్సులో పెట్టుకొని జరుగు తున్నాయి. పైగా అవివాహిత స్త్రీలను, విడాకులు పొందిన స్త్రీలను, వితంతువులను ఈ కార్యక్రమ పరిధిలోకి తేవటం లేదుకదా! ఇక్కడ సామాజిక నీతి రంగ ప్రవేశం చేస్తున్నది. అనవసర విషయాలు ప్రాధాన్యత వహిస్తున్నాయి. వ్యక్తి శ్రేయస్సు, వ్యక్తుల నిర్ణాయక శక్తి ప్రాముఖ్యత కోల్పో తున్నాయి. ఈ పద్దతిలో.

కుటుంబ నియంత్రణ పద్ధతులు:— వీటి స్వభావాన్ని కేవలం బాగోగులను పట్టి నిర్ణయించే స్థితి లేదు. ఇపుడు మనది పితృ స్వామ్యసమాజం; పురుషాధిక్య సమాజం. కనుక ప్రభుత్వం ఆచరించే విధానాలు, ప్రజలు ఆమోదించే పద్ధతులు పురుషాధిక్య విలువల మీద ఆధారపడి ఉంటున్నాయి. ఉదాహరణకు పురుషులు వాడే నిరోధక పద్ధ

తులు, వంధ్యాకరణ ఆపరేషనులు చాల తేలికయినవి. ఎక్కువ కష్టాన్ని, నష్టాన్ని కలుగ జేయవివి. కాగా భార్య చనిపోతే తను మరల పెండ్లాడటానికి వంధ్యాకరణ ఆపరేషను తనకు అడ్డువస్తుందని. లేక తన శారీరక మానసిక లైంగిక ఆరోగ్యానికి భంగం కలుగు తుందని పురుషుడు భయపడుతున్నాడు మొదటిది అమానుషమైన ఆలోచన; రెండవది అవాస్తవం. అలాంటి ఆపరేషనులను ఒకనాడు దరహం మీద చేపట్టిన ప్రభుత్వం స్త్రీలయెడ తన దృష్టిని మళ్ళించింది. సమాజంలో పురుషాధిక్యతకు ఇది లొంగి పోవడం తప్ప మరేమికాదు. పురుషాధిపత్య విలువలను ఆమోదించుటయే అంతే కాదు. పురుషుల నుండి వ్యతిరేకత రాకుండా చేసుకోవటమే. (ఉత్తర భారత దేశంలో ఆత్యయిక పరిస్థితి కాలంలో పురుషుల వంధ్యాకరణ ఆపరేషన్లు బలవంతంగా చేయించడంతో మొత్తంమీద వీటి యెడ వ్యతిరేకత రావడం మనందరికి తెలుసు.) ఇది తేలికగా కనిపించ వచ్చును కాని ఇది అన్యాయమైన మార్గం; అక్రమమైన విధానం. పురుషులలో ఈ ఆపరేషనుల యెడ సుముఖతను కలుగ జేయటం ప్రజా నాయకుల విధి; కర్తవ్యం కూడాను అయితే నాయకులలో ఎక్కువ మంది పురుషులు కావడం, ఎక్కువ మంది బహు సంతాన వంతులు కావడం వలన వారు ఆపనికి పూనుకోలేక పోతున్నారు. ఇది గమనించ దగిన విషయం; మార్చుకోవలసిన పరిస్థితి.

స్త్రీలలో వ్యాప్తిచేస్తున్న సాధనాలు :- (i) సహజ పద్ధతి:-(NATURAL METHOD) ఒకనాడు ఈ పద్ధతిని గురించి ప్రచారం జరిగింది. కాగా స్త్రీలతో 100 కి 80 మందికి అక్షరాస్యులు కాక పోవడంతో, వారికి లెక్కలు రాకపోవడంతో, బహిష్టు రోజునుండి రోజులను లెక్కవేయలేక పోవడంతో దీనిని ప్రజలు అంతగా పట్టించుకోలేదు. పైగా శరీర ఉష్ణోగ్రతను బట్టి ఆ పద్ధతిని వాడేటంత పరిజ్ఞానం ప్రజలకు లేకపోయింది. అదీగాక 100కి 80 పాళ్ళు మాత్రమే విజయవంతం కాగల పద్ధతి ఇది. దాంతో అనేక చికాకులు రావడం మామూలు.

(ii) నిరోధ పద్ధతి (BARRIER METHOD) ఈ పద్ధతులను వాడటానికి స్త్రీలు తమ శరీరంలో కొన్ని తొడుగులను చొప్పించుకోవాలి. డయాఫ్రంలు అలాంటివి. కాగా వాటిని తమ శరీరాల్లో అమర్చు కోవటానికి స్త్రీలకు ఏకాంతత అవసరం. అది వారికి ఇళ్ళలో దొరకక పోవటంతో శ్రామిక మహిళలకు అది అందుబాటులోకి రాలేక పోతున్నది. పైగా తమ శరీరాలను శుభ్రపరచు కోవటానికి తగిన నీరు, ప్రదేశం వారికి లభించటం లేదు. అయితే దరహంమీద ప్రచార చేస్తే ఇది అసాధ్యం కాదు. మెక్సికో లాంటి బీద దేశాల్లో ఇది ఫలప్రదమయింది.

లూపు: వైద్యుని ద్వారా లూపులను అమర్చుకోవడం మరియొక పద్ధతి. ఒక స్త్రీ శరీరంలో లూపు అమర్చేముందు ఆమెలో వ్యతిరేక లక్షణాలు—అంటే ఈ పద్ధతి సరిపడని లక్షణాలు—ఉన్నాయేమో వైద్యులు చూడాలి. లూపు క్యాంపులు పెట్టి బాహుళ్యం మీద, ప్రత్యేక శ్రద్ధ చూపకుండా ఈ కార్యక్రమం అమలు పరచినందున ఈ పద్ధతి అప్రతిష్ట పాలయ్యింది. వ్యక్తిగతంగా స్త్రీ యొక్క శరీర తత్వాన్ని లెక్కకు తీసుకొని, వ్యతిరేక లక్షణాలు కన్పించని పక్షంలో లూపును అమర్చటం అభిలషణీయమే. కాని జిల్లాకు, తాలూకాకు ఇన్ని లూపుల అమర్చాలి అని లక్ష్య నిర్దేశంచేసి, స్త్రీల శరీర తత్వాలను ఖాతరు చేయకుండా ప్రభుత్వం వ్యవహరించి ఈ పద్ధతిని ప్రజలు అనుసరించే అవకాశాన్ని సన్నగిల్ల జేసింది. ఇది ఒక బ్రహ్మాండమైన లోపం.

మాత్రలు:— ఇవి అనేక రకాలుగా ఉంటున్నాయి. వీటిని స్త్రీలు తీసుకోవాలి. కాగా వీటిలో కొన్నింటి వాడకం అనేక అసౌకర్యాలకు స్త్రీలను లోను చేస్తున్నాయి. తల నొప్పి, నడుం నొప్పి లాంటి బాధలకు వాళ్ళు లోనగుతున్నారు. అంతే కాక మరో ప్రమాదం సంభవిస్తున్నది. కొన్ని బహుళజాతి వ్యాపార సంస్థలు అభివృద్ధి చెందిన దేశాలు నష్టదాయకంగా ఉన్నాయని త్రోసి పుచ్చిన మాత్రలను తృతీయ ప్రపంచ ప్రజలపై రుద్దుతున్నారు. అభివృద్ధి చెందుతున్న, అభివృద్ధిచెందని దేశాల ప్రజలను—అందులో స్త్రీలను—అక్రమంగా అన్యాయంగా దోచుకుంటున్నారు. దీనిని ప్రభుత్వం ఎంతో జాగ్రత్తను ప్రదర్శించి అరికట్టవలసియున్నది. ఒకనాడు భారీఎత్తున మాత్రల వాడకాన్ని ప్రోత్సహించిన ప్రభుత్వం ఇప్పుడు పస్తాయించటం ముదావహం.

వంధ్యాకరణ ఆపరేషనులు:- 'వాసెక్టమీ" ఆపరేషనుపై నొక్కు తప్పించి (పురుషుల ఆపరేషను) స్త్రీల ఆపరేషనులపై శ్రద్ధచూపుతున్నది ప్రభుప్వం. ప్రోత్సహకంగా ఎక్కువ పైకం ఎర చూపించి స్త్రీలకు ఆపరేషన్లు చేయిస్తున్నది. ట్యూబెక్టమీ ఆపరేషనుల వల్ల స్త్రీలు—పురుషుల ఆపరేషను విధానంలో పురుషుల కన్న ఎక్కువగా- ఇబ్బందుల పాలయ్యారు. వారు ఎక్కువ కాలం విశ్రాంతి తీసుకోవలసి వచ్చింది. శ్రామిక స్త్రీలకు విశ్రాంతి సులభంగా దొరికేది కాదని మనందరికీ తెలుసు. తరువాత 'లాప్రస్కోపీ" ఆపరేషను వచ్చింది. కాగా దీనిని అందరు వైద్యులూ చేయలేరు. స్త్రీల వైద్యం తెలిసిన వారే చేయగలరు. ఇది అందరికి మూక ఉమ్మడిగా అనుసరించదగు పద్ధతి కాదు. కొంత వ్యక్తిగతమైన శ్రద్ధ తీసుకోవలసి యున్నది. ప్రభుత్వ కార్యక్రమాలలో అది లోపించటం తరుచు సంభవిస్తున్నది. కాగా 'మినీలాప్రస్కోపీ'

పద్ధతి వచ్చింది ఇది పరిస్థితిని తేలిక చేసిన మాట వాస్తవమే. కాని ఈ ఆపరేషనులు చేయటంగాని, పర్యవేక్షణ చేయటంగాని సుశిక్షిత వైద్యులు చేయటం తప్పనిసరి.

గర్భస్రావం: దీనిని కుటుంబనియంత్రణ విధానంగా మనదేశంలో శాసనసమ్మతం చేయడం గొప్పవిషయం. ఇప్పటికీ అణుబాంబును తయారు చేసిన కెనడాలో గర్భస్రావం చేయించుకోడానికి స్త్రీలకు హక్కులేదు. కాగా గర్భస్రావాన్ని చేసేది వైద్యులు; చేయవలసింది వైద్యశాలల్లో. కుటుంబ నియంత్రణ విధానాన్ని అమలు పరుస్తున్నానని, అది విఫలమయి గర్భం వచ్చిందని చెప్తే వైద్యుడు గర్భస్రావం చేయవచ్చు. భర్త అనుమతి అక్కర లేదన్నది నిర్వివాదమైన విషయమే. అయినా భర్త అనుమతిని తెమ్మని వైద్యులు కోరడం తరుచు జరుగుతున్నది. గర్భస్రావం భ్రూణ హత్యతో సమానమని తమ నైతిక విశ్వాసం కనుక తాము ఈ ఆపరేషనులు చేయమని నిరాకరించే శస్త్ర చికిత్సా నిపుణులు-స్త్రీలలోకూడా-లేకపోలేదు. కనుక ముమ్మందుగా డాక్టర్లలో ప్రబోధం సాగాలి. వారిని సుముఖులను చేయాలి. అలాంటివారికి ప్రభుత్వ ఉద్యోగాలలో అవకాశాలు లేకుండా చేయాలి. పైగా అవివాహిత స్త్రీలకు, విడాకులు పొందిన స్త్రీలకు, వితంతువులకు గర్భం వస్తే, వారు గర్భస్రావం చెయ్యమని కోరితే వారికి చిక్కు ప్రశ్నలు వేసి, గర్భిణీ సెలవు లేకుండా చేసి వారిని ఇబ్బంది పెట్టడం జరుగుతున్నది. అలాంటి చికాకుపరిచే పద్ధతులకు స్వస్తి చెప్పాలి; ఆ వైఖరిని అంతం చేయాలి. అంటే విలువల సంబంధంగా వైద్యులకు పునః ప్రబోధం చేయాలి. దీనిని ప్రభుత్వం గమనించవలసి ఉంటుంది.

ప్రోత్సాహ పారితోషకాలు :- ఆపరేషనులు చేయించుకున్న స్త్రీలకు, పురుషులకు పారితోషకాలు ఇవ్వడం సాగుతున్నది. 1963 ప్రాంతంలో దీనివి వ్యతిరేకించిన వారూ ఉన్నారు. కాని ఇపుడు ఇది సర్వసాధారణమయింది. ధనవంతులకు మధ్య తరగతిలో పై వర్గానికి ఇది అవసరం లేకపోవచ్చును. కాగా శ్రామిక జనానికి ఇది అవసరం. భార్యాభర్తలిరువురు ఆపరేషనులు చేయించుకుంటే ఆ కుటుంబానికి ఇళ్ళ స్థలాలు, పొలాలు, ఇళ్ళు, ఉద్యోగాలు, ఉపాధి సౌకర్యాలు వీటి విషయంగా ఇతరులకు లేని సౌకర్యాలు కల్పించాలి. ఇకముందు ఇద్దరి కన్న ఎక్కువ మంది పిల్లలను కనే వారికి ఉద్యోగాలు లేవు, ఇళ్ళ కేటాయింపు ఉండదు, స్థలాలు, పొలాలు ఉచితంగా ఇవ్వడం జరగదు అని ప్రభుత్వం ప్రకటించాలి. దీనికి-అవసరమయితే-రాజ్యాంగ సవరణ ద్వారా వీలు కల్పించాలి.

నిర్బంధ కుటుంబ నియంత్రణ :- ప్రభుత్వం నిర్బంధ కుటుంబ నియంత్రణను చేపట్టాలి. ఇది దశలవారీ కార్యక్రమం. వర్గాలవారీ కార్యక్రమం. మున్ముందుగా ప్రజా ప్రతినిధులు-అంటే పార్లమెంటు మెంబర్లు, శాసన సభ్యులు, జిల్లాపరిషత్, పంచాయతీ సమితి, పంచాయతీల సభ్యులు, రాజ్యాంగ సవరణ తరువాత ఇద్దరు కన్న ఎక్కువ సంతానాన్ని పొందేవారు, ఎన్నికలలో అభ్యర్థులుగా ఉండరాదని శాసించాలి. తరువాత ఇది ప్రభుత్వోద్యోగులకు వర్తింపజేయాలి. తరువాత ప్రభుత్వ వ్యాపార, పారిశ్రామిక, ఇత్యాది సంస్థలకు, ప్రభుత్వ సహాయం పొందే సంస్థల ఉద్యోగులకు విస్తరింపచేయాలి. చివరకు ప్రజానీకానికి వర్తింపచేయాలి. ఇది కాలక్రమేణా సాగాలి. ప్రభుత్వాలకు ఈ కుటుంబ నియంత్రణ కార్యక్రమాలపై శ్రద్ధ ఉంటే, నిజాయతీ ఉంటే ఈ ప్రతిపాదన మంచి చెడ్డలను ఆలోచించాలి. 15 సంవత్సరాల ప్రణాళికలో ఈ పద్ధతి సాగాలి.

కార్యక్రమాలలో ఎంపిక, నొక్కు :- స్త్రీల ఆరోగ్యానికి భంగం కలిగించే విధానాలను, వారికి ఎక్కువగా కష్టం కలిగించే పద్ధతులను విడనాడి తేలికగా అమలు పరచదగిన పురుషుల ఆపరేషను విధానాలను, నిరోధ పద్ధతులను చేపట్టాలి. పురుషాధిక్య సమాజపు విలువలను విడనాడే పద్ధతిలో కుటుంబ నియంత్రణ కార్యక్రమాలను రూపొందించాలి. ఆధునికత, వివేచన, ఉచితానుచిత భావన ఇవన్నీ చోటు చేసుకుంటేనే ఇది సాధ్యం.

# అనియత విద్య

స్వరాజ్యం వచ్చి 40 ఏళ్ళు దాటినా అక్షరాస్యుల శాతం 50 దాటలేదు. స్త్రీల విషయం మరీ శోచనీయం. అక్షరాస్యత 20 శాతం దాకావుంది. అక్షరాస్యత అంటే కేవలం దస్కతు చెయ్యడ మన్నమాట. అంటే చదవటం, వ్రాయటం నేర్చిన వారి సంఖ్య ఇంకా తక్కువగా వుంటుందని గ్రహించడం మంచిది.

పాఠశాలలో కళాశాలల్లో అభ్యసించేది నియత విద్య. ఒక తరగతి నుండి మరో తరగతికి ఎగబ్రాకుతూ వుంటారు. విద్యార్థులు. దేశంలో తగినన్ని పాఠశాలలు లేవు. అందువల్ల అనేక మంది స్త్రీలు పాఠశాలకు పోవడం జరగటం లేదు. అదీ కాక కాయ కష్టంచేసి బ్రతికే కుటుంబాలలో స్త్రీ విద్యపై శ్రద్ధ వుండటానికి అవకాశం లేదు. కనుక నియత పద్ధతిలో విద్యకు నోచుకోని స్త్రీలకు అనియత విద్యయే శరణ్యం.

అనియత విద్యలో తరగతి విభాగం వుండదు. పరీక్షల ప్రసక్తి వుండదు. సర్టిఫికెట్ల ప్రమేయం వుండదు. కేవలం విద్యార్జనయే ప్రథమ ఆశయం; ప్రధాన అభీష్టం.

తాముచేసే వృత్తులకు సంబంధించిన పరిజ్ఞానంతో ప్రారంభమయి బోధించటం ఒక పద్ధతి. అలాకాక స్త్రీల జీవితానుభవాలతో జోడించి తెలియ జెప్పటం మరో పద్ధతి. ఏ పద్ధతిని చేపట్టినా సూత్రం ఒకటే. తెలిసిన దానితో మొదలిడి తెలియని దానిని తెలియ జెప్పటం దాని తాత్పర్యం.

అనియత విద్యను వ్యాప్తి చేయటంలో ఒక విషయం మనం గుర్తుంచు కోవాలి. దానిని ఎవరికి అందిస్తున్నామో వారు ఆ ప్రక్రియలో ఆసక్తిగా పాల్గొనాలి. ఎవరి కోసమో, ఎవరి బలవంతం మీదనో వారు వస్తే విషయం వారి బుర్రలకు అంతుపట్టదు. 'ఈ చదువు నాకోసం; నాకులాభం, మంచి కలుగుతుంది' అనే భావం వారికి ఉంటేనే ఉపయోగిస్తుంది.

ఇక స్త్రీలకు, పురుషులకు వేరు వేరు సమావేశాలు ఉండాలా లేదా అనే విషయమై ఒకమాట చెప్పాలి శరీరశాస్త్రం, లైంగికజీవితం, దాంపత్యం లాంటి విషయాలు తప్ప తతిమ్మావి-ఆరోగ్యం, పరిశుభ్రత, వోటుహక్కు, పంచాయితీ విధానం, పనివిలువ, జీతాలు. కూలీలు, పని పరిస్థితులు ఇలాంటి వాటిని సమిష్టి సమావేశాలలో చర్చించ వచ్చును.

ఇంతకూ అనియత విద్య స్త్రీ జాతికి గొప్పమేలు చేస్తుంది. స్త్రీలకు చదువు అక్కర లేదనే నిరసన భావం, చిన్నప్పటినుండీ పని పాటలలో మునిగి తేలుతుండడం

వల్ల అక్షర జ్ఞానానికి కూడా నోచుకోక పోవటం ఇవి స్త్రీలకు 'శాపాలుగా' పరిణమిం చాయి. ప్రతి చిన్న విషయానికి వారు ఇతరులమీద-అందులో ముఖ్యంగా పురుషులమీద- ఆధారపడడం గమనిస్తున్నాం. తమ స్వశక్తిమీద ఆధారపడలేని మనుషులు ఆత్మ విశ్వా సాన్ని అలవరుచుకో లేరు ఆత్మ విశ్వాసం లేని పౌరులు ప్రజాస్వామ్య వ్యవస్థకు నష్టం చేకూరుస్తారు. ఈ విషయం అలా ఉంచి వ్యక్తిగతంగా వారు అభివృద్ధి కాలేరు.

ఇటీవల పరిశోధనలవల్ల, ప్రయోగాలవల్ల ఒక అంశం రుజువయింది. గ్రామాభి వృద్ధిని పురుషుల ద్వారా సాగించాలని ప్రయత్నించి, తరువాత విఫలులై యువకుల ద్వారా కృషిచేసి అందులోనూ కృతకృత్యులు కాలేక అనేక మంది గ్రామీణాభివృద్ధికి అంకితమైన వ్యక్తులు, అనేకానేక సంస్థలు ఇపుడు స్త్రీల ద్వారా గ్రామ పునర్నిర్మా ణానికి పూనుకోవడం చూస్తున్నాము. దాంతో స్త్రీల ప్రాముఖ్యత పెరిగింది. మరి స్త్రీలకు విద్యా గంధం అంటకపోతే వారు సమాజాన్ని ఎలా మార్చగలరు? కనుక అందరికన్నా అన్ని సెక్షనుల వారికన్నా స్త్రీలకు విద్య ఎంతో ఆవశ్యకం. అది అనియత పద్ధతిలోనే సాధ్యం. అసలు బడి ముఖంచూడని మహిళలు అతి చిన్న వయసులోనే అయిదో క్లాసు కూడా చదవ కుండానే ఆగిపోయిన అతివలు, పొట్ట నింపుకోటానికే పగలు రాత్రనక పనిచేసే పాటక స్త్రీలు వీరందరికీ అనియత విద్యే శరణ్యం.

ఇందులో మహిళా సంఘాల పాత్రఏమిటి? మహిళా సంఘాల ముఖ్యలక్షణా లను గుర్తుచేసుకుంటే తప్ప అది నిర్దేశితం కాదు. మహిళలు తమ హక్కులను గుర్తించే లాగున వారిలో చైతన్యాన్ని పెంపొందించటం, వారి దైనందిన కోర్కెల సాధన కోసం కృషి చేయటం, సమాజంలో స్త్రీ శక్తి పెంపొందించటానికి తోడ్పడం ద్వారా స్త్రీల రాజకీయార్థిక సామాజిక సాంస్కృతికాభి వృద్ధికి దోహదం చేయడం మహిళాసంఘాల ప్రప్రథమ కర్తవ్యాలు.

ఏ ఒక్క స్త్రీ అయినా వయస్సు కాస్తమళ్ళిన తరువాత చదువు కోవాలంటే, ప్రస్తుతం సమాజం ఉన్న పరిస్థితిలో, కాస్త బిడియపడటం జరుగుతుంది. అలాంటి చిక్కులేకుండా మహిళా సంఘమే అనియత విద్యా బోధన చేపట్టే లేక దానికి దోహదం చేస్తే మహిళలు భయ సంకోచాలకు లోను కారు. అపుడు అది సమిష్టి కార్యక్రమం అవుతుంది. దానికి అనుగుణంగా జరిగేవి సమిష్టి చర్యలు అవుతాయి. ఈ పద్ధతివల్ల పట్టుదలతో చదువు సాగిస్తారు స్త్రీలు.

సాధారణంగా సామాన్య ప్రజానీకం తమకు కల్గే కష్టనష్టాలను గురించి ఎక్కు వగా మాట్లాడు తుంటారు. తమకు ఏదైనా కష్టంవస్తే అలాంటిది ఇంక ఎవరికీ రాదన్న

కుంటారు. విధిని నిందిస్తారు. వేష్టపడతారు, బాధపడతారు. ఇతరులకు కూడా ఈ కష్టాలు వస్తాయని తెలిసిన తరువాత కూడా వారు అందరి కష్టనష్టాలను సాధారణీ కరణ చేయలేరు. కాని గోష్టుల ద్వారా, వాదోపవాదాల ద్వారా విషయాన్ని గ్రహించ గలుగుతారు. తద్వారా గుణపాఠాలు నేర్చుకోవడం సంభవిస్తుంది. కొన్ని సూత్రాలను వెలికి తీయడానికి అవకాశం పెరుగుతుంది. మానసిక పరిధి పెరుగుతుంది. విశాల దృక్పథం ఏర్పడుతుంది. సంకుచిత భావాలు, ధోరణులు నశిస్తాయి. విశ్వమానవుని గురించ ఆలోచించడం మొదలవుతుంది. మానవాళి అంతా ఒకటేనని, ఏ దేశంలో ఉన్నా, ఏ ప్రాంతంలో నివసిస్తున్నా స్త్రీలంతా ఒకటే అనే భావన వారి మనస్సులలో చోటు చేసుకుంటుంది. ప్రాంతీయ సంకుచితత్వం భాషాదురభిమానం, కులమత వైషమ్యం ఇవన్నీ అంతరించి పోతాయి.

మూడువేల సంవత్సరాల నుండి స్త్రీలు విధిగా చేస్తున్న వంట, గృహాలంకరణ, ముగ్గులు, అల్లికలు వీటికి మాత్రమే తమ కాలాన్నంతా మహిళా సంఘాలు వినియో గించకుండా సభ్యుల భావ పరిణతికి, మానసిక విప్లవానికి దోహదం చేసే కార్యక్రమా లను మహిళా సమాజాలు చేపట్టాలి. ప్రస్తుతపు సమాజంలో ధనం, వాక్పటిమ, జనం స్తోమతు వీటిలో ఏదో ఒకటన్నా ఉన్న వ్యక్తి మాత్రమే రాణించ కల్గుతున్నాడు. సమాజంలోని స్త్రీలలో అధిక సంఖ్యాకులకు ధన బలం లేదు. కాగా సంఖ్యా బలం ఉంది. అది రాణించాలంటే వాక్బలం కూడా తోడు కావాలి. స్త్రీలకు వాక్బలం రావా లంటే వారు తమ తమ అభిప్రాయాలను స్పష్టంగా, నిక్కచ్చిగా, నిర్ద్వంద్వంగా చెప్పగలగాలి. మహిళా సంఘాలలో వారు మాట్లాడటం వల్లనే ఆ శక్తి వారికి వస్తుంది. వారు మాట్లాడటానికి అనువైన వేదికగా మహిళా సంఘం మారాలి. చైతన్య వంతులైన స్త్రీలకు అది శిక్షణాలయం కావాలి. అలా జరిగిననాడు తమకు చెందవలసిన స్థానాన్ని సమాజంలో సంపాదించుకుంటారు.

ఈ ప్రపంచంలో సర్వజ్ఞులు ఎవ్వరూ లేరు. ఎంత తెలుసుకున్నా తెలుసుకోవా లసినది ఎంతో ఉంటున్నది. విద్య, అంటే తెలుసుకోవడం ద్వారా వచ్చే ఆనందం యొక్క స్వభావం వేరు. తతిమ్మా రకాల ఆనందం వేరు. చిన్న పిల్లవానికి లెక్క చేయడం వల్ల వచ్చే ఆనందం, శాస్త్రజ్ఞుడు పరిశోధనా ఫలితంగా క్రొత్త విషయాన్ని కనుగొన్నపుడు అతనికి లభించే సంతోషం రెండూ ఒకే కోవకు చెందినవి. కాగా తరతమ భేదం ఉంటుంది; అంతే. ఇది మానవ స్వభావంలో ఉండే సత్యాన్వేషణాసక్తి ఫలితం.

దైనందిన కష్టాలు సంభవించినపుడు వాటి నివారణోపాయాలు తెలియక మానవులు తల్లడిల్లతారు. స్త్రీలకూ ఆ బాధ తప్పదు. అయితే సమస్యలను వారు చర్చించే సమయంలో వారికి ఉన్న ప్రాపంచిక జ్ఞానం వారి విషయ గ్రహణానికి తోడవుతుంది. నివారణ విధానాలు వారికి స్ఫురిస్తాయి. దాంతో వారికి స్వేచ్ఛకు బాట సులువవుతుంది. మానవుని వ్యక్తి వికాసాభివృద్ధికి ఆటంకంగా ఉండే అడ్డంకులు క్రమక్రమంగా తొలగిపోవడమే స్వేచ్ఛ అని మనం చెప్పుకుంటే అలా స్త్రీలు స్వేచ్ఛను పొందగల మార్గాన్ని తెలుసుకుంటారు; తర్వాత ఆ మార్గాన్ని పయనిస్తారు. అజ్ఞానాంధకారం పటాపంచలవుతుంది. స్వేచ్ఛ కోసం పరుగు లంకించుకుంటారు. స్వేచ్ఛ విలువను గుర్తించడం, దానికోసం కృషిచేయడం అవినా భావ సంబంధం కల రెండు కార్యాలుగా కాక ఏక సమయంలో ఒకే కార్యంగా భాసిల్లుతుంది. చైతన్యాన్ని, సంఘ నిర్మాణాన్ని, పటిష్టతను, ఐకమత్యంతో కూడిన సమిష్టి కార్యాచరణను మహిళా సంఘాలు ప్రోత్సహిస్తాయి. ఈ కార్యక్రమాలకు ఊతం ఇచ్చేది విద్య మాత్రమే. కనుక మహిళా సంఘాలు దీని విషయమై ఎంతో శ్రద్ధ తీసుకోవాల్సి ఉన్నది.

సామాజిక దురాచారాలు ప్రబలంగా ఉన్నాయి. వాటికి మూలాధారం అజ్ఞానమే. స్వార్థపరులు తప్ప ఎవరూ అన్యాయాన్ని సమర్థించరు. ఒకరకంగా ఆలోచిస్తే స్వార్థపరత్వం అజ్ఞాన జనితమే. కనీసం దూరదృష్టి ఉన్న మనిషి అన్యాయం చేయటానికి వెరవటం జరుగుతుంది. అక్రమం అన్యాయం పోషించబడితే అన్యాయానికి ఒడికట్టిన వ్యక్తి అచిరకాలంలో తనే దానికి గురి అవుతాడు. అక్రమంగా కోట్లు సంపాదించిన మనిషి ఆ సంపదను ఎక్కడ ఎవరు కాజేస్తారో అనే భయంతో వణికిపోతుంటాడు, మానసిక సుఖానికి దూరం అవుతాడు. అంతేకాదు, తోటి మానవునికి ఏమాత్రం మేలు చేయని వ్యక్తి, సకల సంపదలతో తులతూగే వ్యక్తి వీరు కూడ చనిపోయేటప్పుడు వెంట తీసుకొని పొయ్యేది ఏమీ లేదు. మానవ వ్యక్తి కట్టుగుడ్డలు కూడా లేకుండా ఈ ప్రపంచంలోకి వస్తాడు; అలాగే చనిపోతాడు. ఇదేదో తత్వం కాదు. కేవలం అనుభవైక సత్యం. జీవిత సత్యాలను తెలియ జెప్పేదే విద్య.

కేవలం డిగ్రీల పాండిత్యం విద్య కాదు, అది విధిగా సంస్కారాన్ని సంతరించి పెట్టాలని నియమమూ లేదు. మానవాళి ఐక్యతను, తన బాధ్యతను తోటివారి యెడ తన శ్రద్ధాసక్తులను, ప్రేమానురాగాలతో కూడిన ప్రవర్తనను అలవర్చుకున్న వ్యక్తినే సంస్కారి అని అంటాం. మానవ విలువలను సంతరించుకోవటం సంస్కార లక్షణం. అందుకు విద్య తప్పని సరి. విద్యావ్యాప్తికి మహిళా సంఘాల కృషి అనల్పం; అత్యంత అవసరం.

# వార్ధక్యాన్ని తట్టుకోవడం ఎలా?

ప్రతి జీవి బ్రతకాలని తాపత్రయ పడుతుంది. చీమ, దోమ, బొద్దింక, ఎలుక ఒకటేమిటి అన్ని జీవరాసులు మగుగడ సాగించాలని తహ తహలాడతాయి. ప్రకృతి పరిణామంలో ఉద్భవించిన మానవుడు ఈ సూత్రానికి భిన్నంగా నడవడం లేదు. కాగా మానవ జీవితంలో హేతుత్వం, ఉద్వేగం చోటు చేసుకుంటాయి ఉన్నత స్థాయిలో. దాంతో ఆలోచనకు స్థానం వస్తుంది. భావాలకు ప్రాధాన్యత వస్తుంది. మానవ ప్రవర్త నను శాసించే ఇతర అంశాలు కూడ దర్శనమిస్తాయి. వీటన్నింటికి కొన్ని గీటురాళ్ళు కావాల్సి వస్తుంది. ఆలా మానవ విలువలు చోటు చేసుకుంటాయి. స్నేహం, అనురాగం, ప్రేమ, వాత్సల్యం, విశ్వాసం, దయ, దాక్షిణ్యం, క్షమ, గౌరవం ఇలాంటి వాటిని మానవ విలువలు అంటాము. వీటిని ఎక్కువగా ప్రదర్శించే మనిషిని 'సంస్కారి' అని అంటాము. ప్రయత్నం లేకుండా ఈ విలువలను తన జీవితంలో రంగరించుకునే వ్యక్తులు తయారు అవుతారు. తల్లిదండ్రుల పెంపకంలో, గురుపుంగవుల శిక్షణలో ఆ అలవాటును వారు అలవరుచుకుంటారు. వారిని 'శీలవంతులని' పేర్కొంటాము. ఇలా శీలానికి ప్రాధాన్యత ఇవ్వడం కద్దు. కేవలం జన్మనివ్వడమే కాక, ప్రేమతో వాత్స ల్యంతో పెంచి పెద్దజేయడమే కాక సద్గుణాలను అలవరించి శీలవంతులనుగా తమ బిడ్డ లను తీర్చి దిద్దే ఘనత తల్లిదండ్రులది.

మానవజాతి నాగరికతను బిడ్డలకు అందుబాటులోకి తెచ్చి, మానవ సంస్కృ తిని వారికి అందించి వారిని సంస్కారులుగా తయారుచేసే, లేక చేయప్రయత్నించే తల్లిదండ్రులకు, తాతముత్తవలకు సంతానం కలితజ్ఞత తెల్పడం విధి. తల్లిదండ్రులు కేవలం స్వార్ధ చింతతోనే సంతానాన్ని పొందవచ్చును. ఆ మాటకు వస్తే ఏ ఆలోచనా లేకుండానే సంతానాన్ని కనవచ్చును. కాని తమకు ఉన్నా లేకపోయినా వారికి ప్రాధా న్యత ఇచ్చి పెంచి పెద్దజేయటంలో తల్లిదండ్రుల స్వార్ధం కన్న పరార్ధ భావన ఎక్కువగా కన్పడుతుంది. "నేను నిన్ను కనమన్నానా?" అని కుమారుడు గాని కుమార్తె గాని ప్రశ్న అడిగే అవకాశం లేదు. ఎందుకంటే జన్మకు ముందు ఆ శిశువుకు అస్తిత్వం లేదుకనుక. "నీవే లేకపోతే నీవు తల్లిని అడిగేదేమిటి? ఆమె అంగీకరించే దేమిటి?" ఆవక తవక ఆలోచనలకు అవకాశం ఇవ్వకుండా అసలు విషయాన్ని అర్ధం చేసుకోవడం అవసరం.

ఇంతకూ వృద్ధులను కనిపెట్టి చూడవలసిన బాధ్యతను గురించి చర్చిస్తూ తల్లిదండ్రుల యెడ, తాతముత్తవల యెడ సంతానం యొక్క, మనుమలు, మనుమరాండ్ల యొక్క బాధ్యతలను గురించి ఆలోచించాము. అయితే వారు తమ బాధ్యతలను విస్మరిస్తే వృద్ధుల గతేమిటి అనేదే ప్రశ్న. అందరు పిల్లలూ దుర్మార్గులు కారు. అందరు పిల్లలూ ఉత్తములు కారు. మధ్యములు, అధములు, అధమాధములు కూడా వారిలో ఉంటారు. అలాంటి ప్రమాదకర సందర్భాలలో వృద్ధుల స్తితి శోచనీయం అవుతుంది కదా! మరి వారు ఏమి చేయాలి? తమ సంతానం, తమ మనుమలు, మనుమరాండ్రు తమరిని అన్యాయం చేయరని తలపోస్తూ చిట్టచివరికి ఆశాభంగానికి సిద్ధం అవటమా లేక ముందునుంచి తమ పరిస్థితిని తామే చక్కబెట్టుకోగల పరిస్థితిని కల్పించుకోవటమా అనేది కీలక సమస్య.

తాము నడివయస్సులో ఉన్నపుడే రాబోయే వృద్ధాప్యానికి తయారుకావటం విజ్ఞత కల మానవుల కర్తవ్యం. వృద్ధాప్యంలో శారీరకమైన, మానసికమైన అశక్తతలు సంభవిస్తాయి. ఒంటరితనం కొట్టవచ్చినట్లు కన్పడుతుంది. విసుగూ విరామం లేకుండా కాల గమనంతో పోటీపడే ఈనాటి స్త్రీ పురుషులు ముదుసలులతో మాట్లాడడానికి తీరిక, వ్యవధి, ఉత్సుకత లేకుండా ఉన్నారు. దాంతో తమను కావాలని నిర్లక్ష్యం, నిరాదరణ చేస్తున్నారని వృద్ధులు భావిస్తున్నారు. ఇదీ సంకట పరిస్థితి. దీనిని ఎదుర్కోవటానికి నడి వయస్సు నుంచే అందరూ సమాయత్తం కావాలి. ప్రకృతి ధర్మాన్ని ఎవరమూ ఆపలేము అందరూ వృద్ధాప్యాన్ని చేరుకోవలసిందే. ఈ సత్యాన్ని ఎంత ముందుగా ఎంత త్వరగా గ్రహిస్తే అంతగా వృద్ధాప్యంలో కలిగే బాధలను వ్యక్తి తట్టుకోగలడు.

ఇంతకూ వృద్ధాప్యాన్ని తట్టుకోడానికి ఏఏ చర్యలకు మనిషి ఉపక్రమించాలి? కొన్ని మానసిక వైఖరులను అవలంబించాలి; అలాగే కొన్ని శారీరక ప్రక్రియలకు అలవాటు పడాలి.

మానసికంగా తయారయిన వ్యక్తులు వృద్ధాప్యాన్ని ఆనందమయం చేసుకోగలరు. ముందుగానే రాబొయ్యే కష్టాలను, క్లేశాలను ఊహించి ముందు జాగ్రత్త చర్యలు తీసుకుంటే ముదుసలి తనంతో కూడ సుఖపడగలరు.

ఏ వ్యక్తీ వృద్ధాప్యాన్ని, మరణాన్ని తప్పించుకోలేడని మున్ముందుగా గ్రహించడం అత్యవసరం. ప్రకృతి ధర్మసూత్రాల అవగాహన అతి ముఖ్యం. పెరుగుదల, తగ్గుదల ప్రకృతి ధర్మాలు. నడివయస్సులో ఉన్న శరీర దార్ఢ్యత ఎల్లకాలం ఉంటుం

దని ఆశించటం పొరపాటు. జవ సత్వాలు ఉడుగుతున్నాయని బాధపడి ప్రయోజనం లేదు. నూతన దశలో ఎలా మసులుకోవాలో నిర్ణయించుకోవటం విజ్ఞత క్రింద జమ అవుతుంది.

రెండవది మరీ కీలకమైన భావన. మరణాన్ని గురించి భయపడటం మాని వేయాలి. మరణం ప్రకృతి ధర్మసూత్రం. దానిని గురించి భయపడి చేయగలది లేదు. "కారే రాజులు, రాజ్యములు కలుగవే, వారేరీ, సిరిమూట కట్టుకొని పోవం జాలిరే...." అనే పోతనగారి పద్యం జ్ఞాపకం తెచ్చుకోవాలి. దేశాలను పాలించిన రాజులు చనిపోతూ ఐశ్వర్యాన్ని తీసుకొని పోవటం లేదు. నియంతలు తమ అధికారాన్ని వెంట తోడ్కొని పోవటం లేదు. తనుగా పెంచిన సంతానాన్ని, మనుమలను, మునిమనుమలను చివరకు తను ఎంతో అభిమానించి ప్రేమించిన భార్యను, భర్తను వదలిపోక తప్పదు. మరి మిగిలే దేమిటి? తను చేసిన మంచి పనుల ప్రస్తావన మాత్రం మిగులుతుంది. అందుకే చనిపోయినవారిని 'కీర్తిశేషులు' అంటాము. సమాజపుగతి వేగం పుంజుకున్న ఈ కాలంలో, ప్రమాదాలు తరుచు సంభవిస్తున్న ఈ రోజుల్లో మృత్యువు ఎపుడు, ఏ రూపంలో, ఏ సమయంలో వస్తుందో తెలియని సందిగ్ధావస్థలో మానవుడున్నాడు. కనుక ప్రతి క్షణం మంచి పని చేస్తూ, చేస్తున్నాననే తృప్తితో జీవిస్తే మరణం ఎపుడు ఆసన్నమయినా బాధ, వ్యథ వుండదు.

వృద్ధాప్యంలో ఒంటరితనం తప్పదు. భార్య లేకపోతే భర్తకు, భర్త లేని భార్యకు మనోవ్యథ తప్పదు. ఇన్నాళ్ళ సహచరుడు, సహచరి మాయమవుతారు. పిల్లలు వాళ్ళ వాళ్ళ వ్యవహారాలలో తలమున్కలౌతుంటారు. ముదుసలుల కోసం వారు సమయాన్ని వెచ్చించడానికి సుముఖత చూపరు. అదీగాక ముదుసలుల ఆలోచనలు, అలవాట్లు తదితరుల ఆలోచనలకు అలవాట్లకు భిన్నంగా ఉంటాయి. అభిరుచులు వేరు వేరుగా ఉంటాయి. కనుక యువతీయువకులు, నడివయస్కులు వృద్ధులతో కాలంగడపటానికి వెనుతీస్తారు. మరో అంశం. వృద్ధులు తమ జీవితాల నుండి ఎన్నో విషయాలను నెమరు వేసుకుంటూ పదే పదే ఆ విషయాలను ఇతరులతో ముచ్చటిస్తారు. తదితరులకు వారు చెప్పే మాటలపై ఆసక్తి ఉండదు. పైగా పదిసార్లు వినాలంటే వారికి తల నొప్పి. కనుక వృద్ధులు తమలో తాము మాట్లాడుకునే పద్ధతికి అలవాటు పడాలి. యువతీయువకులు, నడి వయస్కులు పట్టించుకోకపోతే దానిని నిర్లక్ష్యమని, నిరాదరణ యని భావించడం మానివేయాలి. జీవితంలో వివిధ దశల మధ్య ఉండే అంతరాన్ని గమనించి ప్రవర్తించటం ఆవశ్య కర్తవ్యం.

వృద్ధాప్యంలో శరీర పరిశ్రమ అక్కరలేదనుకోవడం భ్రమ. ఏ అవయవానికీ పని కల్పించకపోయినా అది వాడిపోతుంది; ఎండిపోతుంది. మెదడు కూడా ఆకోవకే వస్తుంది. ఆలోచన మానవుని ప్రత్యేక శక్తి. దానిని నిలిపివేయ ప్రయత్నించడం అవివేకం. నిజానికి వృద్ధాప్య దశలో మనస్సు పరిపక్వ దశలో ఉంటుంది. అపుడు దానికి కొంచెం పని ఇచ్చి, పదును పెట్టాలి. బెర్నార్డుషా, హెచ్.జి.వెల్సులాంటి వ్యక్తులు 99 సంవత్సరాలు జీవించినా చివరి వరకూ ఆలోచించారు; చదివారు, వ్రాశారు. వారివి పరిపూర్ణ జీవితాలు. అలాంటి జీవితాలు అందరికీ అందుబాటులోనే ఉంటాయి. కాకపోతే కొంత ప్రయత్నం చేయాలి.

శారీరక పరిశ్రమ చేయమన్నారు కదా యని, మనో వ్యాపారం సాగించమన్నారు కదాయని అతిగా చేయరాదు. శరీరం మోయగల్గినంత, మనస్సు ఓపగల్గిన మేరకు రెండు రకాలుగా శ్రమచేయాలి. శ్రమ రాహిత్యం, ఐద్ధకానికి, స్తబ్ధతకు దారి తీస్తుంది. మానవ వ్యక్తి తన వ్యక్తిత్వం ప్రతిభ కోల్పోయి జీవచ్ఛవంలా జీవిస్తాడు. అది అందరికీ బాధాకరం. ఆ పరిస్థితిని తెచ్చుకోరాదు. తమకు ఇష్టమైన పనిని మోతాదుగా చేయటానికి సిద్ధపడాలి. ఊరక కూర్చొనియో, లేక మంచానికి అతుక్కొనిపోయి తమకూ, ఇతరులకూ కష్టాలను, బాధలను, అసౌకర్యాలను తెచ్చిపెట్టడం తెలివి తక్కువ పని.

చివరి మాటగా ఒక్క విషయం చెప్పక తప్పదు. మనిషి అన్న తరువాత ఉద్వేగాలు, ఆవేశ కావేషాలు ఉండక తప్పదు. కాగా వాటిని అదుపులో పెట్టుకోగల నేర్పరితనం సంపాదించు కోవాలి. పిల్లలను విపరీతంగా ప్రేమించినా, వారి బాగోగులను గురించి అతిగా వ్యధచెందినా చివరకు చనిపోయే టప్పుడు వారిని వదలిపోక తప్పదు కదా! కనుక వృద్ధులు చేసే ప్రతి పనిలో కొంత నిర్లిప్తతకు చోటు ఇవ్వడం మంచిది. 'అతి సర్వత్ర వర్జయేత్' అన్నారు. పిల్లలను ద్వేషించమని ఎవ్వరూచెప్పరు. వారియెడ నా విధ్యుక్త ధర్మం నేను నెరవేర్చాననే భావాన్ని అలవరుచు కోవాలి. అంతేగాక 'ఎంత వయస్సు వచ్చినా, ఏభది ఏండ్లు దాటినా' వారు పసి పిల్లలేనని తలంచరాదు. అలాంటి వైఖరి వృద్ధులకూ పిల్లలకూ అందరికీ తంటా తెచ్చి పెట్టుంది.

కాగా కొన్ని కుటుంబాలలో భార్యా భర్తలు ఉద్యోగాలకు పనికి పోతారు. పిల్లలు బడికి పోతారు. బిక్కుబిక్కుమంటూ ముసలాడు, ముసలమె ఉంటారు. ఇద్దరూ బ్రతికి ఉంటే కొంత నయం. ఇద్దరిలో ఒకరే మిగిలితే వారి జీవితం అధ్వానం అవుతుంది. దుర్భరమూ, శోచనీయమూ అవుతుంది. అలాంటప్పుడు ఏమి చేయాలి?

వృద్ధుల శరణాలయాలు ఆ సమస్యను పరిష్కారం చేస్తాయి. అక్కడ ఇతర వృద్ధులుంటారు. వారిలో వారు మాట్లాడు కుంటారు. అనుభవాల కబుర్లను కలబోసు కుంటారు. సామాజిక కార్యక్రమాలు చేపట్ట కలుగుతారు. వారి అభిరుచులకు అను గుణంగా వ్యవహరించ కల్గుతారు. వారికి అచట ప్రేమ, అభిమానం, ఆదరణ, గౌరవం లభ్యమవుతాయి. అందుకనే మరిన్ని వృద్ధ శరణాలయాలు కావాలి! ఏర్పడాలి.

# మహిళా సంఘాల పాత్ర: ప్రస్తుత కర్తవ్యం

మహిళా సంఘాలు ఎందుకు స్థాపిస్తున్నాం, ఎవరిని ఉద్ధరించటానికి అన్నప్పుడు మానవ జాతిలో స్త్రీలు సగం మానవ సమాజం సుఖ శాంతులతో ఆనందంగా మను గడ సాగించాలంటే మానవులు స్వేచ్ఛా సమానత్వ సౌభ్రాతృత్వాలను అనుభవించాలి. అంటే సగభాగమైన స్త్రీలు వాటిని తమ తమ జీవితాలలో అనుభవంలోకి తెచ్చుకోవాలి. కాబట్టి స్వేచ్ఛ సమానత్వాలు ప్రప్రథమంగా ఆదరణీయాలు అయినాయి. వాటి సంపా దనయే స్త్రీ విమోచన ముఖ్యోద్దేశ్యం. బంధాలతో వున్న స్త్రీలు స్వేచ్ఛను ఆశిస్తున్నారు. బానిసత్వంలో మగ్గే మహిళలు కాని, హీనంగా చూడబడే స్త్రీలు కాని పురుషులతో పాటు సమానత్వాన్ని వాంఛిస్తున్నారు. ఈ రెండూ స్త్రీలకు సిద్ధించి నపుడు తబిమ్మా మానవ సమాజంతో పాటు స్త్రీ జాతికి తగిన హోదా లభిస్తుంది. మానవాళి అంతా ఒకటే. రంగుభేదం, అంతస్తుభేదం, జాతిభేదం అప్రధానమయినవని తెలిసికొన్న మహిళలు సౌభ్రాతృత్వ భావనలను అలవరచు కుంటారు.

మహిళా సంఘాల దీర్ఘకాలిక లక్ష్యాలు ఏమిటి అని ఆలోచిస్తే స్త్రీజాతి దీర్ఘకాలిక లక్ష్యాలే మహిళా సంఘాల లక్ష్యాలు. స్త్రీ విమోచన కోసం ఒక్క స్త్రీ కూడా కృషి చేయవచ్చు. కాని పలువురు స్త్రీలు సంఘంగా చేరి పట్టుదలగా పనిచేస్తే దాని ఫలితం మరింతగా వుంటుంది. సంఘీభావం బలమనే సూక్తి మనకు తెలియనిది కాదు.

మహిళలకు స్వేచ్ఛ. సమానత్వం అన్ని రంగాలలో సంపాదించే నిమిత్తం మహిళలు నిర్విరామంగా కృషి చేయాలి. శ్రమించాలి. ఆదే వారి లక్ష్యం: కర్తవ్యం కూడాను. ఇది దీర్ఘకాలిక పోరాట లక్ష్యం. కార్యక్రమాలు దీర్ఘకాలికాలు, తాత్కాలికాలు అని మనం విభజన చేసుకోవాలి. దీర్ఘకాల కార్యక్రమాన్ని గురించి కొంత చర్చ చేసి తాత్కాలిక లక్ష్యాలను కూడా నిర్ణయించు కోవాలి. లేక పోతే ఒక అడుగు కూడా ముందుకు సాగదు. రాబోయే అయిదు సంవత్సరాలలో స్త్రీలలో అక్షరాస్యుల సంఖ్యను ద్విగుణీకృతం చేయాలి. స్త్రీలు విరివిగా, ఇతోధికంగా, అంటే ఇప్పటి కంటే మూడింతలుగా అన్ని స్థాయిలలో విద్యావకాశాలను వినియోగించు కోవాలి; స్త్రీ కార్మికుల లేక ఉద్యోగినుల సంఖ్య మూడురెట్లు పెరగాలి. ఉద్యోగినులలో కీలక పదవులలోఉండే స్త్రీల సంఖ్య రెండింతలు హెచ్చుకావాలి. ప్రజా ప్రాతినిధ్య రంగంలో స్త్రీలకు ఇప్పటి

కన్నా నాలుగింతలు ప్రాతినిధ్యం లభించాలి. స్త్రీలకు ప్రసూతి సెలవలు, విశ్రాంతి అవకాశాలు వైద్య సదుపాయాలు పదింతలుగా అభివృద్ధి కావాల. ప్రభుత్వ ప్రజా సంస్థల రంగాలలో వేతనాల విషయంగా, ఇతరత్రాను అసమానత నిర్మూలనం కావాలి. ఇలాంటి వన్నీ తాత్కాలిక లక్ష్యాలు. వీటికోసం పోరాడడం మహిళా సంఘాల ప్రప్రథమ కర్తవ్యం.

మహిళా సంఘాలు చేపట్టదగు కార్యక్రమాల స్వభావం లక్ష్యాలను బట్టి నిర్దేశిత మవుతాయి. స్వేచ్ఛా సమానత్వాలు లక్ష్యాలు కనుక కార్యక్రమాల లక్ష్యాలు కూడా అవే అవుతాయి. లక్ష్యానికి అనుగుణం కాని మార్గంలేక సాధనం ఫలవంతం కానేరదు.

మన లక్ష్యం స్వేచ్ఛా సముపార్జన అయితే కార్యక్రమం బానిసత్వ స్థాపన కారాదు. స్వేచ్ఛకు పరిమితులు లేవు. సంపూర్ణ స్వేచ్ఛ అంటూ వుండదు. సమాజంలో ఒక వ్యక్తియొక్క సేచ్ఛ మరియొక వ్యక్తియొక్క స్వేచ్ఛకు లోబడి వుంటుంది. కనుక హద్దులు ఉండక తప్పదు. ఆ హద్దులు సమాజ భద్రత, నీతి, అశ్లీలం అనే వాటిని బట్టి నిర్ణయింప బడతాయి. స్వేచ్ఛ ఉంది కదా అని సమాజానికి ప్రమాదం కలిగిస్తానంటే సమాజం అంగీకరించదు. స్వేచ్ఛ ఉందికదా అని అవినీతి కరంగా ప్రవర్తిస్తానంటే, లేక మరో వ్యక్తియొక్క శ్రమశక్తిని దోచుకుంటానంటే, లేక అవతలి వ్యక్తిని పనిముట్టుగా వాడుకుంటానంటే—ఇతరులు మెచ్చరు. అలాగే నాకు సేచ్ఛ వున్నదని ప్రకటించి జనం మధ్య దిగంబరంగా సంచరిస్తామంటే చుట్టూ జనం చూస్తూ ఊరుకోరు. కాగా స్వేచ్ఛకు పరిమితులు సహేతుకంగా ఉండాలి. స్వేచ్ఛ రోజు రోజుకూ పెరుగుతూ ఉండడమే అభ్యుదయం. అది సాధారణంగా క్రమక్రమంగా జరుగుతుంది. ఇంతకూ చెప్పేదేమంటే స్వేచ్ఛా మార్గంలోనే కార్యక్రమం సాగాలని. సమానత్వ విషయమూ అంతే.

మహిళా సంఘాలు ఒక కార్యక్రమాన్ని నిర్ణయించుకునేటప్పుడు కొన్ని అంశాలను దృష్టిలో వుంచుకోవాలి. తమ కార్యక్రమానికి దోహదం చేసే అంశాలలో ముఖ్యమైనవి కొన్నిటిని గమనించటం ప్రస్తుత కర్తవ్యం. సమాజంలో మార్పు ఏ మేరకు అవసరం? దానికి అనుగుణమగు కార్యక్రమం ఏమిటి? అనేది మొదటిప్రశ్న. ఉదా॥ వరకట్న మరణాల నివారణ, తదనుగుణమైన శాసనాలు-అందుకు అవసరమైన ప్రజాభిప్రాయ నిర్మాణం గురించి ఆలోచించాలి. ఈ కార్యక్రమానికి సమాజంలో ఎంత ఆనుకూల్యత వస్తుంది? ఎంత వ్యతిరేకత వస్తుంది? ఈ కార్యక్రమానికి ఎలాంటి బలం సమాజంలో ఏ వర్గం నుండి ఏ మేరకు లభిస్తుంది? ఈ కార్యక్రమాన్ని కొనసాగించ

గల సామాజిక చైతన్యం, శక్తి కార్యక్రమాన్ని ఆమోదించే వర్గాలకు ఉన్నాయా? అంటే ప్రదర్శనల ద్వారా అసమ్మతిని తెలియజేయ లేని వారిని తుపాకి పట్టుకొని పోరాడమంటే ప్రజలలో ఏమేరకు ఆసక్తి వుంటుంది అని ఆలోచించాలి.

ఈనాడు వివిధ మహిళా సంఘాలు వివిధ కార్యక్రమాలు చేపడుతున్నాయి. అవి ప్రాంతీయ, సామాజిక, రాజకీయ, విభిన్నతలను బట్టి కాల వ్యత్యాసాన్ని బట్టి వేరు వేరుగా వుంటాయి. ఒక సంఘం గ్రామాల్లో స్త్రీ పురుష వేతనాల సమస్యను చేపట్ట వచ్చు. మరొకటి పోషకాహారం, పిల్లల ఆరోగ్యం లాంటి వాటిపై నొక్కి పెడతారు. మరోసంఘం స్త్రీలకు మరుగు దొడ్ల నిర్మాణానికి కృషి ప్రారంభించ వచ్చును. ఇంకొక సంఘం మహిళలకు సామాజిక అభద్రత, అత్యాచారాల నుండి రక్షించేందుకు శ్రమించ వచ్చును. స్త్రీలలో విద్యా వ్యాప్తికి పాటుపడే సంఘాలు కొన్ని వున్నాయి. పూర్తిగా మహిళా హక్కులకై పోరాటాలు జరిపేవి కొన్నివుంటే మహిళల్లో జాగృతి, చైతన్యం కలిగించి వారిలో వ్యక్తి వికాసాన్ని పెంపొందించే సంఘాలు కూడా లేకపోలేదు. ఇలా ఎన్నయినా పేర్కొనవచ్చు. ఒక గ్రామంలో చదువు లేమి ప్రధాన సమస్య అయితే మరొక గ్రామంలో వైద్య సహాయం లేమి ముఖ్య సమస్య కావచ్చును. ఏదైనా ఆ ప్రాంత, పట్టణ, లేక గ్రామ అవసరాన్ని తీర్చటానికి కార్యక్రమం రూపొంద బడాలి.

అలాకాక ఈనాడు కొన్ని మహిళా సంఘాలు కేవలం భజనలు, కుట్లు, అల్లి కలు, ముగ్గులు పిండి వంటలు లాంటి కార్యక్రమాలు, చేస్తూవుంటారు. ఇంకా వినో దాన్ని అందించే కార్యక్రమాలు. పర్యటనలు, విందులు, అందాల పోటీలను మాత్రమే నిర్వహిస్తూ వుంటారు. సంఘానికొక బిల్డింగు కట్టించడమే కొన్ని సంఘాలకు పరమా వధి అవుతోంది. భవన నిర్మాణంతో ఆ సంఘాల కార్యక్రమం ముగుస్తుంది. భవన రిపేరు కొరకు, పన్నులు, కాపలాదారు ఖర్చుల నిమిత్తం దానిని అద్దెకిచ్చి ఏ నెలకో ఒక కార్యక్రమాన్ని నిర్వహిస్తారు. అదే ఆ సంఘాలకు జీవిత సర్వస్వం. వాటి వల్ల మహిళా సంఘాల పాత్ర నిర్వీర్య మవుతుంది.

కార్యక్రమాలు వివిధ స్వభావాలు కలిగి వుంటాయి. కొన్ని సామాజిక మైనవి; మరికొన్ని ఆర్థిక పరమైనవి. ఇంకా కొన్ని రాజకీయ సంబంధమైనవి; మిగిలినవి సాంస్కృతిక రూపం కలిగినవి, ఆ పట్టణ లేక గ్రామ స్థాయిని బట్టి ఆ కార్యక్రమం యొక్క రూపం ఆధార పడుతుంది. సర్వతోముఖ వికాసం కోరతగినదే. ఎవరూ కాద నరు. కాగా వనరుల దృష్ట్యా, శక్తి సంపన్నతను లెక్క లోకి తీసుకొని నిర్ణయించు

కోవాలి. అన్ని పనులను ఏక కాలంలో చేయలేము. అన్ని లక్ష్యాలను ఒక్కసారి సాధించలేము. కనుక వీటిల్లో ముందు వెనుకలు ఉంటాయి. ఇదే ప్రణాళికా బద్ధమైన కృషి అంటే.

ఇబ్బందులు:- కార్యక్రమ నిర్వహణలో వచ్చే ఇబ్బందులను ముందుగా కొంత వరకు పసిగట్టగలం. కొన్ని అనుకోకుండా ఉద్భవిస్తాయి. ఏదైనా ఆ చిక్కులను తొలగించుకొని, ఆ అడ్డంకులను తొలగత్రోసి, ఆ అవరోధాలను అధిగమించి కార్యక్రమాన్ని సాగించగల సత్తా కార్యకర్తలకు కావాలి. ఇందుకు ముందుచూపు, అభ్యంతరాలను ఎదుర్కోగల శక్తి, స్థయిర్యం, మనో నిబ్బరం, ఉపాయాంతరాలను ఆలోచించగల బుద్ధి కుశలత, తోటివారిని ఉత్సాహ పరచగల శక్తి, మొక్కవోని ధైర్యం, ఉచితానుచిత ప్రవర్తన అవసరం. అడ్డం వచ్చే శక్తులను బలహీన పరచగల నేర్పు అత్యవసరం. ఇలా వాటిని అధిగమించి పురోగమించిగల సామర్ధ్యం సంతరించుకోవటం అవశ్యం జరగవలసిన పని.

సంఘ నిర్మాణం:- సంఘ నిర్మాణాన్ని గురించి శ్రద్ధతీసుకోవాల్సి ఉంటుంది. సంఘ లక్ష్యసాధన స్వేచ్ఛా సముపార్జన, సమానత్వ సాధన, సౌభ్రాతృత్వలబ్ధి అయినపుడు సంఘ నిర్మాణంలో ఈ మూడు విలువలు స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం చోటు చేసుకోవాలి. నియంతృత్వం, అసమానత్వం, అనైక్యత సంఘంలో విలయ తాండవం చేస్తే లక్ష్యాలను సాధించలేము.

మన లక్ష్యాలకు అనుగుణంగా సంఘ నిర్మాణం సాగాలి. కనుక సంఘంలో ప్రజాస్వామ్యం వెల్లి విరియాలి. పెత్తందారీతనం, ఒంటెత్తుపోకడ, అహంభావ ప్రదర్శన, లాంటి ధోరణులు అవాంఛనీయాలు. ఒకవేళ అవి తల ఎత్తినా మొగ్గలోనే త్రుంచివేయాలి. ఈ కృషిలో విజయం సభ్యుల చైతన్యంపై ఆధారపడి ఉంటుంది.

## సంఘ నిర్మాణాన్ని బలపరచే అంశాలు :-

చిత్తశుద్ధి కల సభ్యులు, నాయకత్వ లక్షణాలను పుణికి పుచ్చుకున్న కార్యనిర్వాహక వర్గం, సాధన సంపత్తి, ప్రజా సమీకరణ శక్తి, ప్రచార సామర్ధ్యం, వ్యతిరేకించే వర్గాల ఎత్తుగడలను తుత్తునియలు చేయగల సత్తా, విపత్కర పరిస్థితుల్లో కూడా ఆదుకోటానికి అవసరమైన సంఘ నిధి, సంఘ కార్యకర్తలను నాయకత్వాన్ని రక్షించుకోవటానికి ప్రత్యేక ఏర్పాట్లు-రక్షకదళం, భద్రతా చర్యలు, వైద్య సహాయం ఇచ్చే

డాక్టర్లు, నర్సులు, అవసరమైన మందులు, ఆస్పత్రులు ఇలాంటివి ఎన్నో సంఘ నిర్మాణానికి బలాన్ని చేకూరుస్తాయి.

స్వార్థదృష్టి, అహంభావవైఖరి, పెత్తందారీ పోకడ, తోటివారిని న్యూనత పరిచే నడవడి, ఆత్మస్తుతి, పరవంచన, నిరంకుశ ధోరణి, తాను పట్టిన కుందేటికి మూడు కాళ్ళనే మొండి పట్టుదల, ఇతరుల నుండి తెలుసుకోవటానికి వైముఖ్యం, ప్రజానీకం యెడ నిరాదరణ భావం, క్రమశిక్షణా రాహిత్యం ఇవన్నీ సభ్యులకు ఉండరాని లక్షణాలు. ఇవి సరియైన సంఘ నిర్మాణానికి అవరోధాలు, ఆటంకాలు.

హంగులు :— పైన వివరింప బడినట్లు సక్రమ సంఘ నిర్మాణానికి దోహదం చేసే అంశాలు ఉన్నా సంఘాలకు కొన్ని హంగులు లేక పోతే అవి సమర్థవంతంగా పని చేయలేవు. అవి తగినంత సభ్యత్వం-ఒకరిద్దరు సభ్యులతో' వారు ప్రతిభావంతులయినా ఉన్న సంఘం సమర్థవంతంగా కార్యక్రమాన్ని నిర్వహించలేదు.

సిబ్బంది :— సంఘానికి దైనందిన విధ్యుక్త నిర్వహణకు కూడా కొంత సిబ్బంది అవసరం. లేఖకులు, చిత్రకారులు, గేయరచన చేసేవారు, గాయనిలు, నినాదాలు ఇచ్చేవారు, ఊరేగింపు రక్షణ బాధ్యతను చేపట్టేవారు, సభలను, సమావేశాలను నిర్వహించగల నేర్పుకలవారు, కరపత్ర రచన సాగించగల ధీమంతులు, వక్తలు, ప్రచారకులు అత్యంత అవసరం. వీరు సంఘ శక్తిని బట్టి వేతనాలు స్వీకరించేవారు కావచ్చును. లేక ఉచితంగా సేవ చేసేవారు కావచ్చును. ఏదైనా వారందరిచే సేవలు సంఘానికి దక్కాలి. సిబ్బంది ఖర్చులకు, కార్యక్రమాలకు కొంత నిధి సేకరణ కూడా చాలా అవసరం. ప్రజల నుండి చందాలు, విరాళాల ద్వారా డబ్బు పోగుచేయాలి.

నిధి :- మామూలు సమయాలల్లో కాకపోయినా పోరాట కాలములో ధనవ్యయం ఎక్కువగా ఉంటుంది. అందువలన పోరాటానికి దిగేముందు అవసరమైన మేరకయినా నిధి సేకరణ చేసుకొని ఉండాలి. ఉదాహరణకు గ్రామీణ ప్రాంతాలలో పొలాల్లో పని చేసే ఆడ కూలీలు సమ్మె చేస్తే ఆ సమ్మెను జయప్రదంగా నిర్వహించటానికి, సమ్మెలో పాల్గొనే సభ్యుల లేక స్త్రీలను పోషించుకోవటానికి నిధి అవసరమవుతుంది. కావున నిధి నిర్మాణం ముఖ్యమైన హంగు.

పేరు ప్రఖ్యాతులు :- ఎన్ని హంగులు ఉన్నా సంఘానికి మంచి పేరు లేక పోతే, సంఘం రాణించదు. మంచి పేరు అనేది ఒక్కసారిగా రాదు. నాయకత్వం యొక్క చిత్తశుద్ధి, కార్యకర్తల దీక్షాత్యాగాలు, సామర్థ్యం వీటిపై అది ఆధారపడు తుంది. అప్పుడే ప్రజలు సంఘాన్ని విశ్వసిస్తారు. సంఘకార్యక్రమాలను బలపరుస్తారు.

మహిళా సంఘాల ఆవశ్యకత, ఆదర్శాలు, లక్ష్యాలు, కార్యక్రమాలు, వాటి స్వభావ స్వరూపాలు తీరుతెన్నులు, ఈనాడు కొన్ని సంఘాలు అనుసరిస్తున్న అవాంఛ నీయాలు, ఇబ్బందులు, ఆటంకాలు, సంఘ నిర్మాణ విధానం, సంఘ నిర్మాణాన్ని బల పరిచే అంశాలు, సంఘాల సక్రమ నిర్వహణకు కావలసిన హంగులు, నిధి సేకరణ ఇలా ఎన్నో విషయాలను ముచ్చటించుకున్నాం.

ముఖ్యంగా సమగ్రమైన అవగాహన, సరియైన ఆలోచన, సమయోచిత జ్ఞానం, యుక్తాయుక్త విచక్షణ, సక్రమ నిశ్చయశక్తి వీటిని స్త్రీ విమోచనోద్యమకారులు ప్రద ర్శించ గలిగినపుడు ఆదర్శాలను, లక్ష్యాలను సాధించగల మహిళా సంఘాలను నిర్మించ టంలో కృతకృత్యులం కాగలం.

# మహిళా సంఘాలు : వృద్ధ మాతలు

ఈ సమాజంలో స్త్రీలున్నారు. పురుషులున్నారు, బాలబాలికలున్నారు, యువతీ యువకులున్నారు. అలాగే వృద్ధులూ వున్నారు. అందరికీ వైవిధ్యంతో కూడిన సమస్యలూ వున్నాయి. వీరందరికీ ఆకార, గుణ, లక్షణాలలో ఎలా తేడాలుంటాయో అలాగే వారి సమస్యలలో తేడాలుంటాయి. కాని అసలు సమస్యలు లేవనుకొనుట భ్రమ. కొందరికి మానసిక సమస్యలుంటే మరి కొందరికి శారీరక సమస్యలుండవచ్చు. కొందరికి చిన్న తరహా ఇబ్బందులుంటే మరికొందరికి విడదీయరాని చిక్కుపడిన దారపు వుండ లాంటి సమస్యలున్నాయి. అనేక కష్టాలతో కుమిలి పొయ్యేవారూ లేకపోలేదు. అందులో కొన్ని ప్రకృతి సహజ లక్షణమైనవి కూడా వున్నాయి. అవి అనివార్య మైనవి. వాటినే "జర, మృత్యువు" అంటాం. వాటికి ఏ ప్రవక్త కాని, సైంటిష్టు గాని, మేధావి కాని, ధర్మశాస్త్ర నిర్ణేత కాని అధిగమించగల సిద్ధాంతాన్ని ప్రతిపాదించ లేకపోయాడు. "యద్దృశ్యం తన్నశ్యం" అన్నట్లు ప్రతి వస్తువుకు ప్రాణికి మార్పు, నశింపు వున్నాయి అనేది నగ్న సత్యం అని తేలిపోయింది. ముఖ్యంగా మానవుడు దుఃఖపడేది వ్యాధి, జర, మరణాలను గురించి; అందుకే గౌతమ బుద్ధుడు వాటి విముక్తికై అన్వేషించాడు. బాధ పడ్డాడు. ఆఖరికి సర్వసంగ పరిత్యాగం చేశాడు. దీర్ఘకాలం శ్రమించి చివరికి అష్టాంగ మార్గాలను ప్రబోధించాడు. అయినా జర మరణాలను, దుఃఖాన్ని మానవుడు అధిగ మించలేడని తేలిపోయింది. అవి ప్రకృతి ధర్మాలని శారీరక లక్షణాలని ఋజువయింది. వాటినీ గురించి, దుఃపడటం అవివేకమే కాక వృధా శ్రమ కూడాను.

మనం బిడ్డ పుట్టగానే ఆనందిస్తాం. పెరుగుతుంటే ఉల్లాసపడతాం. విద్యాబుద్ధులు గడిస్తుంటే ఉప్పొంగి పోతాం. వారి నవయవ్వనాన్ని చూచి సంతోషిస్తాం. పెళ్ళిపేరం టాలు చూచి తృప్తిపడతాం. ఇంతవరకూ మానవజీవితం సంతోషదాయకం. ఇప్పుడు బాల్య యవ్వన, కౌమారదశలు దాటి వార్ధక్యం ప్రవేశిస్తుంది. ఈ దశలో మానవుడు అసంతృప్తి పాలవుతాడు. జవ సత్వాలుడిగాక, శక్తి సామర్థ్యాలు తగ్గాక ఎవ్వరికీ అక్కరలేని వాడవతాడు. అదే దశలో రుగ్మతులు (జబ్బులు) వస్తాయి. అశక్తుడయి పోతాడు. సంపాదించే శక్తి సన్నగిల్లుతుంది. చాకిరీ చేసే దశ దాటి పోతుంది. ఇంత వరకు అనుభవిస్తున్న సుఖసంతోషాలు దూరమవుతాయి. ఇతరుల మీద ఆధారపడవల సిన పరిస్థితి వస్తుంది. ఇక మొదలవుతాయి కష్టాలు. ఈ జీవిత దశ దుర్భరంగా వుంటుంది. ఇటు ఆత్మాభిమానం, అటు అశక్తత; ఇటు ఏకాంతజీవితం, అటు నిరప

యోగమైనదశ; ఇటు భరించరానీ ఆవేదన, అటు నిరాదరణ; ఇటు తీరని కోరికల బరువు, అటు అనురాగ ఆప్యాయతలకు లోటు ఇలా అనేక సమస్యలతో బాధలతో గడుస్తుంది శేష జీవితం.

వయస్సు మళ్ళే కొద్దీ, వార్ధక్యం పెరిగేకొద్దీ బిడ్డలకు బరువయిపోతారు వృద్ధులు. ఆ దశలో వృద్ధ దంపతులు మాత్రం ఒకరికొకరు తోడునీడగా వుంటారు. కాని కొన్ని కేసుల్లో వారి మధ్య కూడా కలతలు పెరిగి దూషించుకోవటం అనివార్యమవుతోంది. అలాంటి సందర్భాలలో విడిపోయిన దంపతులూ లేకపోలేదు. ఇక వారి మనుగడ నరకప్రాయమని వేరే చెప్పాల్సిన పనిలేదు.

ఇక బిడ్డలకు వృద్ధులకూ వుండే సంబంధ బాంధవ్యాలను గురించి చెప్పాలంటే అదొక మహాభారతం లాంటి గ్రంథం అవుతుంది "అడ్డాల నాడు బిడ్డలుగాని గడ్డాల నాడు బిడ్డలుకారనే" సామెత అక్షరాల నిజం. నిన్నటి దాకా కబుర్లు చెప్పారు, సుష్టుగా అర్థమైన చాకిరీ చేయించుకుంటారు. నోట్లోది తీసుకొని తింటారు. ఇళ్ళూవాకిళ్ళూ అమ్మించి చదువుకుంటారు. తండ్రి తన పరపతిని వాడి ఉద్యోగార్హుణ్ణి చేస్తాడు. పెళ్ళి వగైరాలు అయిపోతాయి. ఉద్యోగమనే నెపంతో దూరమయిపోతారు నూతన దంపతులు. సంవత్సరానికొకసారి 'విజిటర్సులా' వచ్చిపోతారు. లక్షలు సంపాదించే పిల్లలుకూడా పది రూపాయలిచ్చి అదేదో పెద్ద త్యాగంగా భావిస్తారు. అదైనా నోరువిప్పి, ఏడ్చి మొత్తుకుంటే ఏదో దానం చేసినట్లు విసిరేస్తారు. తమ ఆదాయంలో ఒక వంతు (అంటే 1%) ఇవ్వనివారు నూటికి 99 మంది వున్నారు. జరుగబాటు లేని వారి గతి కూడా ఇంతే బిడ్డల్ని పెంచే సమయంలో తమకు ఆస్తి మిగల్చుకోవాలని కాని తమ భవిష్యత్తును గురించి కాని యోచించరు మాతాపితలు. ఆ తరుణంలో వారి దృష్టి అంతా బిడ్డల సంక్షేమాన్ని కోరుతుంది. తమ శక్తి, ధనము, కాలము అన్నీ పిల్లల పెంపకానికే వినియోగిస్తారు. తమ నోట్లో వస్తువు వారి నోట్లో పెడతారు. వారు తిన్నది బంగారం గాను భావిస్తారు. సర్వస్వం త్యాగం చేసి వారిని వృద్ధిలోకి తెస్తారు. వీరు పెరిగాక తమనేదో ఉద్ధరిస్తారని ఊహిస్తారు. ఆ మాటకొస్తే ఆ పెంచే దశలో అసలు వీరు తమకు అండగా నిలుస్తారా, లేదా, అనే ఊహే రాదు. అప్పుడు రేపటి సంగతిగాని, మరో ఆలోచనగాని వారి బుర్రలోకి చొరపడదు. అంటే అంత మమేకంతో, మైకంతో పిల్లల్ని పెంచుతారు వారు తమ సొంతంగా భావిస్తారు. అలాగే జరిగి పోతుందని అనుకుంటారు. నిద్రాహారాలు మాని తమ చూపు, లక్ష్యం, ధ్యేయం అంతా వారి లాలనతో మిళితం చేసుకుంటారు. "తల్లి మనస్సు, వెన్న; పిల్ల మనసు రాయి" అనే సామెత

పుట్టింది. దానికి బోలెడన్ని వుదాహరణలున్నాయి. అసలు మిమ్మల్ని మేము కనమని అభ్యర్థించామా? మా కోసం కన్నారా? మీ ఆస్తి అంతా మా కోసం వినియోగించమని కాళ్ళా వేళ్ళా పడ్డామా? మమ్మల్ని ఉద్ధరించటానికి ఇదంతా చేశారా? మా పెంపుదల మీ పెట్టుబడిగా అంటున్నారా? అసలు మా ఉనికికే మీరు కారణం అయినప్పుడు మాకు మీ త్యాగాలు గట్రా ఎలా తెలుస్తాయి? మేము పెరిగాక మా గురించి ఆలోచిస్తాం గాని ఇలా వత్తిడి చేయటం, మీరు మమ్మిల్ని అడగటం న్యాయం కాదు. అంటారు పిల్లలు. ఒక విధంగా ఆలోచిస్తే ఇందులో పరమ రహస్యం వుంది. నిజానికి వాళ్ళు మన్ని కనమనలేదు. పెంచమనలేదు. ఆస్తులు ఇవ్వమని కోరలేదు. ప్రేమించమని అర్ధించనూ లేదు ఇద్దరి మధ్యా ఏ ఒడంబడిక లేదు ఏ కాంట్రాక్టూ లేదు, ఎందుకు కంటారో ఎందుకు పెరుగుతున్నారో, ఎందుకు పెంచుతున్నారో ఆ దశలో ఇద్దరికీ అర్థం కాదు. అలా ఇద్దరూ ఏమీ ఊహించలేదు. అదొక అద్వితీయమైన తన్మయావస్థ. అప్పులూ, పెట్టుబడులూ, వడ్డీలూ, లాభాలూ ఆలోచించే ఏ అర్థిక శాస్త్రానికి కట్టుబడని ఆప్యాయత, అనురాగం అక్కడ చోటు చేసుకుంటాయి. అంతేకాని దానికి (సొల్యూషన్) ఎవరూ చెప్పలేరు. అది తల్లీపిల్లల అనుబంధం. దానికి ప్రతిఫలం లేదు. ఆ ఋణానుబంధం తీరేది కాదు. ఇదీ అసలు విషయం.

ఒకతల్లి పదిమంది పిల్లల్ని పెంచుతుంది కాని ఆ పదిమందీ కలిసి ఈ వక్క తల్లిని కడతీర్చేటానికి షరతులు పెడతారు! ఒప్పందాలు చేస్తారు, పెద్దల ఎదుట కోర్టులలో సాక్ష్యాలు సేకరిస్తారు. ఎందుకూ అని ప్రశ్నిస్తే? మా ఇష్టం! అది అంతే! మీకు చెయ్యనూవచ్చు! చెయ్యలేక పోనూవచ్చు. అది కేవలం నైతికపరమైన భాష్యం అంటారు పిల్లలు. ఇది ఏ ఒక్కరూ చెప్పలేని, విడతీయరాని చిక్కు ప్రశ్న. దానికి సూటిఅయిన సమాధానం గాలించినా దొరకదు. ఇది దేశానికే కాదు, ఒక రాజ్యానికేకాదు ఒక జాతికే కాదు, ఒక వర్గానికే కాదు, ఒక కాలానికే కాదు, మానవ సృష్టి జరిగిన నాటినుండి, సంస్కృతి, నాగరికతలు ఏర్పడ్డనాటి నుండి జరుగుతున్న పరమ సత్యం. ఇంగ్లండు లాంటి దేశంలో వృద్ధులను ప్రభుత్వం ఆదరిస్తుంది, పోషిస్తుంది; వైద్యం వగైరాలు చేస్తుంది. (**old age Homes**) వృద్ధుల శరణాలయాలను స్థాపించి ప్రభుత్వమే వారి బతువు బాధ్యతలను, అంత్యక్రియలను కూడా చూస్తుంది. అందుకు అవసరమైన ధనాన్ని ఆదాయపు పన్ను నుండి స్వీకరిస్తుంది. వారికి చక్కని భోజనం, వైద్య వసతి లాంటి సదుపాయాలను కలిగిస్తుంది. అయితే ఆ వృద్ధులంతా శాంతి, సౌఖ్యాలతో జీవిస్తున్నారా? అంటే అది వేరే సంగతి. తమ వారు రాశాల్లని తమతో మాట్లాడాలని, తమకే

మైనా తెచ్చిపెట్టాలని కలలు కంటూవుంటామని, గంపెడాసతో ఎదురుచూస్తూ వుంటామని చెప్పారు. చూడకపోతే బాధతో వాపోతూవుంటారు వారి అవసానదశలో కుమారులకు ఫోను చేస్తామని, అయినా వచ్చిచూడని వారున్నారని అక్కడి అధికార్లు చెప్పారు. అంతేకాదు చనిపోయాక బ్యాంకు పుస్తకాలకు మిగిలిన ఆస్తుల కొరకు వస్తారని కూడా చెప్పారు. ఇదీ తల్లుల పిల్లల అనుబంధం.

అయితే ప్రపంచంలో అంతా స్వార్థపరులేనని మనం చెప్పలేం. అది వారి అభిరుచిని బట్టి వుంటుంది. అందుకే వారిని ఉత్తములు, మధ్యములు, అధములు అధమాధములుగా విభజిస్తాం. కొందరు తల్లిదండ్రులను ప్రత్యక్షదైవంగా ఆరాధిస్తారు, కొందరు మధ్యేమార్గంగా గౌరవిస్తారు. కొందరు మంచీ చెడూ పట్టించుకోరు. కొందరున్నారు-కేవలం వారి డబ్బు కోసం, ఆస్తికోసం ఆరాటపడతారు. పోట్లాడి వాటాలు తెచ్చుకుంటారు కొందరైతే ఏదో ఒక వంకపెట్టి చర్చించుకుంటూ ఉంటారు. వారివల్ల ఖర్చుతప్ప ఆదాయం వుండదని బాధపడుతూ వుంటారు. అయితే ప్రతి బిడ్డా దుర్మార్గుడని స్వార్థపరుడని చెప్పటం అమానుషమే కాదు, నేరం కూడా అవుతుంది. అనేక మంది పిల్లలు బుద్ధిమంతులూ, త్యాగపరులూ వున్నారు కాని హెచ్చుమంది తల్లిదండ్రుల విషయంలో న్యాయం జరగటంలేదు. కొందరు భార్య వత్తిడివల్ల మారిపోతారు. కొందరు తమకు తామే స్వార్థపరులౌతారు కొందరు పరిస్థితుల ప్రాబల్యం వల్ల పెద్దలను విస్మరిస్తారు. కొందరన్నదమ్ములయితే తల్లిదండ్రులను విడతీసి తలా కొన్నాళ్ళు పోషిస్తామంటారు. ఆ పరిస్థితి చాలా విషాద భరితంగా వుంటుంది. అంతగా బరువుభారమైపోతారు తాము కన్నపిల్లలకే. ఇది ఈనాడు లోక ధర్మంగా మారింది. అందుకే "భార్య బంగారం, తల్లి చేదు" అనే సామెత పుట్టింది. పెళ్ళయ్యాక వారి వైఖరి పూర్తిగా మారిపోతుంది. మేము ఇంత కుటుంబాన్ని భరించలేమని కొందరూ, వాళ్ళ కోరికలన్నీ తీరాయి మాకు ఇప్పుడేగదా మొదలయింది అని మరి కొందరూ, అసలు మా అమ్మవల్ల మాకు 'ప్రయివసీ' (ఏకాంతం) లేకుండా పోతుందని, ముద్దూ ముచ్చట కరువయినాయని, అంటూ కొన్ని అభిప్రాయాలను బహిర్గతం చేస్తారు? మరికొన్ని సూటిపోటిల మాటలతో దహించివేయ్యేలా అంటూ వుంటారు.

ఇక కోడళ్ళ విషయం, అల్లుళ్ళ పోకడలు చెప్పటానికి అలవికాదు. చిన్నప్పుడు కోడంటికం పెట్టినదని, తనను చాలా కష్టపెట్టి చాకిరీ చేయించిందని సాధిస్తూనే వుంటారు. ఎన్నాళ్ళు బ్రతుకుతుందో నా దురదృష్టం, ఆ మాటకొస్తే నేనే ముందుగా పోతానేమో అంటూ విషం క్రక్కుతూ వుంటుది.

ఈ పరిస్థితుల్లో వృద్ధులు ఏం చెయ్యాలి? గుక్కెడు విషం త్రాగి చనిపోవాలా? జీవచ్ఛవాల్లా బ్రతకాలా; అనేదొక విషమ సమస్య. దీనికి పరిష్కారం ఏమిటి? ఎలా? ఎవరు బాధ్యత వహించాలి? ఏం చెయ్యాలి? అనేవి కొన్ని మౌలిక ప్రశ్నలు.

అయినా ఏ తల్లీ తన పిల్లల మీద చెడుగా చెప్పుకోటానికి సాహసించదు. పైగా వారి మీద ప్రేమ పాశాన్ని చంపుకోలేదు. ఇంకా వారి క్షేమం కోసం పరితపిస్తూ వుంటుంది. ఎలాంటి వారయినా బ్రతికి బాగుంటే చాలని ప్రార్థిస్తూ వుంటుంది. అన్ని దులుపేసుకొని మళ్ళీమళ్ళీ దగ్గరకు పోతుంది. పని పాటలలో సాయపడటానికి వెళ తుంది. ఆఖరికి మనుమల కోసమైనా ఆరాట పడుతుంది. అత్తా ఒకింటి కోడలే! కోడలు రేపు అత్తవుతుంది. అయినా తరాలలో అంతరాలు చోటు చేసుకుంటాయి. ఆ సమ యంలో ముదుసలులకు నా అన్నవారు కరువై పోతారు. ఆస్థివున్నా అనురాగానికి, ఆప్యాయతలకు దూరమై నిర్వీర్యులయి పోతారు. ఆ సమయంలో స్వచ్ఛంద సేవకుల అవసరం ఎంతయినా వుంటుంది.

పిల్లలున్న వారికే ఇన్ని ఇక్కట్లుంటే ఇక పిల్లలు లేనివారి గురించి ఎలా ఆలో చించాలి అనేదొక గడ్డుప్రశ్న. వారు ఏ దాయాదినో, దగ్గర బంధువునో తెచ్చి పెంచి పెద్ద చేసి ఆస్తిపాస్తులకు వారసుణ్ణి చేస్తారు. తమకు తిలోదకాలు ఇస్తాడని, కర్మ కాండలు చేస్తాడని అశక్తులైనప్పుడు అండదండగా నిలుస్తాడని ఆశిస్తారు, కాని కన్న వారైనా, పెంచినవారైనా నిలబడి చేస్తారనే ఆశ ఏమీ వుండదు అది వారివారి అదృష్టం మీద ఆధారపడి వుంటుంది. వారి పిల్లల నైతిక ప్రవర్తనవల్ల జరుగుతోంది. అందువల్ల వృద్ధులు వారి నడివయస్సులో భవిష్యత్తు గురించి బాటలు వేసుకుని, ఒక పథకాన్ని (ప్లాన్) (మనస్సును సేవాపథంలోకి మార్చుకోటం వగైరా) నిర్మించుకుంటే మనస్సు కొంత కుదుటపడి వుంటుంది. కొంతగా కొంత ఢక్కాముక్కలకు తట్టుకోగలుగుతారు. అంత్యదశ వచ్చేసరికి ఎలాగైనా జరిగిపోక మానదు శరీరబాధ ఎవరికి వారె అనుభ వించాలి కాని కోట్లధనమున్నా ధనం మన్ని రక్షించ లేదు. మృత్యువుకూడా అంతే కనుక శేష జీవితాన్ని ఎలా సద్వినియోగం చేద్దామా అనే తపనతో ముందుగానే ఏదో ఒక సర్వీసుకు అంకితం కావాలి.

వృద్ధులు ముందుగానే చేతిలో తడి(డబ్బు) వున్నపుడే వాతి చివరి దశకై కొంత నిల్వ చేసుకోవటం వుత్తమం. డబ్బు వుంటె కొంతగా కొంత తృప్తి వుంటుంది. అంటె లేవలేనప్పుడు ఏ వస్తువైనా కొనుక్కోవటానికి కాస్త ఆసరాగా వుంటుంది. లేకపోతే ఇటు దరిద్రం, అటు ఒంటరితనం రెండూ వార్ని దహించి వేస్తాయి. ప్రావిడెంటు ఫండు, ఎల్. ఐ. సి లాంటివి పిల్లలకు ఇవ్వకుండా తామే వుంచుకోవటం శ్రేయస్కరం. అదేమీ నేరంకాదు. జుట్టు చేతికిచ్చి వాళ్ళడిగినట్లు నడచుకోరాదు. ఎంత ఇచ్చినా పుచ్చుకుంటారు పిల్లలు. వీళ్ళు ఇచ్చిండే తిరిగి పైసా అడిగినా అదేదో పెద్ద దుబారాగా భావిస్తారు అందువల్ల బారెడు పోనూవద్దు మూరెడు కుంగనూ వద్దు అన్నట్లు మనం ముందుచూపు చూచుకోవటం తప్పుకాదు. అంతమాత్రాన పిల్లల్ని నిర్లక్ష్యం చేయమనికాదు. కన్నందుకు వారిని సర్వవిధాలా పోషించటం, తీర్చిదిద్దటం మన ప్రథమ కర్తవ్యం. అటువారినీ అన్యాయం చేయవద్దు. ఇటు మనమూ నష్టపోరాదు. వృద్ధులంతా సంఘాలుగా ఏర్పడి తమ సమస్యలను చక్కదిద్దుకుంటూ వుండాలి. సమాజానికి పనికివచ్చే చర్చలు, సమావేశాలు జరుపుకోవాలి ప్రభుత్వం నుండి సహాయాన్ని అర్థించాలి.

ఈనాడు మహిళా సంఘాలు చేపట్టాల్సిన కార్యక్రమాలలో ముఖ్యమైనది వృద్ధుల సంరక్షణ. అంటే అది అందరూ చేపట్టలేరు. కొందరు మాత్రమే ఆ పని చేయగలరు. కొన్ని సంఘాలు కుట్లు క్లాసులు, హిందీ తరగతులు బాల్వాడీ స్కూళ్ళు, సంగీతం నాట్యం లాంటివి నిర్వహిస్తున్నారు. కొన్ని సంఘాలు మీటింగులు సెమినార్లు, చర్చావేదికలు నిర్వహిస్తున్నారు. కేవలం వరకట్న మరణాలు, స్త్రీలపై అత్యాచారాలు ఇతరత్రా వేధింపులు వగైరాలను గురించి శ్రద్ధచూపే వారు వున్నారు. స్త్రీల జీవనోపాధికి తగుచర్యలు చేపట్టే వారూ వున్నారు. పూర్తిగా స్త్రీల సమస్యలపై నొక్కచూపే సంఘాలూ వున్నాయి. కాని ఈ తరహా అంటే వృద్ధుల సమస్యలపై ఆసక్తి చూపే సంఘాలు చాలా తక్కువ. దరిదాపు లేవనే చెప్పుకోవచ్చు. వయో వృద్ధుల కష్టాల గురించి అందరికీ తెలుసు. అందరూ అనుభవించేవే అయినా నిమ్మకు నీరెత్తినట్లు పట్టించుకోరు. ఈ సమాజంలో ఎన్నో సమస్యలున్నాయి; ఎన్నోరకాల ఇబ్బందులున్నా అందరూ అన్ని సమస్యలూ పట్టించుకోలేరు. కాని ఈ సమస్య (వృద్ధాప్యం)

మాత్రం అందరికీ వస్తుంది. ఇందులో జాతిభేదంలేదు. లింగభేదం లేదు. ధనవంతులు బీదవారనే తారతమ్యం లేదు. కనుక మహిళా కార్యకర్తలు మహిళాసంఘాలు వృద్ధాశ్రమాలు నిర్మించాలి, వారికి సంఘాలద్వారా మనం మనశ్శాంతిని కలిగించాలి. ఆ దశలో వృద్ధులు కోరేది మానసిక శాంతి. తియ్యని పలకరింపు, అభిమానం, ఆత్మీయత, ప్రశాంత వాతావరణం. ఇన్నీ లేకపోయినా ఏ ఒక్కటి వున్నాచాలు. పరమానంద భరితులౌతారు. వారికి కాస్త కబుర్లు చెప్పేవారుంటే చాలు. వార్తలు చదివి విని పిస్తే చాలు. పిట్ట కథలూ, లోకాభిరామాయణం చెప్తుంటే మహానందభరితులౌరు. గుప్పెడు మెతుకులు ఇంత గాలి, నీరు, నీడవుంటే చాలు. కేవలం పని మనుష్యులు (జీతగాళ్ళు) సానుభూతి, అభిమానం చూపలేరు. సంఘాల ద్వారా మనం వారి యెడ జాలి, అభిమానం కరుణ చూపడం మన సేవా రంగంలో ముఖ్యం కావాలి. అది స్వచ్ఛంద సంస్థల కనీస కర్తవ్యంగా భావించాలి.

# జాతీయ సమైక్యత: మహిళల ప్రాధాన్యత

మన దేశంలో అనేక కులాల, మతాల, భాషల వారు నివసిస్తున్నారు. వీరి ఆచార, సంప్రదాయాలు వేరువేరుగా వున్నందు వల్ల సమైక్యత లోపిస్తోంది. వీరిలో కుల, మత, భాషా ప్రాంతీయ దురభిమానాలు మెండుగా ఉండడం వల్ల జాతీయ సమైక్యత దుర్లభమనే వాదన ప్రబలంగా వుంది. అయినా పూసలలో దారం వలె భిన్నత్వంలో ఏకత్వం, ఏకత్వంలో భిన్నత్వం వుండబట్టే మనమంతా కలిసి జీవిస్తున్నామని మరో వర్గం వాదిస్తోంది. మత కలహాలు జరిగినప్పుడల్లా, కుల కొట్లాటలు సంభవించినప్పుడల్లా, జాతీయ సమైక్యత భగ్నమవుతోందని నాయకులు గగ్గోలు పెడుతున్నారు. భాషా విభేదాలు, సరిహద్దుల కొట్లాటలు జరిగినప్పుడల్లా సహజీవనం నశిస్తోందని ప్రజలు భయాందోళనల పాలవుతున్నారు. ఈ కలవరపాటుకు అసలు ఆధారం వుందా? లేక కల్పించుకున్న భయాల ఫలితమా? అసలు జాతీయ సమైక్యత అంటే ఏమిటి? అది మనదేశంలో నెలకొని వున్నదా? లేదా? లేకపోతే దేశానికి కలిగే ప్రమాదం ఏమిటి? ఈ ప్రమాదాన్ని ఎలా అరికట్టాలి? దీనికి జనాభాలో సగ భాగమైన స్త్రీల కర్తవ్యం ఏమిటి? అనేవి నేటి చర్చనీయాంశాలయినాయి. కనుక పరిశీలిద్దాం.

సమైక్యత సహజీవనం కన్నా గొప్పది. కనుక సమైక్యతను భాషా సమైక్యత వల్ల సాధించగలమా? లేకా మత సమైకత వల్లనా, చారిత్రక పరిశీలనవల్లనా, ప్రేమ వివాహాలవల్లనా, 'కామన్ సివిల్ కోడు' వల్లనా అనేవి అంతర్భాగాలుగా వున్నాయి. కనుక సునిశితంగా ఆలోచిద్దాం.

మనదేశంలో భిన్న జాతులున్నాయి. ఇంగ్లీషు వారు వచ్చేవరకు ఒక జాతిగా మనం ఏర్పడలేదు. తెలుగువారు, తమిళులు, కర్నాటకులు, మహారాష్ట్రులు, మాగధులు, కోసలులు, బంగ్లావారు ఇలా అనేక భాషలు మాట్లాడేవారు ఉన్నారు. కనుక వారంతా వేరువేరు జాతులుగా భావించ బడ్డారు. జాతీయ సమైక్యత అంటే విభిన్న జాతులమధ్య ఐక్యతా భావం నెలకొని వుండటమనే భావం ప్రబలంగా వుంది. ఇది సరిఅయిన అవగాహన కాదనటానికి కొన్ని తార్కాణాలు వున్నాయి.

కేవలం భాషకు ప్రాధాన్యతనిచ్చి జాతిని నిర్వచనం చేయటం పొరపాటు. అనేక భాషలు మాట్లాడే వారైనా ఒకే మతాన్ని అవలంభిస్తే వారిలో సర్వసామాన్యంగా

కొన్ని లక్షణాలు ఏర్పడతాయి. అంటే మరాఠీ హిందువులకు తమిళ హిందువులకు కాశ్మీరీ హిందువులకు మధ్య కొట్టవచ్చినట్లు కనపడే తేడా వుండదు. ఇంతకూ చెప్పే దేమంటే మతాలనుబట్టి జాతిని నిర్వచనంచేస్తే భిన్న మతాలవారి ఐక్యతను మాత్రమే జాతీయ సమైక్యతగా పేర్కొనడం సమంజసమని కొందరు పొరాడుతున్నారు. ఈ భావం కూడా పొరపాటు ధోరణి కావచ్చు.

కేవలం ఒక్క భాషవల్ల మాత్రమే జాతి ఏర్పడదు. అలాగే ఒక మతం జాతి లక్షణాన్ని శాసించలేదు. మతం, భాష, కులం, వేషధారణ, ఆచార వ్యవహారాలు, నివసించే ప్రదేశపు వాతావరణం ఇవన్నీ కలిస్తే జాతి ఏర్పడుతుంది. నాగరికత అనండి. సంస్కృతి అనండి, మరేదన్నా అనండి, కాని అన్నీ కలిస్తేనే విలక్షణమైన జాతిగా భాసిల్లుతుంది. అటువంటి జాతులమధ్య సమైక్యతనే జాతీయ సమైక్యత అని నమ్మేవారు అనేకమంది వున్నారు. ఇది కూడా పూర్తి సత్యం కాకపోవచ్చు ననేవారూ లేక పోలేదు.

భారతజాతి మొదటి నుండి వుంటూనేవుంది. మనదేశంలోకి అనేక పర్యాయాలు తండాలుగా వచ్చిన ఆర్యులు ఇక్కడి ద్రావిడులతో కలిసి పొయ్యారు. జాతికి లక్షణమైన ధర్మ పరాయణత్వం, సహిష్ణుత, దయ, దాక్షిణ్యం ఇవన్నీ జాతి లక్షణాలుగా వెలిసినయి. ఇటీవల ఇవి మరుగున పడిపోయినాయి. వీటిని సముద్ధరించడం నేటి మన కర్తవ్యం. అందులో ఈ బాధ్యత ముఖ్యంగా స్త్రీల మీద వుంటేనే పని సుకరమవు తుందనేది నగ్నసత్యం.

పై అభిప్రాయాలన్నీ సరిఅయినవే అయినా పాక్షిక సత్యాలుగానే భావించడం సమంజసం. భాష, మతం నివాసం, సామాజికరీతి ఇవన్నీ ముఖ్యమైనవే. కాదనడానికి వీలులేదు. కాని వీటన్నింటినీ మించినది మానవధర్మం. అంటే మనిషిలోని స్వేచ్ఛా పిపాస, సత్యాన్వేషణ, వివేచన, నైతికదృష్టి వీటి ఆధారంతో విలసిల్లే సంస్కృతికి మనం ప్రాధాన్యత ఇవ్వాలి. అలాంటి సంస్కృతి కల జాతీయ సమైక్యతకై మనం పాటు పడాలి. అలాంటి సమైక్యతకే శాశ్వతత్వం వుంటుంది.

ఇంతకూ స్త్రీలంగా మనం జాతీయ సమైక్యతను ఎలా సాధించగలం అనేది మరో ముఖ్యప్రశ్న. మనం తల్లులుగా, ముందుగా మన కుటుంబాల్లోనే సమైక్యతా భావాన్ని ప్రారంభించాలి. అంటే, పిల్లలకు చిన్న నాటనే సమానత్వ భావాన్ని ప్రోది చెయ్యాలి. మనమంతా ఒకే దేశానికి చెందిన వారమని పదేపదే చెప్పిన మహాత్మాగాంధీ బోధనలు మనం మన పిల్లలకు చిన్న నాటినుండి నూరి పొయ్యాలి. ..........వారిలో

తమ జాతిపట్ల గౌరవ భావాన్ని, దేశాభిమానాన్ని పెంపొందించాలి. అందరం భారత మాత అనుంగు బిడ్డలం అనే అభిప్రాయాన్ని మన బిడ్డల మనస్సులలో నాటాలి. అంతే కాదు. ప్రజాసముదాయాల్లో భిన్నమైన ఆచారాలు వుండవచ్చు. కాని వాటి వెనుకవున్న మౌలికమైన ఆలోచన ఇంచు మించుగా ఒకటే. ఉ॥ ఏకపత్నీత్వం వున్నా, లేక బహు భార్యాత్వం వున్నా స్త్రీ పురుషుల జంటయొక్క ప్రేమభావం ప్రాధాన్యత వహిస్తుంది. బాహ్యమైన పరిస్థితులు మారినా ఆంతరంగిక ఆలోచనలలో అట్టే తేడా వుండదు. ఒకే రకపు సమాజపు పరిణామ దశలో వున్న గ్రీకులకు, ఆర్యులకు భావాల్లో తేడా అట్టే వుండదు. కనుక తల్లులుగా, భార్యలుగా మన పిల్లలకు, భర్తలకు చారిత్రక దృష్టిని అలవాటు చెయ్యాలి. మతాలు భిన్నమైనా అందరూ దేవుని బిడ్డలే. దేవునికి పేర్లు వేరయినా దేవుడొక్కడే. ఒకరు దేవాలయంలో పూజిస్తే మరొకరు మసీదులో ప్రార్థన చేస్తారు. ఇంకొకరు చర్చిలో ధ్యాన సమాధిలోకి పోతారు. శిక్కులు గ్రంథ పఠనం సాగిస్తారు. ఇదంతా ఆస్తికుల విషయం. నాస్తికుల విషయంలో మానవత్వం ముఖ్య సూత్రం. ఈ విషయాన్ని ముందుగా గ్రహించాల్సింది స్త్రీలు. అంతే కాదు. భాషవల్ల జాతి ఏర్పడుతుందన్నమాట సమంజసమే. అయినా తరచి చూస్తే భిన్న భాషల మధ్య సారూప్యత కనిపిస్తుంది. మాత, మదర్, మేటర్ ఇవన్నీ ఒక జాతివే. ఈ విషయాన్ని భాషా శాస్త్ర అధ్యయనం ద్వారా మనమందరం గ్రహించటం అత్యవసరం.

దేశంలోవున్న భిన్నత్వాన్ని, దాని ప్రాముఖ్యతను విచారించాం. అయినా, పూసల్లో దారంలావున్న ఐక్యతా భావాన్ని వెలికి తెచ్చాం. మానవులంతా ఒకటే అనే భావం ఐక్యతను బలపరుస్తోందని చెప్పుకొన్నాం. భిన్నత్వంలో ఏకత్వాన్ని నిరూపించాం. స్త్రీ పరంగా జాతీయ సమైక్యతన ఎలా సుస్థిరం చెయ్యాలచేది ముఖ్యాంశం. సహజంగా స్త్రీలు శాంతి స్వభావులు కనుక ముందుగా కుటుంబంనుండే సమైక్యతను సాధించాలి. తమ బిడ్డలకు ఉగ్గుపాలతోపాటు ఐక్యతాభావాన్ని నూరిపొయ్యాలి. కుల మత భాషా భేషజానికి వారిని అతీతుల్నిగా తీర్చి దిద్దాలి. తమ భర్తలలో జాతీయైక్యతను పెంపొందించాలి. వారిలోవున్న కుల, మత, భాషా అసహనాన్ని నిర్మూలించాలి. సమ సమాజ స్థాపనలో ముఖ్యపాత్ర ధారులు కావాలి. సర్వమత సమ్మేళనాల్లో పాల్గొనాలి. ముఖ్యంగా ప్రేమ వివాహాలకై శ్రమపడాలి వాటి వల్లనే శాంతి సుస్థిరమవుతుంది. అందులో కులమతాల ప్రసక్తి వుండదు. ఆస్తి అంతస్తుల తేడాలు వుండవు. హెచ్చుతగ్గులు సమసిపోయి అందరు మానవులూ ఒకటేననే భావం ఏర్పడుతుంది. మరో విషయం 'కామన్ సివిల్‌కోడు' వున్ననాడు సమరస భావం తప్పక వస్తుంది.

మతధర్మ శాసనాలవల్ల స్త్రీలతో ఐక్యత నశించింది. అందరూ వేరు వేరయిపోయి, హిందూ, ముస్లిం, క్రైస్తవ మహిళల్ని వేరుచేసి వారి సమస్యలను చికాకు పరుస్తోంది. స్త్రీలంతా కలిసికట్టుగా వుంటే ఏదైనా సాధించగలరు. తమ బిడ్డలకు స్త్రీలు ప్రేమ వివాహాలకు అవకాశమివ్వాలి. ఏది ఏమయినా ఈనాటి స్త్రీకి రెండు బాధ్యతలు నెత్తిన పడ్డాయి. ఒకటి తన్నుతాను ఉద్ధరించుకుంటూ, అదే సమయంలో దేశాభివృద్ధికి, దేశ సమైక్యతకు పాటుపడాలి. ఈ విషయాన్ని గ్రహించిన మహిళలు ముందుకొచ్చి దేశ సమగ్రతను రక్షించ గలరని ఆశిద్దాం.

మతానికి ప్రాధాన్యతయిస్తే సర్వమత సమధర్మం పేరుతో అత్యధిక సంఖ్యాకుల మతాన్ని దేశం మొత్తంపై రుద్దితే, 'లింకు' భాషగా ప్రవేశ పెట్టిన హిందీని రాష్ట్ర భాషగా చేసినంతమాత్రాన, వివిధ జాతుల సంస్కృతీ రూపాలను విస్మరించి భారత సంస్కృతిని అభిమానించి నందువల్ల, దేశం మొత్తానికి ఒకేరకపు పరిపాలనా వ్యవస్థ, ఒకే రకపు పరిపాలకులను ఏర్పరిచి నందువల్ల జాతీయ సమైక్యత సిద్ధించదు.

లౌకిక రాజ్యాన్ని ప్రతిష్టిస్తేనే అది సంభవమవుతుంది. మతాన్ని వ్యక్తిగత ఆలోచనకు, ఆచరణకు వదలివేసి రాజ్యానికీ మతానికీ సంబంధం లేకుండా చేస్తేనే, అన్ని జాతీయ భాషలకు సమాన ప్రతిపత్తి కలిగిస్తేనే, జాతీయ సంస్కృతిపై కాక మానవ సంస్కృతిపై నొక్కిపెడ్తేనే, మూసపోసిన పరిపాలనా వ్యవస్థ కాక విభిన్న కార్యాలను సాధ్యం చేయటానికి వివిధ పరిపాలనా వ్యవస్థ రూపాలను ఆమోదిస్తేనే జాతీయ సమైక్యత సిద్ధిస్తుంది.

సమ్యక్ మానవులు ఇతోధిక సంఖ్యలో ఉన్న సమాజం లోనే, పూర్ణమనుజులు ఎక్కువగా ఉన్న సంఘం లోనే శాంతి, సహనం, సమానత్వం, మానవుని హుందాతనం వ్యక్తిత్వం యెడ గౌరవము, సౌభ్రాతృత్వ వెల్లి విరుస్తాయి. అలాంటి సమాజం సమైక్యంగా పురోగమించ కలుగుతుంది. అలాకాక సమైక్యతను బలవంతంగా ప్రజలపై రుద్దితే, సమిష్టి స్వరూపాలయిన జాతి, వర్గం. దేశంలాంటి భావాలపై నొక్కిపెడ్తే అది నిరంకుశత్వానికి దారితీస్తుంది. కాని ప్రజాస్వామ్య భావాలను, సమాజాన్ని పోషించదు.

ఇలా మౌలిక అంశాలను తడవి చూచి, విశ్లేషణ చేసుకుంటేనే తప్ప సమస్య యొక్క నిజ స్వరూపం అవగాహన కాదు. సమస్యా పరిష్కార మార్గాలు స్ఫురించవు. అలా చేయకపోతే జాతీయ సమైక్యత గగన కుసుమ మవుతుంది.

# మహిళలు : మతసామరస్యం

యుద్ధానికి యుద్ధానికి మధ్య విరామాన్ని శాంతిగా భావించినా కలహానికి, కలహానికీ మధ్య గడువును సామరస్య దశగా అభివర్ణించినా రెండూ పొరపాట్లే. కలహం, యుద్ధం బహిర్గత రూపాలు; ద్వేష భావం ఉద్రిక్తత అంతర్గత రూపాలు. పరస్పర శత్రుత్వం రెండు దశలకూ ముఖ్య లక్షణం. శతృత్వ భావన అంతరిస్తే గాని శాంతికి, సామరస్యానికి బాటలు వేయలేము. సహజీవనం వేరు. సామరస్యం వేరు. భిన్నభావాలు విభిన్న సామాజిక వ్యవస్థలు ఉన్నా తగాదాలు, కొట్లాటలు, సంఘర్షణలు, యుద్ధాలు లేకుండా జీవించడం సహజీవనం క్రిందికి వస్తుంది. సహజీవనం రెండు కారణాల వల్ల సాగవచ్చు. గతిలేక, విధిలేక తగాదాలు లేకుండా జీవించడం మొదటిది. దీనిలో పరస్పరత సుహృద్భావం వుండదు; పైగా వైరభావం చోటు చేసుకుంది. సంవత్సరం క్రిందట అమెరికా, రష్యా ప్రభుత్వాల వైఖరులు దీనికి ఉదాహరణగా పేర్కొనవచ్చు. ఎదుట వారి యెడల మైత్రీభావంతో పరస్పర అవగాహనతో మనుగడ సాగించటానికి దోహదం చేసేది రెండవది. సంఘర్షణకు అవకాశాలు వున్నా వాటిని వీలయినంతవరకు తొలగ త్రోసేది ఈ పద్ధతి. సామరస్య ధోరణిలో ఇంకా ప్రయోజనకరమైన అంశాలు ఇమిడి వుంటాయి. అవతలి వ్యక్తి మీద, భిన్న మతస్థుల పైన గౌరవభావం ఇమిడి వుంటుంది. అన్యులను సమానులుగా పరిగణించే మనస్థత్వం ప్రాతిపదికగా వుంటుంది. కనుక సామరస్య ధోరణి సహజీవన వైఖరి కన్నా ఉత్తమమైనది; శ్రేష్టమైనది.

## ప్రాతిపదిక

ప్రతి మానవ వ్యక్తికి హేతుత్వ శక్తి వున్నది. పశు పక్ష్యాదులకు భిన్నంగా మానవుడిలో ఇంగిత జ్ఞానం మరింతగా వుంది. వివేచనా శక్తి, ఆలోచనా ధోరణి మానవుని ప్రత్యేకత. జ్ఞాపకశక్తి, ఊహా సంవిధానం మనిషి విశిష్టత, ఇంతేకాక కార్యకారణ సంబంధాన్ని గుర్తెరగటం మానవజాతి లక్షణం. ఈ శక్తి సామర్థ్యాల సంపుటిని హేతుత్వం (REASON) అంటున్నాం. ఈ శక్తి ప్రకృతి జన్యమని భౌతికవాదులు అంటే, దీన్ని భగవంతుని వరప్రసాదంగా ఆధ్యాత్మిక వాదులు భావిస్తున్నారు. ఏది ఏమైనా ఇది మానవజాతికి సర్వ సాధారణ లక్షణం. దీని వినియోగానికి రంగు, జాతి, నివాసం, ఆహార విహారాదులు, సామాజికాచారాలు అడ్డు రావు; రాకూడదు.

మానవులంతా దేవుని బిడ్డలు అని తలిచేది ఒక రకమైన మత భావన. దేవుడే తల్లి, తండ్రి, పోషకుడు, రక్షకుడు, అన్నీను. దేవుని పేర్లు వేరు కావచ్చు; రూపాలు

భిన్నం కావచ్చు. కాని దేవుడొకడే అనే భావం చాలా మతాలకు మూలం. ఈ విధంగా ఆలోచించినా వేరు వేరు మతస్థుల మధ్య అంతస్తు భేదాలకు అవకాశం లేదు. విశ్వ మానవ సముదాయం ఒకటే అనే భావనకు దారి తీస్తుంది.

విశ్వ జనీనత, సమానత్వం ఈ రెండూ మానవాళి యొక్క సర్వసామాన్య భావాలు. ఈ అంశాన్ని అవగాహన చేసుకున్ననాడు, భౌతికవాదులు, భావవాదులు, నాస్తికులు, ఆస్తికులు, హిందువులు, ముసల్మానులు, శైవులు, వైష్ణవులు, సున్నీలు, షియాలు అంటే భిన్న మతస్థులు విభిన్న మత శాఖలవారు అందరూ సోదరుల వలె సమానత్వ హోదాపై సంచరించగలరు.

## శాశ్వత విలువలు

సమాజ సమిష్టి జీవితాన్ని సుగమం చేయాలని అనాది కాలం నుండీ అన్వేషణ సాగింది. ఈ విశ్వ రహస్యాలను కనుగొనే ప్రయత్నంలో, ఈ సృష్టికి మూల కారణాన్ని తెలుసుకునే కృషిలో మతం ఆవిర్భవించింది. ఆ మతం సమాజ జీవితాన్ని నియంత్రణ చేసింది. స్వేచ్ఛా పిపాస సత్యాన్వేషణ మానవునికి ప్రేరకాలయినాయి. స్వేచ్ఛా పిపాస మత పరిభాషలో మోక్ష ప్రాప్తికి విలువ విచ్చింది. సత్యాన్వేషణ సైన్సుకూ విజ్ఞానానికీ బాటలు వేసింది. మత భాషలో దేవుని మూలతత్వ దర్శనానికి దోహదం చేసింది. సమాజ సభ్యుల మధ్య సంబంధాలను పటిష్టం చేసే మౌలిక ధర్మాలు అవసరమయ్యాయి. సత్యనిరతి, సోదరభావం, ప్రేమ, కరుణ, దయ, సానుభూతి, క్షమ, పరోపకార పారీణత మానవ ధర్మాలుగా రూపొందాయి. ఇవి శాశ్వతమైన మానవ విలువలు. భిన్న భిన్న ప్రాంతాలలో, వేరు వేరు మతాలలో వీటి బహిర్గత రూపాలు వేరుగా వున్నా మౌలిక సూత్రాలు ఒకే కోవకు చెందినవి. ఈ మానవ విలువలే మతాలకు ప్రాతిపదికను సమకూర్చాయి, అర్థాన్ని సంతరించాయి. ఇలా ఆలోచన చేస్తే సర్వ మత సమభావన ఏర్పడుతుంది.

ఆ మాటకొస్తే మతమంటే మౌలిక విషయంపై అభిప్రాయమన్నమాట. ఇలా ఉత్పత్తి అర్థంకాగా రాను రాను ఆస్తికత్వ రూపాలనే మతాలుగా పరిగణించడం రూఢ్యర్థమయింది. కనుక మతసామరస్యమంటే విశ్వాసుల మతసామరస్యమని అర్థం చెప్పుకోవాలి. అందువల్లనే మతాల ప్రాతిపదికను గురించి చర్చించడం అవసరమయింది.

మతాలు ఏఏ సమాజాల్లో ఉద్భవించాయో, ఏఏ సమాజాల్లో ప్రవర్ధమానమయ్యాయో ఆయా సమాజాల ఆచారాలు, సంప్రదాయాలు, పూజా విధానాలు,

ప్రార్ధనా రీతులు ఆయా మతాలలో భాగాలయినాయి. కాలక్రమేణా ముఖ్యాంశాలయి నాయి. వీటినే ప్రధానంగా భావించి భిన్నత్వంపై నొక్కి పెట్టటం కొనసాగింది. ఇవన్నీ ద్వితీయ శ్రేణివి అని భావిస్తే భావ సారూప్యత గోచరిస్తుంది.

## విభిన్న సామాజిక సాంప్రదాయాలు

మతాలు మానవ సమాజ పరిణామంలో భిన్న దశల్లో ఉద్భవించిన మాట వాస్తవం. సనాతన హైందవం షుమారు నాలుగువేల సంవత్సరాల నాడు భారతదేశంలో పుడితే క్రయిస్తవం రెండువేల సంవత్సరాలనాడు మొదలయింది. ఇస్లాం షుమారు 13 వందల సంవత్సరాల క్రిందట అరేబియాలో మహమ్మదు ప్రవక్త చేత ప్రారంభింప బడింది. ఆర్యుల ఆచారాలు హైందవ మత సమాజంలో ప్రవేశిస్తే, పాలస్తీనా ప్రజల సంప్రదాయాలు క్రయిస్తవ మతంలో జొరబడినాయి. అలాగే అరేబియా వాసుల జీవిత విధానం ముసల్మాన్ మత వ్యవస్థలో చోటు చేసుకుంది. రాను రాను షియాల జీవిత సరళి, సున్నీల జీవిత విధానం భిన్న రూపాలుగా తయారయింది. అవి భిన్న శాఖల శాసనాల్లో ప్రతిబింబించాయి. ఆచారాల విషయం చెప్పనవసరం లేదు. స్త్రీల వస్త్రధారణలో కూడా తేడాలొచ్చాయి. ఇవి అన్నీ కలిసి భిన్నత్వానికి ప్రాధాన్యతను తెచ్చి పెట్టాయి. దాంతో కట్టూ బొట్టూ, భోజన పద్ధతీ, ప్రార్ధనారీతి, వివాహాది శుభకార్యాలు, అంత్యక్రియలు వీటి విషయంగా తేడాలు ప్రబలినాయి. వీటిమీద నొక్కిపెట్టి, అసలు విషయాన్ని—అంటే దేవుడొకడే, మానవులందరూ సమానులు అనే భావాన్ని—మరిచి పోయి భిన్నమతాలవారు తగాదాలకు, కొట్లాటలకు దిగటం శోచనీయం. దీనినే మత దురభిమానంగా మనం పేర్కొనవచ్చు.

## సహన భావం

మతాల మౌలిక సూత్రాలను తమ జీవితాలతో సమన్వయం చేసుకొని సంచ రించేవారు యవనుల పట్ల, అన్యుల యెడ, కాఫిర్లను గురించి సహన భావాన్ని ప్రదర్శి స్తారు. సహన భావం మౌలిక ఆలోచన నుండి జననమందవచ్చు. అలాకాక కేవలం అవసరమైన అంశంగా, ఎత్తుగడగా అంగీకార యోగ్యం కావచ్చు. మొదటి దానికి సుస్థి రత వుంటుంది. రెండవది తాత్కాలికం కనుక అస్థిరమవుతుంది. కేవలం ఆ మతస్తుల ప్రయోజనాల అంచనాపై ఆధారపడే సహన భావ ప్రదర్శన శాశ్వతత్వాన్ని సంత రించు కోదు. అవసరమైతే శాంతి, అవసరం తీరితే వైరం అనే భావన ప్రబలంగా వుంటుంది. పై అంచనాలు మారుతుంటాయి; అస్తుబిస్తు అవుతుంటాయి. కనుక రెండవ రకపు సహన ధోరణి అనుసరణీయం కాదు.

## ఉద్రిక్తతలు, ఉపశమనాలు

మసీదుల వద్ద మేళతాళాల ఊరేగింపు జరిగిందని ముసల్మానులు, ఆవును చంపారని హిందువులు ఉద్రిక్త భావాలను పెంచుకుంటున్నారు. ఇవి దేశాచారాల ఈనాటి రూపాలని మరిచి పోతున్నారు. ఆర్య పురుషులు ఆవు మాంసం తిన్నారు. కాని ఈనాడు గోవధ హిందువులకు నిషేధం. మహమ్మదుగారు మసీదులో ప్రార్థన చేస్తుంటే మేళ తాళాల ఊరేగింపు వస్తే ప్రశాంతతకు భంగం కలిగిందని బాధపడి వాటిని నిషేధించారు. ఈనాటి నగర జీవితంలో మోటారు వాహనాల శబ్దాలు, విమానాల భయంకర ధ్వనులు ప్రశాంతతకు భంగం కలిగిస్తూనే వున్నాయి. గణేశ ఉత్సవ ఊరేగింపు, మొహరం ఊరేగింపు కోలాహలాన్ని సృష్టిస్తున్నాయి కనుక కేవలం మేళతాళాల ఊరేగింపును నిషేధించాలనడం ప్రశస్తం కాకపోవచ్చు. విషయాలను లోతుకుపోయి ఆలోచిస్తే తగాదాలు వుండవు. హిందువులు, ముసల్మానులు, క్రయిస్తవులు, శిక్కులు, వేరు వేరనే భావం హెచ్చుమంది మతస్థులలో నాటుకపోవటం దురదృష్టకరం. ఆచారాలు వేరయినా, సంప్రదాయాలు భిన్నమయినా, జీవిత విధానాలు మారినా అందరూ దేవుని బిడ్డలే అనే భావం ఏర్పడవలసి వున్నది. అలా కాకపోతే అందరికీ ఆలోచనా, వివేచనా వున్నాయి కనుక సమానులని భావించాలి. కుటుంబ జీవితంలో భార్య యెడ అనురాగం, పిల్లలపట్ల వాత్సల్యం, పెద్దలపై గౌరవం, అశక్తులపై సానుభూతి, బలహీనులపై దయా దాక్షిణ్యాలు అన్ని మతాలవారూ, మతం లేనివారూ అందరూ ప్రదర్శిస్తున్నారు. కనుక అనవసర విషయాలపై నొక్కు పెట్టుకొని వైషమ్యాలు పెంచుకొని విరోధాలను వృద్ధి చేసుకోవటం మంచిది కాదు. తగాదాలు, కొట్లాటలు సంఘ వ్యతిరేక శక్తులకు , స్వార్థపరులకు మాత్రమే ఉపయోగిస్తాయి. భిన్న మతాల్లోని సామాన్య ప్రజానీకం నష్టపోతుంది. రౌడీలు, ఖూనీకోర్లు విశృంఖలంగా సంచరిస్తారు. ఈ అంతః కలహాలలో గూండాలు విజృంభిస్తారు. బహుళ సంఖ్యాకులైన హిందువులు హిందూ గూండాను, అలాగే చాలా మంది ముసల్మానులు ముస్లిం గూండాను ఆదరించి గౌరవించడం జరుగుతోంది. ఇంతకన్నా దౌర్భాగ్యం మరొకటివుండదు. హిందూ గూండా ఒక సామాన్య ముసల్మానును చంపితే, ముస్లిం గూండా సాధారణ హిందూ పౌరుని పొడుస్తాడు. కాని ఏనాడూ హిందూ రౌడీలు, ముస్లిం గూండాలు తాముగా ఒకరు మరొకరితో తగాదాకు తలపడరు. వారిద్దరిదీ ఒక వర్గం; వారిద్దరూ ఒకే కోవకు చెందినవారు. వారికి పరస్పర ద్వేషం లేదు. మత కలహాలు, కొట్లాటలువస్తే లాభించేదివారు. వారి సంతానం పెరుగుతుంది. సామాన్య ప్రజలు బలి అయి పోతారు. ఈ వాస్తవాలను గుర్తించిననాడు

ఇరుగు పొరుగువారు భిన్న మతస్థులయినా పూర్వం వలె అన్నా, తమ్ముడూ, మామా, అత్తా, వదినా, మరదలా అని పిలుచుకోగలుగుతారు. అప్పుడే ఉద్రిక్తత సడలిపోయి సమరస భావం వస్తుంది. ఉపశమనానికి నాంది ఏర్పడుతుంది.

## అనుమానాలు, సంకోచాలు

పొరుగున వున్న ముసల్మాను ఇంటిలో ముస్లిం రౌడీని దాచారని ఇరుగున ఉన్న హిందూ గృహంలో హిందూ గూండాకు ఆశ్రయమిచ్చారని ఇరుగు పొరుగువారు అనుమానం పడుతుంటే పరస్పర విశ్వాసం సన్నగిల్లుతుంది. ఆ కుటుంబాల మధ్య మాటలు ఆగిపోతాయి. ఒకర్నొకరు అనుమానంతో చూస్తారు. ప్రక్కింటివారు ఏ దుర్మార్గం తలపెడతారో అనే భయంతో ఒంటరిగా ఇంటికి రావటానికి కూడా సంకోచిస్తారు. ఈ భయ సంకోచాలు, అనుమానాలు సామాజిక వాతావరణాన్ని విషపూరితం చేస్తాయి. పరిస్పర విశ్వాసం సన్నగిల్లుతుంది. అసూయాద్వేషాలు పెచ్చుపెరుగుతాయి. క్షణ క్షణ గండంగా ప్రజలు జీవితాలు సాగించాల్సిన దుస్థితి కలుగుతుంది. హిందువులు వేరు, ముసల్మానులు వేరు, క్రయిస్తవులు వేరు అనే భావన గట్టిగా ప్రజల మనస్సుల్లో నాటుకోవడం గట్టి పడడం సంభవిస్తుంది. ఇది అవాంఛనీయమైన పరిస్థితి.

## అధిక సంఖ్యాకులు, అల్పసంఖ్యాకులు, రాజకీయాలు

చారిత్రక కారణాల వల్ల సంఖ్యాధిక్యత వల్ల భారతదేశంలో హిందువుల ప్రాబల్యం హెచ్చుగా వుంది. దాంతో అల్ప సంఖ్యాకులైన ముస్లిం సోదరులకు శాశ్వతంగా అల్ప సంఖ్యాకులంగానే వుండిపోతామనే భయం కలగడం సహజం. టీనిని— అంటే ఈ మనస్థత్వాన్ని—అధిగమించడం అత్యవసరం. ఇలా భయపడినన్నాళ్ళూ జాతీయ జీవన స్రవంతిలో వారు కలిసిపోలేరు. తమ మత విషయాలను వేరుగా వుంచుకుంటూనే వారు అన్ని మతాల వారితో కలసి మెలసి సంచరించడం అవశ్య కర్తవ్యం. మనము, మన మతం, మన సంస్కృతి, మన సంప్రదాయం అన్నీ వేరు వేరు కనుక మనం ఎవరితో కలిసేది లేదని అధిక సంఖ్యాకులు భావించినా, అల్ప సంఖ్యాకులు తలపోసినా రెండూ పొరపాటు ధోరణులే. వేర్పాటు భావాన్ని పెంచుకోవటం అటు హిందువులకూ, ఇటు ముస్లింలకూ, మరోవైపున శిక్కులకూ మంచిది కాదు. కేవలం వేర్పాటు భావన వల్ల స్వప్రయోజనాలను పొందేవారు మాత్రమే దీనిని బుద్ధిపూర్వకంగా పోషిస్తారు. అనాలోచితంగా వేర్పాటు భావాన్ని పెంపొందించేవారు లేకపోలేదు. వారు మారటం, లేక వారిని మార్చటం తేలిక పని. కాని స్వార్థపరులు మారరు; జనాన్ని

మారనివ్వరు. అంతేకాక ప్రజలు ఈ వేర్పాటు మనస్థత్వాన్ని ఆధారం చేసుకొని వారిని రాజకీయ జూదంలో పావులుగా వాడుకుంటారు. ఇది హిందువులలోని, ముస్లింలలోని వర్గ సంకుచిత రాజకీయ వాదుల ప్రయత్నం. దీని ఆంతర్యాన్ని సామాన్య ప్రజానీకం-అన్ని మతాలవారు-గుర్తించడం అత్యవసరం.

## తాత్కాలిక శాంతి సంఘాలు

కలహాలు, కొట్లాటలు సాగినపుడు తాత్కాలికంగా శాంతి సంఘాలను ఏర్పాటు చేయడం ఆనవాయితీ. అవి సామాన్య ప్రజానీకంతో సంబంధంలేని పెద్దలతో నింప బడతాయి. కనుక అవి పనిచేయవు; చేయలేవు. ఇరుగు పొరుగు వారితో ఏర్పడే సంఘాలు వీధి వీధికి పేట పేటకు, మొహల్లాకు మొహల్లాకు, వార్డు వార్డుకు ఏర్పరిచిన నాడు అవి ఉపయుక్తం అవుతాయి. సర్వసామాన్యంగా శాంతి కాముకులు అందులో సభ్యులుగా ఉండాలి. వారు తమ తమ ప్రాంతాలకు బాధ్యత వహించాలి. గస్తీ తిర గాలి. అవాంఛనీయ సంఘ వ్యతిరేక శక్తుల రాక పోకలను నియంత్రణం చేయగల్గాలి. అపుడే ఏమయినా మంచి జరుగుతుంది.

## శాశ్వత పరిష్కార మార్గాలు

ఇల్లు తగల బడుతున్నపుడు నీళ్ళు పోసి ఆందరం మంటలను ఆర్పవలసిందే, నిప్పును తుద ముట్టించ వలసిందే. కాగా సంఘర్షణల నివారణకు శాశ్వత పరిష్కార మార్గాలను అన్వేషించాలి. ఇక్కడ అనేక అంశాలు ప్రాధాన్యత వహిస్తాయి.

(i) ఒకరి సంస్కృతిని మరొకరు అవగాహన చేసుకోటానికి ప్రయత్నం చేయాలి.

(ii) హిందువులు ఉర్దూను, ఆంధ్రప్రదేశ్‌లో ముస్లింలు తెలుగును నేర్చుకోవటానికి మాట్లాడటానికి కృషిచేయాలి. వందల సంవత్సరాలు ప్రక్క ప్రక్కన ఉన్నా తెలుగు నేర్వదలచని ముసల్మాను, ఉర్దూమాట్లాడని హిందువు తమకు తెలియ కుండానే వేర్పాటు భావనను పెంపొందిస్తారు. భాష బలవత్తరమైన సంధాన కర్త అని గుర్తించడం ప్రధాన కర్తవ్యం.

(iii) ఒక మతస్తుల పండుగలను చారిత్రకంగా, సామాజికంగా అర్థంచేసుకోవటం రెండవ మతంవారి విధ్యుక్త ధర్మం. ఒకరి పండుగలను మరియొకరు జరిపించ నక్కరలేదు, పాల్గొన నక్కరలేదు. కాని వాటి ఆంతర్యాన్ని ప్రాముఖ్యతను, విలువను గమనించాల్సి ఉంటుంది,

(iv) ఒకరి కవి సమ్మేళనాలకు మరి యెకరు, ఒకరి ముషాయిరాలకు మరియెకరు అలాగే అన్ని సాంస్కృతిక ప్రదర్శనలకు అందరూ హాజరయి ఆనందించగల అవకాశాలను పెంపొందించు కోవాలి.

(v) నగరాలలో, పట్టణాలలో, పల్లెల్లో క్రీడా స్థలాలు కరువవు తున్నాయి. ఒకటో రెండో ఏ పేటకో ఉన్నా ఒక మతస్తులు ఒకచోట, మరియెక మతస్తులు వేరొకచోట ఆటలు ఆడుతుంటే పరస్పర అవగాహన మృగ్యమవుతుంది, స్నేహావకాశాలు సన్నగిల్లుతయి. గత నలుబది ఏండ్లలో వచ్చిన వేర్పాటు ధోరణిని అధిగమించి మతంతో, రంగుతో, జాతితో, వృత్తితో, హోదాతో నిమిత్తంలేని పద్ధతిలో అందరు యువకులూ ఒకే చోట ఆడి పాడడం అత్యవసరం.

## మౌలిక జీవిత సూత్ర అన్వేషణ

అన్ని మతాలలోను శాశ్వత మానవ విలువలు చోటు చేసుకున్నాయని ఇంతకు పైన ప్రస్తావించాము. సత్యనిష్ఠ, ధర్మనిరతి, దైవభక్తి, తోటి మానవుని యెడ కరుణ సానుభూతి సర్వమతాలకు సామాన్య ధర్మాలు కావా? వివాహం, వైవాహిక జీవితం, పిల్లల సరక్షకత్వం, ఆస్తి సంక్రమణం, వారసత్వం, దత్తత, పిల్లలను పెంచుకోవడం ఇత్యాది అంశాలు సామాజిక జీవితానికి సంబంధించినవి. ఇవి అప్రధానాలు. వీటిని నియంత్రణం చేసుకునే పద్ధతులు వేరు వేరుగా ప్రస్తుతం ఉన్నా, ఆలోచన పెరిగిన కొలదీ, సంఘంలో ఐకమత్య భావనలు వృద్ధి అయ్యే కొలదీ అందరికీ వర్తించే సామాజిక నియంత్రణ సూత్రాలను రూపొందించు కోవడం అసాధ్యంకాదు. ఇది మున్ముందు జరిగేపని, జరగవలసిన కృషి.

మత వ్యవస్థలో క్షీర నీర న్యాయంగా ప్రధానమయిన వాటిని అప్రధానమయిన వాటిని వేరుచేయగల్గటం మంచిది.

## మానసిక వైఖరులలో మార్పులు

ఇపుడు తేలిన విషయాలు.

(i) మతాలలో నిండిఉన్న శాశ్వత మానవ విలువలను వెలికి తీయటం,

(ii) వాటిని ప్రధానాంశాలుగా పరిగణించటం,

(iii) మానవజాతి అంతా ఒకటే అనే భావనను పెంపొందించు కోవటం,

(iv) మానవులంతా సమానులు అనే సూత్రాన్ని అంగీకరించటం,

(v) పూజా విధానంలో, ప్రార్థనా రీతిలో అంటే దేవునికి మానవునికి ఉన్న సంబంధాల విషయంగా విభిన్న ధోరణులను గుర్తించటం,

(vi) అన్నిటికన్న మిన్న పరస్పర సోదర భావాన్ని పెంచుకోవటం,

(vii) సహన మనస్తత్వాన్ని అలవరచుకోవడం,

అన్ని మతాల వారి కర్తవ్యం.

అపుడే మత సామరస్యం వాస్తవ రూపంతాలుస్తుంది.

## మరికొన్ని సూచనలు

మన దేశంలో మనుషులు యే మతంలో వున్నాసరే, ముందు మనుషులుగా ప్రవర్తించగల అవగాహన, సహనం. అభిప్రాయ భేదాన్ని గౌరవించటం చాలా అవసరం. దీనికి గాను అటు ప్రభుత్వమూ, యిటు వ్యక్తులూ చేయవలసిన కనీస కార్యక్రమాలు కొన్ని వున్నాయి.

మసీదు ప్రక్కగా మేళతాళాలతో వూరేగింపు వెడుతుంటే ఆటంక పరచటం, రాళ్ళు విసరటం వంటి చర్యలు ముస్లింలు మానాలి. ముస్లింలు గోమాంస భక్షణ చేయటాన్ని హిందువులు అభ్యంతర పెట్టకూడదు. మత కలహాలు జరిగిన చోట అదుపులో పెట్టలేని పోలీసు అధికారులను వెంటనే ప్రభుత్వం సస్పెండ్ చేయాలి. పోలీస్‌కు ముందుగా తెలియకుండా మరీ యెత్తున కలహాలు జరగటం అసంభవం. కలహాలు జరగనున్నాయని తెలిసి, జరగకుండా ఆపగలిగిన పోలీస్ అధికారులకు ప్రభుత్వం బాగా ప్రోత్సాహం యిచ్చే ఏర్పాట్లు చేయాలి. ఏ మత కలహమైనా సరే, వెంటనే న్యాయ విచారణ జరపాలి. బహిరంగ స్థలాల్లో, వీధి మధ్య మసీదు, దేవాలయం, చర్చి కట్టుకునేందుకు అనుమతి ఇవ్వరాదు. అలాంటివి తొలగించవలసి వస్తే మరొక చోట ప్రభుత్వం అనుమతి ఇవ్వాలి. ఊరి మధ్య, నగరం మధ్య స్మశానాలను (ఏ మత పక్షానికి చెందినవైనా సరే) అనుమతి ఇవ్వకూడదు. మతపరమైన ఉత్సవాలలో ప్రభుత్వ పరంగా అధికారులు, మంత్రులు తమ అధికార హోదాతో పాల్గొనకూడదు. ప్రభుత్వ కార్యాలయాలలో మతపరమైన దేవుళ్ళ ఫోటోలు, వ్రాతలు వుంచకూడదు. ప్రభుత్వ సహాయం పొందుతున్న ఏ సంస్థ అయినా సరే (పాఠశాల, గ్రంథాలయం, రవాణాశాఖ, రేడియో) ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని మత ప్రచారం, మత ప్రార్థనలు చేయకూడదు. సెక్యులరిజం అంటే అన్ని మతాల్ని ప్రోత్సహించటం

కాదు. రాజ్యం ఏ మతం జోలికిపోకుండా వుండటం. కనుక ఆకాశవాణిలో అన్ని మతాల పేరుతో జరుగనున్న ప్రసారాలు ఆపాలి. ఇతర కార్యక్రమాల వలె సందర్భాను సారరగా ప్రసారం చేయవచ్చుగాని, ప్రతి శనివారం వెంకటేశ్వర సుప్రభాతం, ప్రతి ఆదివారం బైబిల్ పఠనం, ప్రతి శుక్రవారం ఖురాన్ పఠనం వంటివి మత ప్రచారం క్రిందకు వస్తాయి. కనుక అవి ఆపాలి. పాఠ్య గ్రంథాలలో మత ప్రచారం, మత వ్యతిరేక ప్రచారం వుండకూడదు. అన్ని మతాలకు సంబంధించిన వారి పిల్లలు వున్న పాఠశాలలో మత బోధ జరిపితే, కొందరిని ప్రోత్సహించి, కొందరిలో జుగుప్స కలిగించిన వారౌతారు. ఇది ప్రధానంగా గమనించ వలసిన అంశం. భారతదేశంలో మత కలహాల విషపూరిత వాతావరణానికి 'సెక్యులరిజమే' విరుగుడు. అది ఆచరణలో పెట్టవలసింది ప్రభుత్వం. అనుసరించ వలసింది మనం.

## మహిళల పాత్ర

ఇంతవరకూ సర్వులూ చేయదగు కార్యాలను, చేపట్టవలసిన కార్యక్రమాలను గురించి ముచ్చటించుకోవడం జరిగింది. కాని మహిళలు ఈ సందర్భంగా ఏమి చేయగలరు? సామరస్యాన్ని ఎలా సాధించగలరు అనేది మరో ప్రశ్న. మహిళ కుటుంబానికి కీలక వ్యక్తి. పిల్లల విద్యా బుద్ధులు, మానసిక వైఖరులు, అలవాట్లు తల్లుల పెంపకంపై ఆధారపడతాయి. మానవ విలువలను గౌరవించే స్త్రీలు, సమతా ధర్మాన్ని పాటించే స్త్రీలు, విద్యావంతులైన వనితలు, సంస్కారులైన మహిళలు సమాజంలో ఎంత ఎక్కువ సంఖ్యలో ఉంటే సమాజం అంతగా పెరుగుతుంది. కుటుంబంలో స్త్రీలు తమ పిల్లలలో మత ప్రాతిపకపై వేర్పాటు భావాలను కల్గించిననాడు పిల్లలు అన్యుల యెడ అసూయా ద్వేషాలతో పెరుగుతారు. వారు పెరిగి పెద్ద అయినా ఆ భావాలను విడనాడలేరు. కనుక మహిళలు తమ వంతు బాధ్యతను తాము నిర్వర్తించాలి.

పై కృషి కొనసాగించాలంటే, ముమ్మందుగా వారు విషయ గ్రహణా శక్తిని, సత్యాన్వేషణా శక్తినీ పెంపొందించుకోవాలి. ఇటీవల స్త్రీ విద్య అన్ని మతాల వారిలో వ్యాప్తి చెందుతున్నది. స్త్రీలు విద్యావంతులౌతున్నారు. కుటుంబాలలో సమాజంలో బాధ్యతాయుత స్థానాలను ఆక్రమించి విధి నిర్వహణ చేస్తున్నారు. తమ శక్తి యుక్తులకు అవకాశాలను అన్వేషిస్తున్నారు; వాటిని ప్రదర్శిస్తున్నారు.

కాలం మారుతున్నది. సమాజంలో స్త్రీలు సగం ఉన్నారు కనుక వారు వారి బాధ్యతను విస్మరించడానికి వీలు లేదు. సమాజాన్ని సంస్కరించటానికి వారు పూను

కోకపోతే సమాజం వారిని అణగ ద్రొక్కి నిష్క్రియా పరులను చేస్తుంది. మత సామరస్య సాధన కృషిలో స్త్రీలు తమ పాత్రను నిర్వహించక తప్పదు. పిల్లలలో సోదర భావాన్ని, సమానత్వ ఆలోచనను, స్వేచ్ఛా పిపాసను, పెంపొందించడం చాలా అవసరం. పొరపాటు ధోరణిని, వైఖరిని ప్రదర్శించే పురుషులను, అవాంఛనీయ ప్రవర్తనను సాగించే పురుషులను సన్మార్గానికి మళ్ళించవలసిన గురుతర బాధ్యత అన్ని మతాలలోని మహిళలదని పదే పదే హెచ్చరించడం అప్రస్తుతం కాదు. మహిళలు ఆ బృహత్తర కృషికి పూనుకుంటారని ఆశించడం విడ్డూరం కాదు.

# పరిసర పరిజ్ఞానం : ప్రబోధం

(కాలుష్య నివారణ : కాంతల బాధ్యత)

ప్రకృతిలో లయఉంది. ఒక క్రమం ఉంది. ఈ ప్రపంచంలో అనేక కోట్ల జీవరాసులు ఉన్నాయి. ఒకజీవి మరో జీవిని చంపి బ్రతకటం చూస్తున్నాం. అయినా ఏ ఒక్క జీవరాసి విపరీతంగా పెరిగి ప్రకృతిని తల్ల క్రిందులు చేయటం లేదు. పర్వతాలు నదులు, సముద్రాలు, సరస్సులు, మేఘాలు, వర్షపాతాలు అన్నీ ఒకదానికి ఒకటి ఒద్దికగా మనుగడ సాగిస్తున్నాయి. ఈ ప్రకృతిలో మానవజాతి ఉద్భవించింది; అందులో పెరుగుతున్నది. ప్రకృతి మానవజాతిని పోషిస్తున్నది. దాని అభివృద్ధికి తోడ్పడుతున్నది. గాలి, వెలుతురు, ఆశ్రయం, ఆహారం, ఆరోగ్యం ఇవన్నీ ప్రకృతి సమకూరుస్తున్నది. కనుక మానవాళి ప్రకృతిని సంరక్షించు కోవలసిన అగత్యం ఎంతైనా ఉన్నది. ప్రకృతిలో అంతర్లీనంగా ఉన్న లయను, క్రమాన్ని చెదరకుండా అట్టే పెట్టుకోవటం అత్యంత అవసరం.

## నాగరికత

నాగరికత పెరుగుతున్నది. యంత్ర యుగం వచ్చింది. ఆవిరి యంత్రాలు, నూనెతో నడిచే యంత్రాలు, విద్యుచ్ఛక్తితో నడపబడే యంత్రాలు ఒన గూడినయి. ఒకనాడు గాలినుండి, సూర్యరశ్మి ఇచ్చేవేడి. నుండి శక్తిని తయారు చేసుకున్నాం. పెట్రోలుతో నడపబడే వాహనాలు వదిలే పొగ, చేసే శబ్దం కాలుష్యాన్ని తయారు చేస్తున్నది. విమానాల రొద కర్ణ కఠోరంగా ఉంటున్నది. బొగ్గుతో నడపబడే రైళ్ళు, లారీలు విపరీతంగా పొగను వాతావరణంలోకి విడుదల చేస్తున్నాయి. లొడు

స్పీకర్లు ధ్వనిని విపరీతంగా పెంచి శబ్ద తీవ్రతను ఎక్కువ చేస్తున్నాయి. మనం పీల్చే గాలి కాలుష్యంతో కూడి వుంటున్నది. మన చెవులు శబ్దాలతో దద్దరిల్లి పోతున్నాయి. మనం నిర్మించుకున్న రసాయనిక పరిశ్రమలు వదిలే ద్రవపదార్థాలు మన కాలువలను, నదులను, ఏరులను, భూగర్భ జలాలను కలుషితం చేస్తున్నాయి. ఆ నీటిని త్రాగిన మనుజులు వ్యాధుల పాలవుతున్నారు; చనిపోతున్నారు. పశు పక్ష్యాదులు రోగాల పాలవు తున్నాయి. ప్రాణాలు విడుస్తున్నాయి. ఇలా జల కాలుష్యం, గాలి కాలుష్యం, శబ్ద కాలు ష్యం మనలను పీల్చి పిప్పి చేస్తున్నాయి.

## కాలుష్య నివారణ

వీటిని నివారించ లేమా? నివారించ గలము. నివారించాలని 1976లో చేసుకున్న రాజ్యాంగ సవరణ ద్వారా ప్రభుత్వాలకు అధికారాలు సంక్రమించాయి; ఆదేశాలు లభించాయి కాని ప్రభుత్వాల అసమర్థతవల్ల, అనాసక్తత వల్ల, కాలుష్య నివారణ బోర్డులు పనిచేయటం లేదు. వాటికి కదలిక లేదు. వాటి మెంబర్లలో చైతన్యం లేదు. కార్యక్రమం నిర్వహించాలనే కోరిక లేదు. అధికారాలు సంతరించు కోవాలని ఆసక్తి లేదు; ఉన్న అధికారాలను ప్రజాసంక్షేమంకోసం వాడాలనే సంకల్పం లేదు. ఈ స్థితిగతులలో ప్రజలు ఇటు ప్రభుత్వాల నిర్లక్ష్యంవల్ల, కాలుష్య నివారణ బోర్డుల అసమర్థతవల్ల అష్టకష్టాల పాలవుతున్నారు.

ఇక సమాజంలో అవినీతి సంగతి చెప్పనక్కరలేదు. రసాయనిక పరిశ్రమలు విడుదల చేసే ద్రవ పదార్థాలను శుద్ధిచేసి బయటికి పంపాలని నియమాలున్నాయి. లక్షలు, కోట్ల రూపాయల విలువజేసే పనిముట్లను, శుద్ధియంత్రాలను కొనుగోలుచేసే దానికన్న ఏటా కొద్దిపాటి లంచాలతో-ఒకటో రెండోలక్షలతో-అధికార్ల నోళ్ళూ కాళ్ళూ చేతులు కట్టి వేయగలమనే ధీమాతో శుద్ధియంత్రాలను పారిశ్రామిక వేత్తలు నెలకొల్పటం లేదు. ప్రభుత్వాలు ధనికుల అండదండలను ఆశించి వారిపై చర్య తీసు కోటం లేదు. లంచాలను మింగి అధికారులు కిమిన్నాస్తి అని ఊర కుంటుంన్నారు.

## ప్రజల చొరవ

చైతన్య వంతులైన ప్రజలు – ఉదాహరణకు హైద్రాబాద్‌లో మలక్‌పేట ప్రాంతంలో ప్రజలు 'శిరీన్' ఔషధ సంస్థపైన వ్యవహారాలు జరిపారు. అలాగే నాచారంలో అలజడి చేశారు. పట్టంచెరువు సంగతి సరేసరి. హర్తాళ్ళు, బంద్‌లు నిర్వహించారు. మీటింగులు పెట్టారు. ఊరేగింపులు లేవ తీశారు. ముఖ్యమంత్రి, గవ

ర్నర్ల వద్దకు ప్రతినిధి వర్గాలను పంపారు; వినతి పత్రాలను సమర్పించారు. కాని ప్రయోజనం శూన్యం. కారణం ప్రజాబలం చాలలేదు. ఒకచిన్న ప్రాంతానికే పరిమిత మయింది. ఇతర ప్రాంతాలను కదిలించ లేక పోయారు వారు. శాసనసభ్యులు చలించ లేదు. సమస్య అపరిష్కృతంగా ఉంది. భూగర్భ జలాలు కూడా కలుషితం కావడంతో పంపుసెట్లు క్రింద సాగుఅయ్యే భూములలో పంట నాశనం అవుతున్నది. బావులలో నీళ్ళు త్రాగిన పశువులు చచ్చిపోతున్నాయి. ఇదంతా కేవలం స్వార్థంతో సంచరించే పరిశ్రమాధి పతుల దుశ్చర్యల ఫలితం.

## ప్రభుత్వ చర్యలు

ప్రభుత్వం ప్రత్యక్షంగా కాలుష్యాన్ని పెంచే సంఘటనలు లేక పోలేదు. నగరాలు పెరుగుతున్నాయి. వాటితోని మురుగు నీటిని శుద్ధి చేయకుండా నదులలోకి వాగులలోకి వదులు తున్నాయి మురుగునీటి బోర్డులు. గంగాజలం పరి శుభ్రమని తలచేవారు. కాని దానిలోకి సగం కాలిన శవాలను కాశీలో తోయడం జరుగుతున్నది. నదిఒడ్డున ఉన్న నగరాల మురికినీరు నదిలోకి విడుదల చేయబడు తున్నది. ఫలితం ఒకటే. నదీజలం కలుషితమై పోయింది, దానినిండా విషక్రిములు కీటకాదులు చోటుచేసు కున్నాయి. ఇపుడు వేలకోట్ల ఖర్చుతో, ఇతర దేశాల ధన సహా యంలో నదీ జలాలను వెయ్యిమైళ్ళ పొడవున శుద్ధి చేయాలనే కార్యక్రమాన్ని రూపొం దించింది కేంద్ర ప్రభుత్వం. కాని నీటిని కలుషితం చేసే పద్ధతులను విడనాడలేదు. వాటి మానాన అవి కొనసాగుతున్నాయి ఇంకా ఇలా ప్రభుత్వ శాఖలు సమన్వయ రహి తంగా పని చేస్తున్నాయి. ఏడుగురు కోడండ్లవలె ఎవరి విధిని వారు నిర్వరిస్తున్నారు. మురుగునీటిని నదిలోకి వదిలే అధికార సంఘాలు బోర్డులు అపని చేస్తున్నాయి. కాలుష్య నివారణకు మరో శాఖ పని చేస్తున్నది. రెండవ శాఖ మొదటి శాఖను నియం త్రణం చేయగల స్థితిలో లేదు. ఫలిత శూన్యం. యథాతథ పరిస్థితి కొనసాగుతున్నది. కాలుష్యం పెరుగుతున్నది కాని తరగటం లేదు. కాగా పెరిగిన శాఖలవల్ల వ్యయం పెరుగుతున్నది. ప్రజలపై పన్నులు వృద్ధిఅవుతున్నాయి. ప్రజలు పన్నుల భారంతో క్రుంగిపోతున్నారు. పరిస్తితిలో ఏమార్పు లేదు. కాగా కంఠశోషతో ఉపన్యాసాలు మాత్రం వినిపిస్తాయి.

## అణుశక్తి ఉత్పాదన

ఇటీవల క్రొత్త ప్రమాదం ఉత్పన్నమయింది. ఆవిరితో, నూనెతో, జల ప్రవాహ శక్తితో విద్యుచ్ఛక్తిని తయారు చేసుకున్నాం. ఆ ఉత్పాదక శక్తి జాతి అవసరాలకు చాలటం లేదని, దానిని పెంచాలని అణువిచ్ఛిత్తి చేసి విద్యుచ్ఛక్తి ఉత్పాదనకు పూనుకున్నది ప్రభుత్వం. ఉద్దేశము మంచిదే కావచ్చుకాని సాధనం కూడా సరియైనది, మంచిది కావాలి కదా! రాజస్థాన్‌లో కోటాలో, బొంబాయి వద్ద ట్రాంబేలో, మద్రాసు వద్ద కల్పకంలో అణువులను బ్రద్దలుకొట్టి విద్యుచ్ఛక్తిని తయారు చేస్తున్నాం. అమెరికా, బ్రిటను, కెనడా, ఫ్రాన్సు, రష్యా, ఇజ్రాయిలు, చైనాలలో ఈ పద్ధతినివాడి అణ్వస్త్రాలను తయారు చేస్తున్నాయి ఆయా దేశ ప్రభుత్వాలు. 1945లో హిరోషిమా, నగసాకి నగరాలపై వేసిన అణుబాంబు కన్న ఈనాడు తయారయ్యే హైడ్రోజను బాంబు వెయ్యి రెట్లు శక్తివంతమైనది. ఆనాడు ఆ బాంబు ప్రయోగం వల్ల 60 వేల మంది చనిపోతే, ఆ ప్రాంతాలలో చెట్లు చేపలు నశిస్తే, జీవరాసులు అంతరించిపోతే దూరాన ఉన్నవారు బాంబు విడుదల చేసిన రేడియో ధార్మికశక్తిమూలాన వికలాంగులు అయినారు. గర్భిణీ స్త్రీల గర్భాశయాలలో ఉన్న పిండాలు మార్పులకు లోనయినవి. పుట్టిన బిడ్డలు విపరీతమైన అంగాంగాలతో వికృత రూపాలతో పుట్టారు. ఈ ఘోరాన్ని తిలకించిన ప్రపంచ ప్రజానీకం గుణపాఠాన్ని నేర్చుకోలేదు. మరిన్ని రెట్లు శక్తివంతమైన హైడ్రోజను బాంబులను తయారు చేస్తున్నాయి అగ్రరాజ్యాలు. అణు యుద్ధం వస్తే ప్రపంచంలో మానవజాతి మనజాలదని తేలింది. రష్యాలోని నగరాలను 40 సార్లు ధ్వంసంచేయగల శక్తి అమెరికాకు, (ఒకసారి చేస్తేనే పూర్తి విధ్వంసం జరుగుతుంది) అమెరికాలోని నగరాలను 20 సార్లు ధ్వంసం చేయగల శక్తి రష్యాకు ఉన్నాయట. ఇంతటితో చాలక అంతరిక్షంలో యుద్ధాలు సాగించటానికి అమెరికా అధ్యక్షుడు రీగన్ వ్యూహాలు నిర్మిస్తున్నాడు. "నక్షత్ర యుద్ధాలకు" సమాయత్తం అవుతున్నాడు. అంతరిక్షంలో యుద్ధాలు వస్తే ఈ ప్రపంచం దానితో బాటు ఈనాటి మానవ నాగరికత ధ్వంసం అయిపోతుంది. (అమెరికా రష్యాల ఒడంబడిక రాకముందు ఈ వ్యాసం వ్రాయబడింది).

## అణువిద్యుచ్ఛక్తి ఉత్పాదన ప్రమాదరహితమా?

అణ్వాయుధాల వల్ల ప్రమాదమున్నది కాని అణుశక్తి ఉత్పాదన వల్ల నష్టం లేదని కొందరు శాస్త్రజ్ఞులు, ప్రమాదం తక్కువ స్థాయిలో ఉంటుందని మరికొందరు

వ్యాసాలు రాస్తున్నారు; ఉపన్యాసాలిస్తున్నారు. వీరంతా ప్రభుత్వ పరిశోధనా గారాల్లో, కర్మాగారాల్లో పనిచేసే శాస్త్రజ్ఞులేనని విస్మరించరాదు.

ప్రమాదం 3 రకాలుగా ముంచుకొస్తున్నది. అణు కర్మాగారాలు ప్రబద్దలయితే విడుదల అయ్యే రేడియో ధార్మిక శక్తి వల్ల కలిగేది మొదటిది. అమెరికాలో లాంగ్ ఐలండులో, రష్యాలో "చెరన్‌బిల్"లో జరిగిన సంఘటనలు ఇందుకు ఉదాహరణలుగా పేర్కొనవచ్చును. ఆహారపదార్థాలు కలుషిత మవుతాయి. జలం మలిన మవుతుంది. జలచరాలు ముఖ్యంగా చేపలు చనిపోతాయి. వాటిని తిన్న మనుష్యులు రుగ్మతల పాలవు తారు. మనుషులకు చర్మవ్యాధులు వస్తాయి. జననాల సందర్భంగా వైపరీత్యాలు సంభ విస్తాయి. దగ్గరలో వున్నవారు చనిపోతారు. ఇవన్నీ మునుపు సంభవించినాయి. ఉదా హరణకు మనం ఐర్లండు నుంచి వెన్నను దిగుమతి చేసుకున్నాం కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి. అది రేడియో ధార్మిక శక్తివల్ల కలుషిత మయిందని తెలుసుకొని దానిని ధ్వంసం చేసుకోవాల్సి వచ్చింది. రష్యాలో జరిగిన ప్రమాదం 1500 మైళ్ళ దూరం వరకు దాని ప్రభావం చూపింది. అంటే ఆ ఒక్కదేశమే కాదు, చుట్టుప్రక్కల దేశాలే కాదు, ఖండాలు దెబ్బతింటాయి. గాలి వీచిన వాలును బట్టి దేశదేశాలు రేడియో ధార్మిక శక్తికి తల ఒగ్గాల్సి వచ్చింది. ఇది ప్రమాదం కాదని ఎవరు అనగలరు? అగ్రరాజ్యాలు తయారు చేసే యంత్రాలే విఫలమవుతుంటే భారత ప్రభుత్వం తయారు చేసే యంత్రాల పరిస్థితి వేరే చెప్పనక్కరలేదు.

కొన్ని అణుశక్తి ఉత్పాదన కేంద్రాలలో ఉత్పత్తి అయ్యే అధిక ఉష్ణోగ్రతను తగ్గించడానికి లక్షల గాలన్ల చల్లని నీటిని పాడతారు. ఆ యంత్రాంగం దెబ్బతింటే ఆ ఉష్ణోగ్రత విడుదల అవుతుంది. దానిని తట్టుకోవడం కష్టం. ఇది రెండవ ప్రమాదం.

మూడవది. రేడియో ధార్మిక శక్తితో కూడిన అక్కరలేని పదార్థాల విసర్జన. ఒక అణు ఉత్పాదన కేంద్రం 25 సంవత్సరాల తర్వాత పనిచేయదు. అపుడు దానిని వదిలివేయాలి. కాని దానినుండి రేడియో ధార్మిక శక్తితో కూడిన చెత్తచెదారం (waste) ఉంటుంది. దీనిని వదిలించుకోవట కష్టం. భూగర్భంలోనో, సముద్ర గర్భంలోనో దీన్ని పాతెయ్యాలని ఆలోచన. అంతరిక్షంలో ఎగ జిమ్మాలని మరో అభిప్రాయం. ఏదైనా ఈ ప్రక్రియ సరిగ్గా జరగక పోతే ప్రమాదం. ఈ విసర్జింప వలసిన పదార్థం వెయ్యి సంవత్సరాల వరకు రేడియో ధార్మిక శక్తిని కలిగి ఉంటుంది. అది తేలికగా ఛావదు. అంటే ఈ అణు ఉత్పాదన కార్యక్రమంలో ఉద్భవించిన ఈ 'వేస్టు' పీడ

తయి కూర్చుంటుంది. పెనుభూతాన్ని సృష్టిచేసుకొని దానిని వదిలించుకోవటానికి ఎంతో శ్రమించ వలసి ఉంటుంది. ఇది శక్తికి మించిన పని. ప్రమాద కారణం.

## ధనవ్యయం

పై మూడు ప్రమాదాలే కాక మరో ఇబ్బంది కూడా ఉంది. అది ధన వ్యయానికి సంబంధించింది. రాజస్థాన్‌లో నిర్మించిన అణుశక్తి కేంద్రం (RAJASTHAN ATOMIC Power Station I) చెడిపోయినట్లు ప్రభుత్వం ప్రకటించింది. కేంద్రం పని ప్రారంభించిన రెండేళ్ళకే లోపం ఉందని గ్రహించారట. మరమత్తుచేశారట. కాని మరల బీటలు వారిందట. ఇదంతా 5 ఏళ్ళు పట్టింది. ఇపుడు యంత్రం పనికి రాదన్నారు. ధానిని పనిచేయిస్తే ప్రమాదమన్నారు. రేడియో వేస్టును సమాధి చేయాలంటే కోట్ల రూపాయలు ఖర్చు అవుతాయి. అదీగాక దానికి అవసరమయిన శాస్త్రీయ పరిజ్ఞానం మనకున్నట్లు తోచదు. ఇదంతా చూస్తుంటే నవ్వు వస్తుంది. బాధా కలుగుతుంది. పాటగాణ్ణి పావలా ఇచ్చి పాడించుకొని కర్ణ కఠోరంగా సంగీతం పేరుతో శబ్దం చేస్తుంటే భరించ లేక అర్ధరూపాయి ఇచ్చి ఆపించుకున్నట్లుంది మన దేశ స్థితి. ఇంత ధనవ్యయాన్ని దేశం భరించలేదని వేరే చెప్పనక్కరలేదు. ఈ వేస్టును పూడ్చి పెట్టడానికి అయ్యేఖర్చును తట్టుకోడానికి అణుశక్తి ఉత్పాదన కేంద్రం తయారుచేసే విద్యుచ్ఛక్తిపై పన్ను వేయడానికి అధికారం ఇస్తూ ఇటీవల నెల క్రిందట పార్లమెంటు శాసనాన్ని ఆమోదించింది· దాంతో ఆ కర్మాగారం తయారుచేసే విద్యుచ్ఛక్తి యూనిట్ రేటు మామూలు కన్నా ఎక్కువ అవుతుంది. ఇలాచేయటం భావ్యమేనా?

## ఆంధ్రప్రదేశ్

ఇటీవల అణువిద్యుత్ కేంద్రాల పట్ల మోజు పెరుగుతున్నది. వీటిని ప్రతిష్ఠాకరమైన పరిశ్రమలుగా భావించి ప్రతి రాష్ట్ర ప్రభుత్వమూ ఇలాంటి కేంద్రాన్ని తమ రాష్ట్రంలో నెలకొల్పాలని కోరుతున్నది. అలాగే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నాగార్జున సాగర్‌వద్ద అణువిద్యుత్ కేంద్రాన్ని నెలకొల్పమని కేంద్రాన్ని అభ్యర్థించింది. ఇది తెలిసీ తెలియని కోరిక. అలాంటి కేంద్రాన్ని యూనియను ప్రభుత్వం నిర్మిస్తే అది బ్రద్దలయితే నాగార్జున 'డాము' దెబ్బతింటుంది. రిజర్వాయరులో నీరు పొంగి పొరలుతుంది. విజయవాడ వరకు కృష్ణానదికి ఇరువైపుల ఉన్న గ్రామాలు జలమయం అవుతాయి. విజయవాడ మునిగిపోతుంది. లక్షల ఎకరాల పంట నష్టం అవుతుంది. కరువు కాట

కాలు విజృంభిస్తాయి. అడుసు త్రొక్కనేల కాలు కడగనేల? ఎంత త్వరగా ఈ అణుశక్తి ఉత్పాదన ప్రయత్నాన్ని విరమించుకొంటే అంత మంచిది.

మానవ మనుగడకు ప్రాధాన్యత ఇవ్వాలి. బ్రతికి ఉంటే బలుసాకు తినవచ్చు. చచ్చి సాధించేదిలేదు. మానవ మనుగడ దృష్ట్యా ప్రత్యామ్నాయశక్తి ఉత్పాదనా కార్యక్రమాలను రూపొందించుకోవాలి. గాలి, సూర్యరశ్మి, పశువుల పేడ ఇందుకు ఉపకరిస్తాయి. వీటి ద్వారా కూడా విద్యుచ్ఛక్తిని తయారు చేసుకోవచ్చు, అణువిద్యుత్ కర్మాగారాలు కాలుష్యాన్ని పెంచుతాయి కదా! వాటిని అరికట్టాలి.

## జాగృతి

అన్ని రకాల కాలుష్య నివారణకు ప్రయత్నించటం అవసరం.

కాలుష్యం ఎలా సంభవిస్తుందో, ఎలా వ్యాపిస్తుందో తెలుసుకోవాలి. ముమ్ముందుగా తెలుసుకున్నవారు తదితరులకు తెలియజెప్పాలి. భారీ ఎత్తున ప్రబోధ కార్యక్రమం సాగాలి. గోష్టులు, చర్చా వేదికలు, సభలు, సమావేశాలు ఈ అంశంపై నిర్వహించాలి. జానపదులకు అందుబాటులో ఉండే బుర్రకథలు, నాటకాలు, సినిమాలు, తోలుబొమ్మలాటలు వీటి అన్నింటి ద్వారా కాలుష్య ప్రమాదాన్ని గురించి హెచ్చరించాలి.

## మహిళల బాధ్యత

పిల్లలను కనేది స్త్రీలు. రేడియో ధార్మిక శక్తి సోకినందువల్ల గర్భంలో ఉన్న పిండాలు అపాయానికి లోనయి పిల్లలు వికలాంగులుగా, వికృత రూపాలుగా పుట్టే వారిని చూస్తూ పెంచలేక, చేతులార చంపలేక బాధపడేది స్త్రీలు. పంటలు పోయి ఆహారపు పంటలు నశిస్తే, కరువు కాటకాలు సంభవిస్తే కుటుంబాలలో అందరికీ అన్నం పెట్టి చివరకుభోజనం చేసే—ఏమన్నా మిగిలితే—మాతృమూర్తి కాక మరెవ్వరు బాధపడతారు? దారిద్ర్యంతో క్రుంగిపోయే కుటుంబాలలో స్త్రీల బాధలు వర్ణనాతీతం. కనుక కాంతలు ఈ సందర్భంగా జాగృతం కావాలి. వారు విషయాలు తెలుసుకొని పురుష శాస్త్రజ్ఞులు ప్రకృతితో ఆడే చెలగాటాలను ఆపాలి. ప్రభుత్వాలను నిద్ర లేపాలి; వాటిపై ఒత్తిడి తెచ్చి అన్ని రకాల కాలుష్యాన్ని పారద్రోలాల్సిన బాధ్యత స్త్రీలది. మహిళలు ఇందుకు పూనుకుంటారని ఆశించటంలో ఆశ్చర్యం లేదు.

# మహిళలు-మారణ యుద్ధాలు

ఈ సంవత్సరం కేంద్రప్రభుత్వం రక్షణ వ్యయాన్ని 2 వేలకోట్ల పైచిలుకు పెంచింది. 'పాకిస్తాను ప్రమాదాన్ని తట్టుకుంటాము' అని పత్రిక చూస్తున్న పదహారేళ్ళ కుర్రాడు పెనుకేక పెట్టాడు. పడక కుర్చీలో కూర్చొని రేడియో వింటున్న తాతయ్య కేకవిని తడబడ్డాడు. తేరుకొని, 'పాకిస్తాన్‌కు బుద్ధి చెప్పాల్సిందే' అని మనుమడిని సమర్థించాడు. వంటచేసుకుంటూ రేడియో వింటున్న శారదమ్మ ఉలిక్కి పడింది. ఇంకా ఇన్నివేల కోట్లు ఖర్చుపెట్టి తయారు కావడం యుద్ధం కోసమేగా అని అనుకొన్నది. పాకిస్తానుతో ఇరవయ్యేండ్లనాడు వచ్చిన యుద్ధంలో పోగొట్టుకున్న తన పెద్ద కొడుకు వెంకట్రావు స్మృతి పథంలో మెదిలాడు. ఈసారి యద్ధంవస్తే అణుబాంబులు వేసుకుంటారట. బాంబు పడ్డచోట పచ్చిమొక్క కూడ మిగలదట. జీవం కల క్రిమికీటకాదులు కూడా బ్రతకవట, గర్భిణీస్త్రీలు వికలాంగులను ప్రసవిస్తారట. పొరపాటున బ్రతికి బయట పడ్డవారు తీవ్ర వ్యాధులకు లోనవుతారట. ఈ మాటలు తనూ విన్నది శారదమ్మ. అమెరికా వద్దనున్న బాంబులు రష్యామీద వేస్తే రష్యాలోని 20 కోట్ల జనాన్ని నలుబది సార్లు హతమార్చ వచ్చట. అలాగే రష్యా దగ్గరనున్న బాంబులు అమెరికాపై వేస్తే అమెరికా ప్రజలను ఇరువదిసార్లు చావకొట్ట వచ్చట. ఒకసారి దాడిలో సగంపైగా జనం హతమారి పోతారట. ఇరవైసార్లు దాడిచెయ్యటం ఎందుకు? అంటే అంతశక్తి ఉందని చెప్పటం అన్నమాట! ఇదంతా తలచుకుంటే శారదమ్మకు వణకు పుట్టింది. ఎందుకు ఈ యుద్ధాలు? యుద్ధాలలో చంపుకోడానికేనా పిల్లలను కనేది? ఇదేనా దేశభక్తి అంటే? యుద్ధంచేసే ఇరుపక్షాలూ దేశభక్తిని గురించే మాట్లాడుతాయే! మరెవరి దేశభక్తి గెలవాలి? మనుష్యుల్ని చంపుకొని సాధించేదేముంది? ఇంతకూ కూడుగుడ్డా పెట్టలేని ప్రభుత్వానికి 'దేశంకోసం మీరు చావండి' అని ప్రజలను అడగటానికి ఏమి హక్కు ఉంది? ఈ దేశంలో పాతికసెంట్ల భూమికి, ఇరవయి గజాల స్థలానికి, రూపాయి ఆదాకు, అక్షరాల చదువుకు, వైద్యానికీ, చివరికి మంచినీటికీ నోచుకోని గర్భదరిద్రుణ్ణి దేశంకోసం ప్రాణాలు యిమ్మని హితబోధ చెయ్యటం ఏమి సబబు? "దేశం అంటే మట్టికాదోయ్, దేశంఅంటే మనుష్యులోయ్" అని ఎలుగెత్తి చాటిన గురజాడ సూక్తులు పాలకులకు జ్ఞాపకం రావా? ఈ ప్రశ్నలు ఆమె బుర్రలో గిర్రున తిరిగాయి. నవమాసాలు మోసి కనిపెంచిన ఏ మహిళా మారణయుద్ధాన్ని ఆమోదించలేదని ఆమెకు స్ఫురించింది.

క్లబ్బుల్లో ఖాతాఖాని పూర్తిచేసుకుని తీరికగా ఇంటికి చేరుకున్న భర్తకు శారదమ్మ తన భావాలను ఎఱుక పరిచింది. స్త్రీలకు అధికారం ఇస్తే యద్ధాలు రావని గట్టిగా చెప్పింది. ఆర్జంటైనా పైన యుద్ధం చేసిన బ్రిటిషు ప్రధానమంత్రి మార్గరేట్ థాచర్ అరబ్బుదేశాలతో యుద్ధాన్ని సాగించిన ఇజ్రాయిల్ ప్రధానమంత్రి గోల్డా మియర్, ఆనాటి తూర్పు పాకిస్తాన్‌పై సైన్యాలను నడిపిన భారత ప్రధానమంత్రి ఇందిరమ్మ స్త్రీలు కారా అని భర్త అధిక్షేపణ చేశాడు. శారదమ్మ మనస్సు గందరగోళంలో పడింది. వస్తుతః ఆమె తెలివి కలది. తేరుకుంది. "చూడండి వారు స్త్రీలయినా పురుషాధిక్య సమాజానికి నాయకులు. పురుషుల పెత్తనంలో పురుషుల బలంతో అండదండలతో అందలం ఎక్కిన అతివలు. వారే స్త్రీల బలంతో అధికారంలోకి వస్తే అలా చేసి ఉండేవారు కాదు." అన్నది ఆమె సునిశిత తర్కానికి భర్త అప్రతిభుడయినాడు. అతనికి నోటమాట పెగలలేదు.

మానవజాతిలో స్త్రీ పురుషులు రెండు తెగలు. ఒకరి సాహచర్యం మరొకరికి కావాలి. ఒకరి సన్నిహితత్వాన్ని మరియెకరు అభిలషిస్తారు. వారి కలయిక మానవజాతి నశింపు కాకుండా చేస్తున్నది. అయితే సంతాన సముపార్జనలో స్త్రీది ఎక్కువపాత్ర. నవమాసాలు శిశువులను మోసేది స్త్రీ. తనరక్తాన్ని, బలాన్ని శిశువుకు ధారపోసేది స్త్రీ. కనుకనే సంతానం యెడల ఆమెకు అంత వాత్సల్యం. అందుకే సంతాన నాశనాన్ని ఆమె ఆశించ లేదు. వస్తుతః ఆమె శాంతి కాముకురాలు. ఆమె ప్రాణరక్షణ చేస్తుందికాని ప్రాణనాశనాన్ని కోరదు. మహిళా మనస్తత్వాన్ని సరిగా అవగాహన చేసుకోలేని 'పెద్దలు' ఆమెను దుర్బల మనస్త్వ అని నిందింస్తారు. స్త్రీ ఎప్పుడూ యుద్ధాన్ని కోరదు; వినాశాన్ని కాంక్షించదు స్త్రీలు జాగృతి పొంది చైతన్యంతో వ్యవహరిస్తేవారు యుద్ధాలకు మురిసిపోరు. యుద్ధయత్నాలను వారు బలపరచరు. యుద్ధసన్నద్ధతను వారు ఆమోదించరు. ఆయధాల పోటీ అంతం కావాలంటారు. వేలు, లక్షల పరిమాణంలో అయుధాల ఉత్పత్తికి డబ్బును కేటాయించడం వారు వ్యతిరేకిస్తారు. అణుబాంబు తయారీ వద్దని ఎలుగెత్తి చాటతారు.

పురుషులంతా యుద్ధానికి అనుకూలురని చెప్పడం నా ఉద్దేశ్యం కాదు. కాగా వారి సంస్కృతిని బట్టి కొందరు పురుషులు శాంతి కాముకులు కావచ్చును. కాగా తమ శరీర ధర్మాన్ని బట్ట మానవజాతి కొనసాగింపుకు బాధ్యత వహిస్తుండడం వలన స్త్రీలు ప్రాయికంగా శాంతిని గాఢంగా కోరతారని చెప్పడమే నా ప్రయత్నం.

భారతదేశంలో స్త్రీలలో అక్షరాస్యత 30 శాతాన్ని మించనపుడు, కొన్ని వెనుక బడిన ప్రాంతాలలో 5 శాతం మాత్రమే అయినప్పుడు, వారు ఇళ్ళల్లో బందీలయి నప్పుడు, విద్యావంతులైన స్త్రీలు సయితం సామాజిక పరిస్థితులవల్ల అస్వతంత్రులుగా ఉన్నప్పుడు, ఉద్యోగినులయిన స్త్రీలుకూడా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు దూరమయి నపుడు, అయిదు వందల పైచిలుకు సభ్యులున్న పార్లమెంటులో అతివలు అయిదుశాతం కూడా లేనప్పుడు, పెట్టుబడిదారీ వ్యవస్థ కొనసాగుతూ లాభాలకోసం ఉత్పత్తి సాగు తున్నప్పుడు, దేశంలో సగంఆస్తి భారత జనాభాలో సగభాగం పదిశాతం వారిచేతుల్లో ఉన్నపుడు; స్వప్రయోజనపరులు యుద్ధయత్నాలు చేయటంలో ఆశ్చర్యం లేదు. ఏ మేరకు మహిళలు చైతన్య వంతులవుతారో ఆమేరకు యుద్ధప్రమాదం తగ్గుతుంది. కనుక ఈనాడు స్త్రీల విద్యవిజ్ఞాన వికాసాల మీదనే శాంతిస్థాపన ఆధారపడి వుందనేది నగ్నసత్యం.

# బిడ్డల్ని కనేది చంపుకునేందుకా ?

అణ్వాయుధ మారణ హోమంలో అబలల ఆర్తనాదం కాస్త వింటారా? మా గర్భ శోకం మీకు అర్థం కాదు. అసలు మేము బిడ్డల్ని కనేది చంపుకోడానికా? మాకు మాతృ హృదయముంది. ఇకముందు మేము సంతానాన్ని కనే ఫ్యాక్టరీలుగా జీవించ లేము. మమ్మల్ని అర్థం చేసుకుంటే సరేసరి. లేకుంటే శాంతియుత సమాజ స్థాపన జరగనిదే మేము అసలు పిల్లలినే కనం. మేము పెళ్ళాడేది వైధవ్యం కోసం కాదు. అణ్వాయుధ నిర్మూలనం జరిగేదాకా మేము అసలు పెళ్ళే చేసుకోము. అంతేకాదు శాంతి స్థాపన కొరకు మేము తిరగబడపోతున్నాం. మా ప్రాణాలొడ్డి పోరాడపోతున్నాం. అంటూ వీరోచితంగా ఈనాటి స్త్రీ జాతి ఎలిగెత్తి అరుస్తోంది. కారణం, యుద్ధం వస్తే పిల్లల్ని పోగొట్టుకునేది తల్లులు, భర్తలను పోగొట్టుకునేది భార్యలు. అణ్వాయుధ ప్రయో గాల వల్ల అంగవికలులను కనేది అమ్మలు. యుద్ధ ప్రమాదంలో అంగవికలులైన భర్తలను, బిడ్డలను చూచి సర్వనాశన మయ్యేది మహిళలు. మరి మీరు దీన్ని కాదన గలరా?

42 సం॥నాడు అమెరికా వారు ఆగస్టు ఆరున జపాన్ నగరమైన హిరోషియా మీద అణుబాంబు వేశారు. 50 వేల మంది చనిపోయారు. అనేక వేల మంది గాయ పడ్డారు. బాంబు పేలుడు వల్ల వచ్చిన రేడియో ధార్మిక శక్తి వల్ల అనేకమంది గర్భిణీ

స్త్రీలు కుంటి, గ్రుడ్డి, కురూపులైన బిడ్డల్ని కన్నారు. అనేక వ్యాధులకు లోనయ్యారు. నాటినుండి నేటివరకు బాంబులు వేయటం తప్పని కొందరూ, ఒప్పని కొందరూ వాదిస్తూనే వున్నారు. రష్యా, అమెరికా, బ్రిటన్, కెనడా, చైనా దేశాలు ఈనాడు అణుబాంబును కలిగి వున్నాయి. దక్షిణాఫ్రికా, ఇజ్రాయిలు, పాకిస్తాన్ ఏ క్షణాన్నయినా బాంబును పేల్చగల స్థితిలో ఉన్నాయి. భారతదేశం 5, 6 నెలలలో బాంబును తయారు చేయగల సాధన సంపత్తిని కలిగి వుంది. ఎప్పుడు అణుయుద్ధం వస్తుందోనని ప్రపంచ ప్రజలు తల్లడిల్లి పోతున్నారు. రష్యా, అమెరికాలకు మాత్రమే యాభై వేల అణు ఆయుధాలు వున్నాయి. రష్యాలోని పట్టణాలన్నింటిని నలభైసార్లు సమూలంగా ధ్వంసం చేయగల శక్తి అమెరికాకు వున్నది. అలాగే అమెరికా లోని నగరాలన్నింటిని ఇరవైసార్లు తుక్కు తుక్కుగా నాశనం చేయగల శక్తి రష్యాకు వుంది. నిజానికి ఒకసారి నాశనం చేస్తేనే ఆ నగరాల్లో చెట్టూ చేమా, పురుగూ పుట్రా, మనిషీ, జంతువూ-ఏమీ మిగలవు. అంత గొప్ప శక్తి అని చెప్పటానికి ఇలా చెప్పటం జరిగింది. ఈ బాంబులను మోసుకుని వచ్చే ఖండాంతర వేధులను ఆపడానికి ఇరువర్గాలు జాగ్రత్త పడుతున్నాయి. అమెరికా వారి మిసైల్స్‌ను రష్యావారి ఉపగ్రహం అంతరిక్షంలో పసిగట్టి భూమి మీదికి వర్తమానం పంపుతుంది. వెంటనే రష్యావారి విమానాలు బయలుదేరి వాటిని ధ్వంసం చేస్తాయి. ఇదంతా మూడు నిమిషాల్లో యంత్రాల సాయంతో జరిగిపోతుంది. అందువల్ల అమెరికావారు రష్యావారి ఉపగ్రహాన్ని నాశనం చెయ్యాలని ప్రయత్నిస్తున్నారు. దానికి నక్షత్ర యుద్ధమని పేరు పెట్టారు. దీంతో గ్రహాల మధ్య వుండే అంతరిక్షం కూడా సంక్షోభితమవుతుంది. ప్రపంచం ప్రమాదంలో పడిపోతుంది. ఈ సంగతి తెలిసే అణ్వాయుధాలను వాడకుండా కేవలం బెదిరింపులతో రెండు అగ్రరాజ్యాలయిన రష్యా, అమెరికాలు కాలక్షేపం చేస్తున్నాయి. దీర్ఘకాలంగా యుద్ధ నివారణ గురించి సంప్రదింపులు సాగిస్తున్నాయి.

ఒక్క విషయం మరచి పోరాదు. అణుబాంబు కన్నా హైడ్రోజన్ బాంబు వంద రెట్లు శక్తివంతమైనది. ఈనాడు అగ్రరాజ్యాల చేతిలోవున్న బాంబు ఒక్కొక్కటి వంద హైడ్రోజను బాంబులతో సమానం. ఒక బాంబు వేస్తే ఏడు చదరపు కిలోమీటర్ల కల దేశం స్మశానం అయిపోతుంది. అంటే మనం కట్టుకున్న ఇళ్ళు, నిర్మించుకున్న వంతెనలు, వేసుకున్న రైలు మార్గాలు, ఏర్పరచుకున్న తంతితపాలా సౌకర్యాలు, పాఠశాలలు, కళాశాలలు, హాస్పిటళ్ళు, పరిశ్రమలు, క్రీడాస్థానాలు-అన్నీ మటుమాయమవుతాయి. మనిషి కనపడడు. పక్షీ జంతువూ, క్రిమికీటకాదులు అదృశ్యమవుతాయి. ఆ

పరిస్థితిని ఊహించుకోవటానికే భయకంపితుల మవుతున్నాం. కాని వాస్తవ రూపం దాల్చగల వ్యూహ అది.

సాంకేతికాభివృద్ధిని మారణాయుధాల ఉత్పత్తికి వినియోగించటం అమానుషం. 1960లో ప్రపంచం 22 వేల కోట్ల డాలర్ల ఖర్చుతో అణ్వాయుధాలను తయారుచేస్తే 1980 నాటికి 45 వేల కోట్లు వెచ్చిస్తున్నారు. నిమిషానికి పది లక్షల డాలర్లు వెచ్చిస్తున్నారని ఈ దశాబ్దం నాటికి ఇది రెట్టింపు అవుతుందని కామన్‌వెల్తు కార్యదర్శి చెప్పారు. మిలిటరీ వ్యయంలో మూడు వంతులు అభివృద్ధి చెందిన దేశాలు ఖర్చు చేస్తున్నాయని, ఇటీవల ఐదుగు దేశాలు కూడ తలకుమించి ఖర్చు చేస్తున్నాయని, ఇలా అయితే నూరు దేశాలు ఆ స్థాయికి చేరుకోగలవనీ, ఆనాటికి 60 శాతం మాత్రమే జీవించ గలరనీ అంచనాలొచ్చాయి. ఈనాడు తిండికీ, బట్టకూ నోచుకోని ప్రజలకు తలకొక 110 డాలర్లను వెచ్చించటం అమానుషం కాదంటారా?

రష్యా, అమెరికా బుద్ధి కలిగి అణు యుద్ధానికి దిగక పోయినా, అణు బాంబు తయారు చేయగల చిన్న రాజ్యాలు విధ్వంసానికి పూనుకోవని గ్యారంటీ లేదు. అణు బాంబును తయారు చేయటం చాలా తేలిక అయింది. బహుశః రాబోయే దశాబ్దంలో అవి ఉగ్రవాదుల చేతుల్లోకి కూడ రావచ్చు. ఉగ్రవాదులందరూ ప్రజల జీవితాలతో చెలగాట మాడరని ఎలా భావించ గలం?

ఆగస్టు ఆరున ప్రపంచ ప్రజలు అనేక దేశాల్లో హిరోషిమా దినోత్సవాన్ని చేసుకున్నారు. అణు బాంబు ప్రమాదాన్ని గుర్తుకు తెచ్చుకున్నారు. అణ్వాయుధాలను నిరశించారు. వాటి తయారీని ఆపమన్నారు. అగ్రరాజ్యాల స్పర్థలు మానుకోమన్నారు. గిడ్డంగుల్లో ఉన్న అణ్వాయుధాలను నాశనం చేయమన్నారు. ఇలా ప్రపంచ ప్రజలు తమ శాంతి కాముకత్వాన్ని వెల్లడించారు.

స్త్రీలు సహజంగా శాంతికాముకులు. తమ భర్తలను, పిల్లలను, తల్లిదండ్రులను, అన్నతమ్ములను యుద్ధంలో చంపుకోవటానికి వారు ఇచ్చగించరు. తన బిడ్డ చావును ఏ తల్లీ కోరుకోదు. మర ఫిరంగులకు ఆహుతి చేయటానికి ఏ తల్లీ పిల్లలను కనదు. శాంతిని, ప్రపంచ శాంతిని, అణ్వస్త్రాల నుండి విముక్తిని, యుద్ధాలు లేని శాంతిని ఆమె కోరుకుంటుంది. అందుకనే శాంతి అనేది ముఖ్యంగా స్త్రీల సమస్య. యుద్ధాలకు ముందుగా తయారయ్యేది, కయ్యానికి కాలుదువ్వేది పురుషులే. తగాదాలను చిలికి, చిలికి గాలి వాన చేసుకొని పరస్పర విధ్వంసానికి దారి తీసేది పురుషాధిపత్య సమాజాలే. కనుక ప్రపంచ శాంతి సందేశాన్ని స్త్రీలు చేపట్టాలి.

శాంతి, సమానత్వం, అభివృద్ధి అనే మూల సూత్రాలపై ప్రపంచ మహిళల స్థాయిని పెంచి, ప్రపంచ శాంతిని పరిరక్షించాలనేదే ప్రపంచ మహిళా దశాబ్ది ఉత్సవాల లక్ష్యం. అసలు శాంతిని స్త్రీలు పరిరక్షించటం, శాంతి స్థాపన కోసం పని చెయ్యటం ఈనాటిది కాదు. 1981 సెప్టెంబరులో హెలెన్‌కాల్డికాట్ ప్రపంచ శాంతి ఉద్యమాన్ని నడిపింది. రష్యా వెళ్ళి అధికార్లను, అనధికార్లను కలిసి అణ్వాయుధ పోటీని ఆపమని అభ్యర్థించింది. 1982 జూన్ 12న న్యూయార్కు నగరంలో అనేక వృత్తులవారు, మతాలవారు, కార్మిక, విద్యా, రాజకీయ సంఘాలవారు మూడు మైళ్ళ పొడవున లక్ష జనం శాంతికోసం శాంతి యాత్ర జరిపినట్లు 'న్యూయార్కు టైమ్సు' ప్రచురించింది. ఇంతవరకు పురుషులు సాధించలేని శాంతి సామరస్యాన్ని స్త్రీలు సాధించగలరని విశ్వసించటంలో పొరపాటులేదు. ఈనాడు ప్రపంచ శాంతికి కావల్సిన స్త్రీత్వ స్వభావపు విలువలు అంటే ఉత్పత్తి చెయ్యటం, పోషించటం, శాంతి స్థాపన నెలకొల్పటం, జీవ సృష్టి చెయ్యటం, శాంతిని పోషించే స్వభావం, ప్రేమించే తత్వం, అహింసా భావం—స్త్రీలకు క్రొత్త కాదు. ఈ విలువలను నెలకొల్పగల శక్తి స్త్రీలకు వుందనేది పచ్చి నిజం.

# మన హక్కులు : బాధ్యతలు

మన మహిళల హక్కులన్నీ మన చట్టాల్లో వున్నాయి. ఇంకా మన పొలిటికల్ సైన్సు పుస్తకాల్లో వున్నాయి. ఇక బాధ్యతలను గురించి అడక్కండి. అవి మన బుర్రల నిండా వున్నాయి; అవి అనుభవంలో నిత్యం జరుగుతున్నాయి. ఇది విస్మరించరాని పచ్చి నిజం. మతధర్మ శాసనాలను గురించి చర్చించే ముందు అసలు హక్కులంటే ఏమిటి? అవి ఎన్ని రకాలు వున్నాయి? వాటిలో వున్న లోపాలు ఏమిటి? అవి ఎలా సవరింపబడాలి? లేని వాటికై ఎలా డిమాండ్ చేయాలి? అనే విషయాలన్నీ స్త్రీలకు తెలియాలి అంటే వారిలో దానికి తగిన విద్యావిజ్ఞానాలు వుండాలి. ముందుగా ఎన్ని రకాల హక్కులు వున్నాయో తెలియాలి. వాటిని అనుభవించగల ధైర్య స్థైర్యాలు వుండాలి. ఏ హక్కులైనా అనుభవించ లేకపోతే అవి (Dead Rights) నిరుపయోగమైపోతాయి. అంటే నశించి పోతాయి. హక్కు అన్నా, చట్టమన్నా అదొక కత్తి లాంటిది. కత్తి ఆపరేషన్ చేసి మనిషిని బ్రతికిస్తుంది, లేదా అదే కత్తి తుప్పుపట్టి రాలిపోతుంది. కనుక హక్కులు అంత విలువైనవి; బరువైనవి, అవసరమైనవి కూడా.

భారత రాజ్యాంగంలో సమానత్వం అనేది మౌలిక హక్కుగా వ్రాయబడింది. స్త్రీల పరిస్థితిని మెరుగు పర్చటానికి రాజ్యాంగం 14, 15 ఆర్టికల్సులో పొందు పరచిన సమానత్వ సిద్ధాంతానికి పురుషులతో పాటు స్త్రీలకు హక్కు ఇవ్వబడుతుంది. అయితే తాము తక్కువ అనే భావం వల్ల 1954లో ప్రవేశ పెట్టబోతున్న హిందూకోడ్ బిల్లును స్త్రీలే వ్యతిరేకించారు. ఆ బిల్లులో పిత్రార్జితపు ఆస్తిలో వారసత్వం పురుషులకు కూడా వుండరాదనే మౌలికమైన మార్పు. ఈ బిల్లు చట్ట రూపం కాకుండా ఆనాడు స్త్రీలంతా మూకుమ్మడిగా ప్రదర్శనలు జరిపినందువల్ల ఆ బిల్లు అణగారిపోయింది. తత్ ఫలితంగా భారత స్త్రీల హక్కులన్నీ వమ్మ ఆయిపోయి నష్టపడ్డారు. మన చట్టాలు స్త్రీల పట్ల చూపుతున్న వైఖరి గమనిస్తే కొన్ని ప్రశ్నలు ఉదయిస్తాయి. చట్టాలు స్త్రీలకు పూర్తి న్యాయం చేస్తున్నాయా లేదా? చట్టాల వ్యాఖ్యానంలో భాష్యకారులు స్త్రీ పురుష సమానత్వాన్ని నిరూపిస్తున్నారా.

ధర్మశాస్త్ర నిర్ణేతలు, చట్ట నిర్మాతలు పూర్తిగా పురుషులు కావటం కారణమా? తమ హక్కుల గురించిన పరిజ్ఞానం స్త్రీలలో లోపించటమా? వాటి కొరకై పోరాటాలు జరపక పోవటమా? ఏదైనా మొత్తం మీద మన పూర్వీకులైన శాస్త్రకారుల భావాల బలిమే మన చట్టాలలో బీజరూపం తాల్చివున్నాయి. ఆనాడు స్త్రీలపై వారికున్న దృష్టి

దోషమే ఈనాటి చట్టనిర్మాణంలో కాని, న్యాయశాస్త్ర నిర్ణేతల్లోకాని, న్యాయవాదుల్లోకాని ఘనీభవించి వున్నాయి. ఏ కొద్దిమందో వ్యతిరేకించినా అణిచి వేయటం సర్వ సాధారణ మయింది. అందుకు ఉదాహరణలు 1954లో హిందూకోడ్ బిల్లును నిర్మూలించటం తిరిగి 1986 లో ముస్లింస్త్రీల మనోవర్తి తీర్పును దేశమంతా కలిసి 'సవాల్' చేసి నిరసిస్తూ వ్యతిరేకంగా చట్టాన్ని ప్రవేశపెట్టటం లాంటివి అవి. అయినా చట్టాల్లో కొన్ని మంచివి. శ్రేయస్కరమైనవి వున్నా, అనుభవించలేని అసమర్థత మన స్త్రీలలో మెండుగా వుంది. దానికి కారణం పూర్వపు ఆచారాలకు సనాతన సంప్రదాయాలకూ వారు విలువ ఇవ్వటం వల్ల హక్కులను వాడుకోలేక పోతున్నారు. ముఖ్యంగా రెండు రకాల నష్టాలు వున్నాయి. స్త్రీ పురుష వివక్ష న్యాయపరంగా భాష్యం చెప్పటం మానవ హక్కులను కాలరాయడం.

'స్త్రీలు చట్టాలు' అనే అంశం గురించి తెలియాలంటే దానికి కొంత పూర్వ చరిత్ర వుంది. మతధర్మ శాస్త్రాల ఆధారాలు వున్నాయి. ప్రవక్తల నిర్దేశాలు వున్నాయి. ఆచారాల ప్రసక్తి వుంది. పురుష ప్రపంచ భావన వుంది. ఇలా అనేకానేక సంస్కృతుల సమ్మేళనమే మతధర్మ శాసనాలు. అందువల్ల మన దేశంలోని మహిళల హక్కులు, స్థితిగతులు, వారు అనుకరించే మతం మీద ఆధారపడి వుంటాయని ముందుగా మనం గ్రహించాల్సిన విషయం. ఇక మత ధర్మశాసనాల పుట్టుక, మార్పులు, చేర్పులు, సవరణలు గురించి ప్రస్తావించుకొందాం.

మనదేశంలో అనేక మతాలకు చెందిన వారున్నారు. హిందూ, ముస్లిం, క్రైస్తవ పారశీక మతాలు ముఖ్యమైనవి. మనది లౌకిక రాజ్యం అని చెప్పుకొంటున్నాం. నేరాలు, సుంకాలు, పన్నులు మొదలగు వాటి విషయంగా సర్వులకు శాసనాలు (125 **Cr. P. C**) ఒకటి గానే వున్నాయి. అయితే వివాహం దత్తత, సంరక్షకత్వం, వారసత్వం, మనోవర్తి, విడాకులు లాంటి అంశాలకు వేరు వేరు మతాల వారికి వేరు వేరుగా శాసనాలు వున్నాయి. వీటిని 'మత ధర్మాసనాలు" అంటాం. రాజ్యాంగం44 వ అధికరణం ప్రకారం భారతీయులందరికి వర్తించే ఒక వ్యవహార సంహిత (కామన్ సివిల్ కోడ్)ను ప్రభుత్వం రూపొందించాలని, కృషిచేయాలని రాజ్యాంగం స్పష్టీకరించింది. మన రిపబ్లిక్ రాజ్యస్థాపన జరిగి 37 ఏళ్ళు నిండాయి. అయినా ఈ సందర్భంలో ఏ ప్రయత్నమూ జరగలేదు కారణం మైనారిటీ వర్గాల కోర్కెలు. హక్కుల పరిరక్షణకు తాము బద్ధకంకణులుగా వుంటున్నామని వారిని భ్రమించి చేస్తున్నట్లుగా తోస్తుంది. ఈ పరిస్థితికి దోహదకారణాలు అనేకం వున్నాయి. అల్పసంఖ్యాకులలో తగినంత పలుకు

బడి కలిగిన సంస్కర్తలు లేకపోవటం, వారి మత భావాలకు విరుద్ధంగా సవరణలు తెచ్చి, వారిని రెచ్చగొట్టరాదనే పాలకుల వైఖరి, అధికారపార్టీలు, ప్రతిపక్షపార్టీలు— అందరూ కూడా — సంస్కరణనకు పూను కుంటే అల్పసంఖ్యాకుల ఓట్లు తమకు రావనే భయాందోళనలు ఇవన్నీ ఈ శోచనీయ పరిస్థితికి కారణాలు. ఇతర అభ్యుదయ దేశాలలో అలాకాదు. మతాలు వేరైనా పౌరులందరికీ వర్తించే శాసనాలలో తేడా వుండదు.

భారత దేశంలో అనేకమంది పురుషులు తమ భార్యలను గౌరవిస్తున్నామని గొప్పగా చెప్పు కుంటూ వుంటారు. అర్ధాంగులుగా పరిగణిస్తున్నామని పొగుడు కుంటూ వుంటారు. ఇదొక ఎత్తుగడ అంటే దూషిస్తారు. ఆఖరికి చట్టంలో కూడా పురుషులకు వున్నన్ని హక్కులు స్త్రీలకు లేవనేది నిర్వివాదాంశం, కనుక మహిళాభ్యున్నతికి కృషి చేయపూనుకున్న మహిళా కార్యకర్తలకు వివిధ చట్టాలలో మన మహిళల స్థానాన్ని, వారి హక్కులను అవగాహన చేసుకోవటం అవశ్యకర్తవ్యం.

ధర్మశాస్త్ర ప్రతిపాదితమైన హైందవ ధర్మసూత్రాలను బ్రిటిష్ పాలనాలో శాసనాల ద్వారా కొంత మార్పు చేయడం జరిగింది. దేశ స్వాతంత్ర్యం పొందాక, రాజ్యాంగం ఏర్పడ్డ పిదప భారీ ఎత్తున మార్చడం జరిగింది. అలాంటి మార్పు యితర మతాలలో కొద్దిగా జరిగింది. 1857 లో సిపాయి తిరుగుబాటు జరిగాక బ్రిటిష్ ప్రభుత్వ వైఖరిలో మార్పు వచ్చి, వారు పట్టించుకోలేదు. రాణి విక్టోరియా తన ప్రకటనలో భారత ప్రజల మత విషయాలలో ప్రభుత్వం జోక్యం కలుగ జేసుకొనేది లేదని ప్రకటించింది. తరువాత సంస్కరణోద్యమానికి బ్రిటిష్ ప్రభుత్వం యొక్క మద్దతు మనకు లభించలేదు. కాని వారు దానిని ఏనాడు వ్యతిరేకించలేదు. తిరుగుబాటుకు పూర్వం అధిక సంఖ్యాకులైన హిందువుల విషయంలో కొంతగా కొంత జోక్యం చేసు కున్న ఫలితంగా 1829 లో సతీసహగమన చట్టాన్ని, 1856 లో ఆమోదించిన విధవా వివాహశాసనం నిదర్శనాలు. 19 వ శతాబ్దపు శాసనాల నిర్మాణంలో బ్రిటిష్ వారి పరిపాలనా కాలంలో వచ్చిన వాటిలో శారదాయాక్టు (బాల్య వివాహ నిరోధ శాసనం) ఒకటి. ఇది కేంద్ర శాసన సభలో ఒక సభ్యుని కృషి వల్ల జరిగింది. తర్వాత 1946 లో వివిధ శాఖలకు చెందిన వివాహాలు. అంటే ఒకే కులం, ఒకేగోత్రం, లేక ప్రవరలో చెల్లుతాయి అనే చట్టం వచ్చింది. 1946 లో ఆమోదింపబడిన మనవర్తి శాసనం అమలు జరిగింది. ఇంకా 1949 లో భిన్న మతాల, కులాలు, వర్ణాలకు చెందిన వివాహం చట్ట సమ్మతం చేశారు. ఇవన్నీ దేశస్వాతంత్ర్య సముపార్జన సమయంలో శాసన

రూపం దాల్చాయి 1947 లోని బొంబాయి విడాకుల చట్టం, 1946 లోని బొంబాయి బహుభార్యాత్వ నిషేద చట్టం, 1949 లోని మద్రాసు బహుభార్యాత్వ నిషేదము, విడాకుల చట్టం 1935 భారత ప్రభుత్వ చట్టంలో నిర్దేశింపబడిన రాష్ట్ర స్వపరిపాలనా ఫలితాలు. 1936లో పార్శీ వివాహ విడాకుల చట్టం ఈ వైఖరికి నిదర్శనం. ముస్లిం స్త్రీకి విడాకుల హక్కును ప్రతిపాదించే చట్టం 1939 లో వచ్చింది. కాని ముస్లిం లా సవరణ ఎప్పుడో 1939 లో జరిగిందే ఈనాటికీ అమలులో వుంది. 1956, 60, 64, 76, 78 లలో మార్పు చేయబడిన హిందూ వివాహ శాసనం, 1955 లోని హిందూ వారసత్వ శాసనం, 1956 లోని హిందూ దత్తత మనవర్తి చట్టం, 1956 లోని హిందూ సంరక్షకత్వ శాసనం-ఇవన్నీ అభ్యుదయ కరమైనవి ప్రజాభిప్రాయానికి అనుగుణంగా హిందూ శాసనాలను మార్చటానికి ప్రభుత్వం వెనుకాడ లేదని మనం గ్రహించవచ్చు. కాని 1872లో క్రోడీకరింప బడిన క్రయిస్తవ వివాహ శాసనంలో 1869 నాటి క్రయిస్తవ విడాకుల శాసనంలో సవరణలు జరుగక పోవటం చాలా శోచనీయం. పార్శీ వివాహ శాసనం, విడాకుల శాసనం 1936లో చట్ట రూపం ధరించినవి, అలాగే నిలిచిపోయాయి చాల కాలం. ఇటీవలనే మార్చారు. అలాగే 1939 నాటి ముస్లింలా విషయం కూడా. ఒక వైపున స్వప్రయోజన పరులు, రెండవ వైపున పాలక వర్గాలూ ఇద్దరూ కలిసి అల్పసంఖ్యాక వర్గాల వ్యవహార శాసనాలను (Civil Laws) మార్చే విషయంలో కుట్రచేసి జోక్యం కలిగించు కోటం లేదనేదానికి పై ఉదాహరణలు గీటు రాళ్ళు. ముస్లిం, క్రయిస్తవ మత ధర్మశాసనాలు మారక పోవటం వల్ల, హిందూ శాసనాలు ఇంకా మెరుగు కాకపోవటం వల్ల స్త్రీలు నష్టపోతున్నారు; కష్టాల పాలవుతున్నారు.

# హేతువాదం : స్త్రీలు

చాలా మంది వరకట్నం, అశ్లీలం వంటి చిన్న చిన్న విషయాల గురించి మాట్లాడతారు గాని, అసలు స్త్రీ పురుష అసమానత్వాన్ని పెంచి, పోషించి, సమర్థించేది మతం అని మర్చిపోతారు. స్త్రీల పట్ల జరిగే ప్రతి దుర్మార్గాన్ని ఏదో ఒక మతం ఆదరిస్తుంది, పోషిస్తుంది. ఉదాహరణకి పాతివ్రత్యం పేర, స్త్రీల అణచివేతను హిందూ మతం బలపరుస్తుంది. బహు భార్యాత్వాన్ని ఇస్లాం ఆమోదిస్తుంది. పెళ్ళికాలపు ప్రమాణాల పేరుతో పురుషాధిక్యతకు స్త్రీని విధేయురాలిని చేసింది క్రైస్తవం. వర దక్షిణ ముసుగుతో వరకట్నాన్ని ప్రవేశపెట్టింది హిందూమతం. ఏకపక్షంగా విడాకులివ్వటానికి భర్తకు హక్కు ఇచ్చి స్త్రీని నిరంతరం భయభ్రాంతను చేసింది ఇస్లాం. ఇంచుమించుగా విడాకులను పొందలేని స్థితికి స్త్రీని దిగజార్చి, ఆమెకు తీరని అన్యాయం చేసింది క్రైస్తవం. "నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అనేది గ్రుడ్డిగా నమ్మమంటుంది మతం. అలాంటి మతాలను పట్టుకొన్న స్త్రీలను ఎవరు గౌరవిస్తారు? సమానత్వం ఎలా సిద్ధిస్తుంది? ప్రభుత్వం మీద ఒత్తిడితెచ్చి శాసనాలు చేయించవచ్చు కాని, అమలు పర్చమని అడిగేదెవరు? తమ అజ్ఞానంలో స్త్రీలు మునిగిపోయినంత కాలం, స్త్రీలు మతం పేర తమకుతాముగా నష్టపరచుకున్నంత కాలం వారిని ఎవరూ రక్షించలేరు. ఈ రోజున స్త్రీలను దాస్యంలో వుంచేది మానసిక బానిసత్వమని, దానికి కారణం మత సిద్ధాంతాలేనని మనం ఎంత త్వరగా గ్రహిస్తే అంత మంచిది.

మతం వ్యక్తి స్వేచ్ఛను, సమానత్వాన్ని వమ్ముచేస్తుంది. మతం సనాతనత్వమని విద్యావంతులైన స్త్రీలు ముందుగా గుర్తించాలి. శతాబ్దాల తరబడి స్త్రీలు లోనవుతున్న ఈ ఇబ్బందుల నుండి, మత బంధం నుండి తప్పించుకుంటే తప్ప స్త్రీ జాతికి విముక్తి లేదు. ఈ కర్తవ్యం అంత తేలికగా నిర్వహించలేము. దీనికి పట్టు వదలని ప్రయత్నం, త్యాగం అవసరం. వరకట్నం తీసుకున్న భర్తకు వ్యతిరేకంగా ప్రదర్శన చేయడం, లేక గోడమీద వున్న నగ్న స్త్రీ చిత్రానికి మసిపూయడం చాలా తేలిక. అలా చేస్తే వెంటనే ప్రచారం వస్తుంది; ఒక్కొక్కప్పుడు ఫలితాలు కూడా త్వరగా వస్తాయి. కాని పురుషాధిక్య సమాజపు దోపిడీ సాధనంగా మతాన్ని గుర్తించి తోటి దురదృష్టవంతులైన స్త్రీలకు తెలియజేయడం చాలా కష్టసాధ్యమైన పని. కాలహరణంతో కూడిన పని. అలాంటి పనిని యింత వరకూ ఏ మహిళాసంఘమూ చేపట్టలేదు. బహుళా

ఆ మహిళా సంఘ నాయకులు కూడా మత దృష్టి కలవారేమో! లేక మత మౌఢ్యంలో మునిగిన వారేమో!

ఇక సమానత్వం సంగతి సరే సరి. భార్యాభర్తలు సమానమే కాని, ఆమె వంట చెయ్యాలి, పిల్లల్ని పెంచాలి; దానికి ఆమెయే తగును. ఆమెకు ఓర్పు, నేర్పు వున్నదని చెప్పి పబ్బం గడుపుకుంటారు. ఇది ప్రచ్ఛన్నమైన మోసం. సంతానాన్ని స్త్రీ మాత్రమే కనగలదని, స్త్రీ పురుషులిద్దరూ శిశువుల్ని పెంచగల సమర్థులు అని మరచిపోరాదు. తప్పుడు మాటలు చెప్పి, కుంటిసాకులు చెప్పి, నంగనాచి మాటలు పలుకుతూ స్త్రీని అసమానత్వ దృష్టితో చూడటం, ఆత్మవంచన, పరవంచన కూడా. పై చెప్పిన వైఖరులను వ్యాపారరీత్యా, ఎత్తుగడల రీత్యా అనుసరిస్తున్నారు మతస్తులు. కాని కొంతమంది నిరీశ్వరవాదులు సైతం అమాయకంగా యిలాంటి పొరపాటు వైఖరిని నోటి మాటతో కాని, చేతలతో కాని సమర్థించటం శోచనీయం. ఇక్కడ ఒక పరిశీలన అవసరం. తమ చిత్తవృత్తిని, తమ నడవడిని సమీక్షించుకోవటం అవసరం. స్త్రీ పురుషులందరూ దేవుని బిడ్డలనుకుంటే, ఉపాధిలో వున్న జీవాత్మ, పరమాత్మకు భిన్నం కాదనుకుంటే మనుష్యులందరూ సమానులే. స్త్రీ పురుషులు కూడా సమానులే. అలాకాక శాస్త్రీయ దృక్పథంతో ఆలోచిస్తే ప్రతి మనిషిలో హేతుత్వం వున్నది కనుక మానవులందరూ స్త్రీ పురుషులందరూ సమానులే. ఆస్తికులయినా, నాస్తికులయినా ఈ సత్యాన్ని విస్మరించటానికి వీలు లేదు. అలాంటప్పుడు మానవ వ్యక్తి నిరంతరం ఆశించే స్వేచ్ఛను కాదనడానికి మనం ఎవరం? స్త్రీలకు స్వేచ్ఛా సమానత్వాలను అందించలేని సమాజం యొక్క వికాసం కుంటుపడుతుంది. సమాజంలో సగం మంది స్త్రీలు తక్కువ స్థాయి మానసిక జీవితం సాగిస్తున్నప్పుడు వారు ప్రగతికి ప్రతిబంధకాలుగా తయారవుతారు. పురుషాభ్యుదయం కూడా కుంటుపడుతుంది. "నేను వరకట్నాలకు వ్యతిరేకినే కాని, మా ఆవిడని కాదనవేక అడుగుతున్నాను" అంటాడొక అభ్యుదయ పురుషుడు. నేను స్త్రీ విద్యకు అనుకూలణ్ణే కాని మా ఆవిడ పోరు పడలేక మా అమ్మాయి చదువు మాన్పించాను అంటాడొక విప్లవ వీరుడు. ఏమయింది వీరి పురోగామి తత్వం? ఏ స్త్రీలనయితే వీరు అజ్ఞానంలో వుంచుతున్నారో ఆ స్త్రీల అజ్ఞానమే వారిని బలిగొంటున్నది. తాను త్రవ్వుకున్న గోతిలో తామే పడుతున్నారు. ఇది విజ్ఞత కాదు; వివేకమనిపించుకోదు. సాధ్యమయినంతవరకు తలచే దానికి, చెప్పేదానికి, చేసేదానికి పొంతన వుండాలి. ఆస్తికులయినా, నాస్తికులయినా, మతస్తులయినా, హేతువాదులయినా చిత్తశుద్ధితో స్త్రీల విషయమై సంచరించిన నాడు ఈ దేశం పురోగమిస్తుంది.

ఇలా చెప్పగానే కొంతమంది పురుషులు "మేం చెప్పలేదా స్త్రీకి స్త్రీయే శత్రువు" అని హుంకరిస్తారు. ఇంతకన్నా అజ్ఞానం, అయోమయ తత్వం మరోటి వుండబోదు. మామూలుగా కోడల్ని కష్టపెట్టేది అత్తయే. కాని ఈ అత్తకు యిలాంటి ఆలోచనలు ఎందుకొచ్చాయి? అసలు అత్త ఎవరు? అంటే ఈ పురుషాధిక్య సమాజపు విలువలను జీర్ణించుకున్న వ్యక్తి అని చెప్పుకోవచ్చు. ఈ సమాజం చిన్నప్పటి నుండి "స్త్రీ తక్కువ, పురుషుడెక్కువ" అనే భావాన్ని కలుగజేసింది. అదే నిజమని నమ్మిన అత్త తాను భర్తకు లొంగివుండి, తన కొడుక్కి తగిన కట్నం తేలేదని కోడల్ని హింసిస్తుంది. ఈ పురుషాధిక్య సమాజాన్ని శాసించేది, నిర్మించేది పురుషులేనని విస్మరించరాదు. జన నష్టాన్ని తెచ్చే యుద్ధానికి దేశనాయకులే కారణభూతులు కాని, సైనికులు కాదు. అలాగే సమాజాన్ని నడిపించే పురుష నాయకులదే ఈ తప్పంతా. అంతేకాని స్త్రీలది కాదు. కొందరు తెలియక స్త్రీలను నిందిస్తుంటే మరికొందరు తెలిసి స్త్రీలను దుయ్యబట్టి తాము ముఖం చాటు చేసుకుంటున్నారు. కాని, నిజం దాగదు. వివేకవంతులైన స్త్రీ పురుషులు ఈ విషయాన్ని అర్థం చేసుకుంటున్నారు.

కపటం, మోసం, వక్రభాష్యం, కుతంత్రాలు, స్త్రీ విమోచనోద్యమాన్ని ఆపలేవు. ఈ అంశాన్ని ఎంత త్వరగా అందరూ గుర్తిస్తే అంత మంచింది.

స్త్రీ పురుష సంబంధాలలో నిర్వచనాలలో కపటం, మోసం వుంది.

1) ఈనాటి సమాజంలో అసమానత్వం మెండుగా వున్నది. ఉండరాదని అందరూ కంగీకరిస్తారు.

2) తీరా అమలుపరచాలంటే వక్ర భాష్యాలు చెప్పి కపటంతో, మోసంతో తప్పించుకుంటారు. స్త్రీ శరీర నిర్మాణం వేరు, పురుష శరీర నిర్మాణం వేరు. కనుక వారిరువురు సమానమైనా వారి విధులు వేరు. బయటపనులు పురుషుల వంతు, స్త్రీ మాత్రం గృహలక్ష్మిగా ఇల్లు సరిదిద్దుతూ, పిల్లల్ని కంటూ వుండాలని శాసిస్తారు.

3) మరో వర్గం—మీరూ మేమూ సమానులమే. ఉన్న సమాజంలో ఇద్దరికీ ఉద్యోగాలు దొరకవు కనుక మేము ఉద్యోగాలు చేస్తాం, మీరు ఇంటిలో వుండండి అంటారు. ఈ రెండూ కపట విధానాలే. మోసపు మాటలే.

4) అసలు స్వేచ్ఛా, సమానత్వం అనే మాటలకు వీటిని అంగీకరిస్తున్న వారందరూ ఒకే అర్థం చెపున్నారా? లేదు. "స్వేచ్ఛ" అనే భావాన్నే తీసుకుందాం చిన్న సామెత వీరిపై ఖరిని తెలియజేస్తుంది. "పురుషుడు తిరగక చెడతాడు" "స్త్రీ తిరిగి

చెడుతుంది". అంటే ఇంటి వెలుపుల ఆమె నడయాడటానికి కూడ వీలులేదు. గ్రామాల్లో "చదువు చాల్లే" అని ఆపుతారు. అమ్మాయికి కనీసం కుటుంబ విషయాల్లో కూడా, ముఖ్యమైన వాటిల్లో ఆమె ప్రమేయం వుండదు. పొలం కొనడం, స్థలం సంపాదించటం, ఇల్లు కట్టడం, ఆడపిల్లకు చదువు చెప్పించడం, ఇలాంటి వాటిల్లో కూడ ఆమె మాటకు విలువలేదు. చివరకు ఎంతమంది సంతానాన్ని కనాలో, భర్త తేల్చాలి. ఆమె సంతాన నిరోధ ఆపరేషన్ చేయించుకోవాలన్నా అతడు నిర్ణయించాలి. ఇలా శారీరక, కౌటుంబిక, సామాజిక విషయాలలోనే కాక ఆర్థిక, రాజకీయ విషయాలలో కూడ ఆమెకు స్వేచ్ఛ లేదు. ఆమె కష్టపడి తెచ్చే కూలీ, వేతనం, జీతం ఆమెకు చెందవు వివాహిత స్త్రీని ఓటు కూడ ఎవరూ అడగరు. ఫలానావారి భార్యగాను, లేక ఫలానావారి కూతురుగానూ, రాజకీయ రంగ ప్రవేశం చేయాలే తప్ప ఆమెను పైకి రానివ్వరు. ఇలా చెప్పాలంటే సవాలక్ష సమస్యలున్నాయి. ఇన్నింటికీ మూలం మతమేనని మనం నిరూపించవచ్చు. కనుక మత తత్వాన్ని ఎంత త్వరగా ఛేదిస్తే అంత త్వరగా మనలో రాక్షసత్వం పోయి మానవత్వం సిద్ధిస్తుంది; స్త్రీ జనాభ్యుదయం, పురుష విముక్తి సిద్ధిస్తుంది. మరి హేతువాదం స్త్రీలకు ఎందుకు కావాలో ఆలోచిస్తారా?

# కుహనా వైజ్ఞానికులు: సామాజిక రుగ్మతులు

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూను ఆధునిక భారత నిర్మాతగా కొంతమంది పేర్కొంటారు. విజ్ఞానానికి ప్రాధాన్యత నివ్వటానికి ఆయన ప్రయత్నించాడనటంలో సందేహం లేదు. ఆ సందర్భంలోనే మన దేశంలో నెహ్రూ కేంద్రాలు అనేక చోట్ల వెలిశాయి. శాస్త్రీయ దృక్పథం యొక్క ఆవశ్యకతను గురించి ఆ కేంద్రాలు నొక్కి పెట్టి ప్రచారం చేశాయి. శాస్త్రీయ దృక్పథం అలవర్చుకోవటం పౌరుల కర్తవ్య మన రాజ్యాంగంలో కూడా అధికరణమూ 51 ఎ లో మౌలికవిధులుగా శాస్త్రీయ భావనను, మానవాదాన్ని, సత్యాన్వేషణ శక్తిని, సంస్కరణ భావాలను అలవర్చుకోవాలని పేర్కొన్నారు. శాస్త్రీయ దృక్పథమూ, సంప్రదాయాల దాస్యమూ, అనే పేరుతో చర్చ కూడా సాగింది. అనేక మంది విజ్ఞాన శాస్త్రవేత్తలు తమ అభిప్రాయాలను చెప్పక తప్పలేదు. శాస్త్రీయ దృక్పథం అవసరం లేదని ఎవరూ అనకపోయినా దానికి, మతానికి లేక దైవభావనకూ వున్న సంబంధాలను వివరించడంలో భిన్నాభిప్రాయాలు ప్రకటిత మయినాయి. ఆలా ఆనాడికీ ఈనాటికీ శాస్త్రీయ దృక్పథం లోపించటానికి కారణా

లనేకం వున్నాయి. అంతేకాదు, సైన్సును నమ్మినవారిలోనూ, నమ్మనివారిలోనూ, కూడా భిన్నాభి ప్రాయాలు చాలా వున్నాయి. వితండ వాదాలనేకంగా వున్నాయి.

మతాన్ని, సైన్సునూ కలిపి రెండూ ప్రక్కప్రక్కనే సహవాసం చెయ్యవచ్చనే వాదన ఒకటి ప్రబలంగా ప్రచారంలో వుంది. రెండోది. మతం, విజ్ఞానం రెండూ మానవాళికి నష్టం చేకూర్చాయి. కనుక రెంటి మేళవింపుతో కూడిన శాస్త్రీయ మతం కావాలనేవారు ఒకవర్గంగా తయారయ్యారు. అంటే నింద్యమైన మతమూ—మూఢాచారా లలో పిడివాదాలలో వున్న మతం-ఒక వైపున, నింద్యమైన విజ్ఞానం-అణుబాంబులు, మారణాయుధాలు తయారుచేసిన విజ్ఞానం-మరోవైపున వున్నాయి. ఈ రెంటి మంచిని కలిపి దానిని శాస్త్రీయమతంగా [సైన్సుపై ఆధారపడే మతాన్ని] నిర్మించి ఇటు మతంలో మంచిని అటు సైన్సులో మంచిని కలిపి నూతన విధానంలో జీవితాన్ని మలుచు కోవాలనే శాస్త్రజ్ఞులు కొందరొచ్చారు. ఇక మూడో పద్ధతి వాదనొకటి హెచ్చు స్థాయిల్లోనే అమల్లోవుంది. మనిషిలో అద్భుత దృశ్యాలమీద, విషయాలమీద ఆసక్తి వుంటుంది. దానివల్ల సత్యాన్వేషణ ఉద్భవిస్తుంది; అది సృజనాత్మకతకు దారితీస్తుంది. భావుకత, సృజనాత్మకత మనిషియొక్క ఆధ్యాత్మికతకు నిదర్శనాలు. విజ్ఞానం కేవలం భౌతిక ప్రపంచానికి సంబంధించినది- విజ్ఞానాన్ని అంగీకరించనంత మాత్రాన ఆధ్యా త్మికతను నిరసించనక్కరలేదు ఇతరులకు నష్టంలేని ధ్యానము, గురుపూజ, దైవ ప్రార్థనలను మనం నిరసించ నక్కర్లేదు. అనేది మరోవర్గపు భావన వుంది.

ఇకపోతే మరోరకపు పురాతనవాదం వుంది. మతానికి, సైన్సుకు వైరుధ్యం వుందనేదే ఆ సిద్ధాంతం. వాటి అంతగా లేక పోయినా దాని ప్రభావం పైవాదనలకు తీసి పోదు. ఈ సిద్ధాంత ఈ విభిన్న వాదాలతో అనంతంగా పోరాడుతూ తన విశిష్టతను నిలుపుకొంటున్నది. అదే భౌతికవాదం లేక హేతువాదం. ఇది ఇతర వాదాలన్నింటిని నిరసిస్తూ తర్కానికి అనుభవానికి విలువనిస్తుంది. పైవాదాలన్నీ స్వర్గము నరకము అనే భయంకర, నమ్మశక్యంకాని అతీత భావాలమీద ఆధారపడి వుంటాయి. కాని హేతు వాదం మాత్రం కేవలం నైతిక సిద్ధాంత ప్రాతిపదికపై ఆధారపడి వుంటుంది. రాజ కీయ, సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక అంశాలన్నీ మానవ ప్రయత్నం మీదనే ఆధార పడి వుంటాయని ఉద్ఘాటిస్తుంది. శాస్త్రీయ విజ్ఞానం, తార్కిక లక్షణం, సత్యాన్వేషణలతో కూడిన జీవిత విధానమే దాని లక్ష్యం. వైజ్ఞానిక విశ్లేషణద్వారా మాత్రమే మతశక్తులను మూఢ, విశ్వాసాలను ఛేదించగలమని, ప్రకృతిపై ఆధిపత్యం వహించగలమనే విశ్వా సం హేతువాదులకు మాత్రమే వుంటుంది. తమ భవిష్యత్తుకు తామే కారకులమని

నమ్ముతారు. గుడ్డిగా దేనిని నమ్మరు. ఏ సిద్ధాంతానికి చరమదశవుండదని, ఏ ఒక్కరూ చివరి సిద్ధాంతకర్తలు కారని నమ్ముతారు. మతపరమైన విశ్వాసాలు, నమ్మకాల వల్ల సంప్రదాయాలు మరింత బలపడతాయని తద్వారా సామాజిక పతనం వస్తుందనీ వాదిస్తారు.

మతంలో ప్రయోజనకరమైన లక్షణాలు, నష్టదాయకమైన లక్షణాలూ రెండూ వున్నాయి. ప్రయోజనం అంటే నీతిమీదనొక్కు. మతం సామాజిక జీవితాన్ని ప్రభావితం చేయబూనినప్పుడు నీతియొక్క ఒక దృక్పథాన్ని విధిగా అనుసరించకతప్పదు. నీతి మానవ నడవడికకు సంబంధించిన విషయం. ఒకవ్యక్తి మరియొక వ్యక్తితోగాని, పలువురు వ్యక్తులతోగాని సంబంధం కలిగి ప్రవర్తించవలసి వుంటుంది. ఈ సందర్భంలోనే మంచిచెడ్డలు, యుక్తాయుక్తాలు అవశ్యమౌతాయి. నీతివంతమైన జీవితాన్ని గడపవద్దని ఎవరూ అనరు. కాగా దేవునిపేర చెప్పబడ్డ నీతి మతనీతి అవుతుంది. దేవుడు చెప్పాడని, లేక ప్రకటించాడని, లేక స్ఫురింప జేశాడని, లేక అవతారాల ద్వారా పలికాడని నీతివాక్యాలను ఉటంకిస్తారు మతవాదులు. నిజానికి ఆయా కాలమాన పరిస్థితులను బట్టి సామాజిక స్థితిగతులను బట్టి తమకు తోచినవి చెప్పడం జరిగింది. నిజంగా దేవుడు తమకు చెప్పాడని, లేక మనస్సులో మెదిలేలా చేశాడని వారు నమ్మి వుండవచ్చు. ఇదంతా భ్రమ సంజాతం. అలాకాక తాము చెపితే సమాజం విలువ ఇవ్వదని భయపడి దేవుని పేరుతో ప్రకటించి వుండవచ్చును. ఏదయినా ఈ నీతి వాక్యాలు చివరకు మానవ ప్రతిపాదితాలే. సహజంగా వారి వారి కాలాలు, వారి మెట్టిన ప్రాంతాలు వేరు వేరు కావటంతో వారి దృక్పథాలలో మార్పులు, వారి మాటలలో తేడాలు కనిపిస్తాయి. ఇవన్ని వారి శిష్యులకు వారివారసులకు అందేటప్పటికి పిడివాదాలుగా మారి "మా దేవుడు గొప్పంటే మా దేవుడు గొప్పని, మా గురువు మహాపురుషుడు మా మతం ఉత్కృష్టమని తగువులాటలు ప్రారంభమై కొట్లాటలు, సంఘర్షణలు, మత యుద్ధాలు జరగటం చరిత్ర చెప్పిన సత్యం, మనకు తెలిసిన నిజం. మతం లేకుండానే నీతి వుండవచ్చు అనే భావం ఈ కోవకు చెందిన వారికి స్ఫురించక పోవడం వల్ల ఇంతవరకు మతంవల్ల జరిగిన కష్టనష్టాలను వారు విస్మరించి మతంయొక్క నైతిక ప్రాతిపదికనే వారు చెప్తున్నారు. నిజానికి దేశ కాల ప్రాంతాలనుబట్టి నీతియొక్క స్వరూపం మారుతుంది. కాని మతప్రేరితమైన నీతివిషయంగా అలాంటి అవకాశాలు లేవు. అది ఒకేసారి ప్రకటితమయింది. అది ఋషిప్రోక్తము, ప్రవక్తచే ప్రకటితము, అది సర్వకాలాలకు వర్తిస్తుంది, దానికి మార్పులేదు, ఉండదు. వుండరాదు. ఈ

అంశాన్ని గమనిస్తే మతనీతియొక్క లోప భూయిష్టత మనకు దర్శనమిస్తుంది. కనుక
మతాన్ని ఏ విధంగాను, ఆదరించటానికి పోషించచటానికి అవకాశం లేదు.

ఇక రెండవ ఆలోచనాక్రమాన్ని విశ్లేషణ చేద్దాం. ఇందులో మత మౌఢ్యాన్ని,
విజ్ఞానశాస్త్రాన్ని రెంటినీ నిరసించటం జరిగింది, విజ్ఞానానికి సాంకేతికతకు తేడాను
గ్రహించలేనందువల్ల ఈ గందరగోళం ఆవిర్భవిస్తుంది. అణువులో బ్రహ్మాండమైనశక్తి
ఇమిడి ఉన్నదని కనుగొన్న వైజ్ఞానికుడు నింద్యుడు కాడు. ఈ జ్ఞానాన్ని వాడి మార
ణాయుధాలను, అణుబాంబులను తయారుచేయించి, ఇతర దేశస్తులపై ప్రయోగించే
రాజకీయ వాది నిజంగా దుర్మార్గుడు, దుష్టుడు కూడా, అతన్ని వదలిపెట్టి విజ్ఞానాన్ని
నిందించడం అవివేకం. మతమౌఢ్యాన్ని నిరసించడం సబబే. కాని ఏదో పక్షపాత
రహితంగా ప్రవర్తిస్తున్నట్లు భావించుకొని ఇటు విజ్ఞానాన్ని అటు మతాన్ని రెంటినీ ఒక
గాట కట్టివేయటం అనుచితం.

సృష్టికర్త యొక్క ఉనికిని అంగీకరించేది మతం. మనషిని దేవునికి మోకరిల్ల
చేసేది మతం. అతనిలో దాస్యభావాన్ని అది నెలకొల్పుతుంది. అతడు ఆత్మస్థయి
ర్యాన్ని కోల్పోతాడు. అతనిలో ఆత్మవిశ్వాసం కొరబడుతుంది. స్వయం వ్యక్తీకరణకు
అవకాశం వుండదు. కనుక అలాంటి దేవుని వునికిపై ఆధారపడి ఉన్న మతాన్ని
ఏరకంగాను ఆమోదించము. ఎన్ని గుణగణాలు మత భావనకు ఆపాదించినా, అలం
కారాలు దానికి తొడిగినా మతంయొక్క అసలు స్వభావం మారదు కనుక "శాస్త్రీయ
మతం" అనేభావం గందరగోళంలో, అయోమయంలో జనించిందని చెప్పక తప్పదు.

మూడవ అభిప్రాయాన్ని అవలోకన చేద్దాం. మనిషిలో బుద్ధి, ఉద్వేగము
రెండూ వున్నాయనేది వాస్తవం. ఉద్వేగంలేని మనిషి కేవలం యంత్రమవుతాడు.
క్రోధం, శోకం, వాత్సల్యం, పశుపక్ష్యాదుల్లోను కనపడతాయి. కాకపోతే మనిషిలో
బుద్ధి కుశలత మెండు. హేతుత్వశక్తి మానవ వ్యక్తిలో బాగా వికసించింది. సముద్రం
యొక్క గంభీరత, మబ్బుల రంగులు, మెరపు కాంతి, ఉరుముల ధ్వని, పర్వతాల
ఔన్నత్యం సెలఏళ్ళ దుందుడుకు నృత్యాలు, నదీప్రవాహాల వేగము ఇవన్నీ మని
షిలో విస్మయభావాన్ని కలిస్తాయి. ప్రకృతిలో భాగమైన మానవుడు తతిమ్మా
ప్రకృతిని చూచి పరవశిస్తాడు. ఇది అతని నైజ ప్రవృత్తి. నవరసాలలో ఒకటైన
అద్భుతం మనిషిని ఆకట్టుకుంటుంది. అందుచేతనే అతనిలో సత్యాన్వేషణా, సృజనాత్మ
కత చోటు చేసుకుంటాయి. సముద్రపు లోతులను లెక్క కడతాడు. హిమాలయ శిఖరా

లను అధిరోహించాలని ఆశిస్తాడు. సాహసయుతమైన కార్యాలను అతడు చేపడతాడు. మబ్బుల రంగులను చిత్రిస్తాడు. పక్షుల కిలకిలా రావాలను విని అంతకు మించిన లయ ప్రధానమైన నాదాలను సృష్టిస్తాడు. కళాపిపాసి అవుతాడు. కళలను జీవితంలో రంగ రించుకుంటాడు. మానవ నాగరికత తొలి దశల్లో ప్రకృతికి మూలాధారండా మనిషి దేవుని ఊహించుకున్నాడు; అతని వునికిని భావన చేశాడు. విజ్ఞానం పెరిగిన కొద్దీ, మానవుని ఆలోచనా ధోరణి సాగిన కొలదీ ఆ వూహాధారమైన భావన అనావశ్యక మయింది. అయితే అలవాటుగా దేవుని ప్రార్థిస్తూ, పూజిస్తూ మననం చేస్తున్న మాన వుడు "అతడు లేడు" అనే భావనను సహించలేకపోయినాడు. ప్రేమతో పెంచి పెద్ద చేసిన తల్లిదండ్రులు చనిపోతే వారు మరో లోకంలో వున్నారని వూహించుకొని వారికి భోజన వసతులు కల్పించటానికి శ్రాద్ధాదులు చేసినట్లే "దైవ ధ్యానం" సాగించడం జరుగుతోంది. దైవభక్తి, గురుపూజ లాంటివి వున్నంత మాత్రాన విజ్ఞాన జీవితానికి నష్టంలేదు, మనిషికి అవి ఆత్మసంతృప్తినిస్తాయి, అని చెప్పటం బాల్యావస్థలోని భావాలను సాగించడమే. తృప్తి ఇస్తాయని మాదక ద్రవ్యాలను వాడితే కలిగే నష్టమే ఈ వైఖరి వల్ల కలుగుతుంది. దైవ భావనకు వ్యతిరేకంగా చెప్పే వాదనలను సక్రమంగా పరిశీలిస్తే ఇలాంటి అభిప్రాయాలకు తావు లేదు. గురుపూజా విధానాన్ని విశ్లేషణ చేస్తే శిష్యుడు గురువును సర్వస్వంగా భావిస్తాడని తెలుతుంది. "గురుర్విష్ణు గురుర్బ్రహ్మ, గురుదేవో మహేశ్వరః" అనే శ్లోకం, "తను, ధన, మనః ప్రాణాలను గురువుకు అర్పించాలి" అనేసూక్తి ఈ అంశాన్ని విశదీకరిస్తుంది. ఆత్మన్యూనతా భావాన్ని, వ్యక్తిత్వ వినాశనాన్ని ఫలితాలుగా ప్రసాదించే దైవ భావన, గురుపూజ లాంటి అభిప్రాయాలు మానవుని బుద్ధికుశలతకు అవమానకరాలు. కనుక ఇవి విజ్ఞా నంతో సహజీవనం చేయలేవు.

పై వైఖరులను తృణీకరించినప్పుడు సరియైన దృక్పధం కోసం ప్రయత్నించ వలసి వుంటుంది. మతం యొక్క, విజ్ఞానం యొక్క మౌలిక తత్వాలను గ్రహిస్తే మతానికి విజ్ఞానానికి చుక్కెదురని తేలుతుంది.

మతం విశ్వాసంమీద ఆధారపడుతుంది. మత ప్రతిపాదిక విషయాలను రుజువు చెయ్యలేము. అందువల్లే వాటికవే సత్యాలుగా చలామణి అవుతాయి. వాటికి రుజువు కోరరాదు అంటారు. అలా పుట్టిందే ఈశ్వర భావన. ఒకసారి లేనిదానిని ఊహించుకొని నమ్మిన తరువాత తతిమ్మా తంతు అంతా, లేక ఆలోచనా క్రమమంతా దానినుండే

ఉద్భవిస్తుంది. ప్రకృతికి మూలమైన శక్తి ప్రకృతికి వెలుపల వున్నదని తలిస్తే ఆ శక్తిని ధ్యానించడం, ప్రార్థించడం, పూజించడం, తృప్తిపరచడం తప్పనిసరి అవుతుంది. వాటికి క్రతువులు, వ్రతాలు వెలుస్తాయి. వాటిని జరిపించటానికి పురోహితులు పుట్టుకొస్తారు. వారు గురువులుగా రూపొందుతారు; ఋషులుగా తయారవుతారు. సమాజానికి అవసరమైన నీతి వాక్యాలను దేవుని పేర పలుకుతారు. ఇవి మత నీతి శాస్త్రాలుగా చలామణి లోనికి వస్తాయి. వీటి మధ్య సమన్వయం వుండదు. దాంతో మతసమాజాలు సంఘర్షణకు దిగుతాయి. మానవాళి చీలిపోతుంది. జననాశనం సంభవిస్తుంది. ఇదంతా అప్రతిహతంగా జరిగిపొయ్యే మత భావనా ఫలితం యొక్క పరిణామం.

సైన్సు ప్రకృతి రహస్యాలను కనుగొనటానికి పుట్టింది. ప్రకృతిలోని కార్య కారణ సంబంధాలను గుర్తించింది. మానవ మస్తిష్కంలోని ఆలోచనలను పసిగట్టింది. భౌతిక రసాయన శాస్త్రాలు, జీవ శారీరక శాస్త్రాలు, మానసిక శాస్త్రాలు ఇవన్నీ విజ్ఞాన పరిధిలోకి వస్తాయి. వీటి ఫలితంగా మానవాళి పూర్వం కన్నా ఈనాడు సుఖమయ జీవితం గడుపున్నది. కాగా భౌతికశాస్త్రాల పురోగమనపు వేగాన్ని మానసిక శాస్త్రం అందుకోలేక పోతున్నది. మానవాళి అంతా ఒకటే, స్వేచ్ఛా సమానత్వ సౌభ్రాతృత్వాలు మానవ జీవితంలో వెల్లివిరియాలని అందరూ అంగీకరించినా ఆచరణలో వడిదుడుకులు సంభవిస్తున్నాయి. అందువల్ల మానవ సంస్కృతీ చరిత్ర కుంటుపడుతోంది. మానవ కళ్యాణాన్ని, సంక్షేమాన్ని ఒనగూర్చే తాత్విక చింతన అవసరమౌతుంది. కాని ఆ తత్వశాస్త్రం విధిగా విజ్ఞానాన్ని ఆధారం చేసుకొని వుండాలి. అప్పుడే దానికి నిత్యత్వం ఒనగూడుతుంది. మత భావన వైజ్ఞానిక భావనకు పూర్తిగా విరుద్ధం కనుక దాన్ని తృణీకరించడంలో ఏ విధమైన సంకోచమూ పనికిరాదు.

విజ్ఞాన శాస్త్రాన్ని కాదనకుండానే, శాస్త్రీయ దృష్టిని నిరసించకుండానే వాటి సరసన కొందరు మతాన్ని నెలకొల్ప ప్రయత్నిస్తున్నారు. మరికొందరు అటు మతాన్ని, ఇటు విజ్ఞానాన్ని విమర్శిస్తూ శాస్త్రీయ మతం కావాలని ప్రతిపాదిస్తున్నారు. దైవ భావన, గురుపూజ కేవలం వ్యక్తిగతమైనవని, ఆత్మసంతృప్తికరాలని చెపుతూ వాటిని సామాజిక జీవితంలో దొడ్డిద్రోవన ప్రవేశపెడుతున్నారు. పై మూడు వర్గాలకు చెందిన విజ్ఞాన శాస్త్రవేత్తలు ఏదో రూపంగా మతం యొక్క అస్తిత్వాన్ని సమర్థించ ప్రయత్నించేవారే. వీరు విజ్ఞాన శాస్త్రాన్ని అధ్యయనం చేస్తున్నా, అనుసరిస్తున్నా వైజ్ఞానిక దృక్పథం లేనివారని, శాస్త్రీయ దృక్పథం వంటపట్టించుకోనివారని తేలుతుంది ఈ కుహనా వైజ్ఞానిక వ్యూహాలను, ఎత్తుగడలను, ఆలోచనా ధోరణులను, అభి

ప్రాయాలను ఒక కంట కనిపెట్టి హేతువాద సిద్ధాంతం ఎందుకు అత్యావసరమయిందో, దాని వల్ల సమాజానికి, వ్యక్తికి ఎలాంటి ఔన్నత్యం సిద్ధిస్తుందో ప్రచారం చేయటం భౌతికవాదుల కర్తవ్యం. హేతువాది ముఖ్యంగా నీతివాదానికి కట్టుబడతాడని, నీతివాదులు మోసం చేయరంటే, అసత్యమాడరంటే మానవ విలువలను గౌరవిస్తారంటే ఏ ప్రవక్తో, రాముడో, క్రీస్తో చెప్పాడని చెయ్యరు అని మానసిక పరివర్తన వల్ల చేస్తారని రుజువులతో సహా వెలికితేవాలి. ప్రతి శాస్త్రీయ వాది, హేతువాది తమ చిత్తశుద్ధి ద్వారా, ఆచరణ ద్వారా మాత్రమే సిద్ధాంతాన్ని అమలుపరుస్తారు. అలాగే తమ భవిష్యత్తుకు తామే బాధ్యత వహిస్తారు. ఇతర మతాలను మత ద్వేషంతో కాక సిద్ధాంత పరమైన లక్షణాలకు భాష్యాలు చెప్పి వాటి వల్ల మానవ విలువలకు ఎలాంటి ప్రయోజనమో ఉదాహరణలతో చెప్తారే గాని వ్యక్తిగత దూషణ, మత దూషణలకు తావు ఇవ్వరు. ఈ లక్షణాలను మనం బోధించక పోతే కుహనా శాస్త్రజ్ఞులు సమాజాన్ని సర్వనాశనం చేసే ప్రమాదం లేక పోలేదు.

# స్త్రీలకు ప్రత్యేకంగా : మంచీ-చెడు

"గడన గల మగని చూచిన అడుగులకు మడుగు లిడుదు రతివలు పుడమిన్"
అన్నమాట వ్యర్థం కాదట. ఉబుసుపోక ఎన్నిమాటలు చెప్పినా, ఎన్ని 'పబ్లిక్' ఉప
న్యాసాలిచ్చినా ఆర్జించి పెట్టే యజమాని మాట చలామణి కాక తప్పదట. ప్రాతివత్యా
పరంగా, సత్సంప్రదాయాన్నిబట్టి భార్య అణకువగా ఉండటమే గౌరవం అనే భావంతో
"మావారు కోపగిస్తారు" అంటూ నటించినా వాస్తవంగా ఆమె తిడుతుందని అతడే
ఒదిగి వుంటున్నాడు. దాదాపు పురుషులంతా తమ స్త్రీలకు విధేయులే. ఐనప్పటికీ,
స్త్రీలకు స్వాతంత్ర్యం లేకుండా వున్నదనే గోల తప్పడం లేదు" అని ఒక పత్రికలో
ఒక పురుష పుంగవుడు తన ఆవేదనను వెళ్ళగక్కాడు. ఇంకా ఆయన స్త్రీలకు అనేక
విధాల హిత బోధలు చేశాడు. ముఖ్యంగా స్త్రీ స్వాతంత్ర్యవాదినులను దుయ్యబట్టాడు.
'ఉమెన్స్ లిబ్' వారు విజృంభించి హద్దూ పద్దూ లేకుండా ప్రచారం చెయ్యటం వల్ల
అమాయక స్త్రీలతో, సాధారణ మహిళల్లో అవినయం, అవిధేయత పెరిగి కుటుంబ
సామరస్యం, శాంతి నాశనమయి పోతున్నాయని క్షోభించాడు. ఇంకా అతడు 'లాజి
కల్'గా కొంత 'తత్వాన్ని' స్త్రీలకు ప్రబోధించారు.

గృహకృత్య నిర్వహణలో పేచీ లొచ్చినప్పుడు తుదినిర్ణయం పురుషుడిదే అవు
తోంది. ఈ విషయంలో స్త్రీలు పేచీ పెడుతున్నారు. కాని ఆర్జనా పరుడు భర్తే కనుక
అతనిదే పైచేయిగా వుండాలనీ, ఆదీకాక పెద్దవారిమాట చిన్నవారు శిరసావహించాలని
ఆదేశించారు అవధాన్లు గారు. పెద్దవారిమాట అన్నప్పుడు భార్య కన్నా భర్త కడదాకా
పెద్దవాడే కదా! అంటే భార్య భర్త ఆజ్ఞలను, తీర్పులను, అధికారాన్ని చచ్చేదాకా
శిరసావహించాలని దాని అర్థం. ఇక సంపాదనా పరంగా చూస్తే ఆస్తులు తెస్తున్న
ఆడవారున్నారు. ఉద్యోగినులున్నారు; వ్యాపారాలు చేస్తున్నారు. అంతేకాదు, ఇంట్లో
గంపెడు చాకిరీచేస్తూ బైట 'డూటీ'లను నిర్వహిస్తున్న వారెందరో వున్నారు. కాని
ఒక్కశాతం స్త్రీలు కూడా కుటుంబానికి యాజమాన్యం వహిస్తున్న వారులేరు అని చెప్ప
టానికి చాలా ఉదాహరణలున్నాయి. గతిలేక భర్త నిర్ణయాలను ఆమోదిస్తున్నారు. అస
లింతకూ ఉద్యోగిని కాని స్త్రీ పనికి విలువలేదా? రోజుకు భర్త 8 గం॥లు పనిచేస్తుంటే
భార్య 16 గం॥ చాకిరీ చేస్తుందే! ఇదంతా ఎవరికోసం? కుటుంబ శ్రేయస్సుకు కదా!
పురుషులకు 58 ఏళ్ళకు 'రిటైర్‌మెంటు' వుంది కానీ ఆమె చచ్చేదాకా చాకిరీ చేస్తూ

మైనపు వత్తిలా హరించి పోతుందే! మరి ఆమె పనికి విలువలేదా! అంటే మండిపడి పోతారు.

ఈ విమర్శకాగ్రేసరులకు ఒక బ్రహ్మాండమైన ఊహ వచ్చింది. స్వాభావికంగా స్త్రీ అబల, అల్పబలం గలది. ఇది ప్రకృతి వరప్రసాదమట. దీనికి సాక్ష్యాధారాలతో పనిలేదట. ఇది కాదని వాదిస్తే కంఠశోష, కాగితాల ఖర్చు; నిరుపయోగమట. మరి చర్చించి నిరూపిద్దామా!

ఒక స్త్రీ పదిమంది పిల్లల్ని కంటుంది. ఎనిదేళ్ళ నుండి 80 ఏళ్ళదాకా గొడ్డు చాకిరీ చేస్తుంది. తన రక్త మాంసాలను పంచిపెట్టి. పాలిచ్చి పిల్లల్ని పెంచుతుంది. ఆమెకు ఎంత కండబలం లేకుంటే ఈ భారాన్ని భరిస్తుంది? పురుషునితోపాటు అడ కూలీ రాళ్ళు మోస్తుంది; వ్యవసాయ పనులు చేస్తుంది. శక్తి సామర్థ్యాలలో తేడా లేనే లేదు. అసలు శారీరక శక్తికన్నా మానసిక మేధస్సు మిన్న అనే రోజుల్లో స్త్రీని అబలగా చిత్రించి చిన్నచూపు చూడటం హాస్యాస్పదమే కాదు అమానుష మన్నా తప్పు లేదు. స్త్రీ అబల అనడం అర్థరహితం.

స్వాభావికంగా స్త్రీకి విశాల హృదయం లేదట నలుగురితో సర్దుకొని పోలేదట. సమిష్టికుటుంబంలో సామరస్య రహితానికి కారణం స్త్రీలేనట. వారు ఇంట్లోనే మ్రగ్గటం వల్ల బైటవారి మనస్థత్వం, వారి ప్రవర్తనా రీతులు తెలియడంవల్ల కలిగే లోకజ్ఞానం వారికి వుండదట. అందువల్లే గృహనిర్వహణలో పురుషులమాట చలామణి కావాలని సెలవిచ్చారు పెద్దలు!

ఎంతటి సహృదయం, సౌమనస్యం, సహనం లేకుంటే పెళ్ళి కాగానే ముక్కు-మొహం తెలియని అత్తింటికెళ్ళి వాళ్ళందరితో కలిసి కాపురం చేయగలుగుతుంది! పురుషుడు ఇల్లరికం ఎందుకుపోడు? అమ్మాయి తన వారిని తన సర్వస్వాన్ని విడిచిపెట్టి జీవితాంతం అక్కడే ఎలావుంటుంది? ఆమెకు ప్రపంచ జ్ఞానం లేదంటారేగాని, బైటి కెడితే చెడిపోతుందని వెళ్ళనియ్యని దెవరు? ఆమెను కూపస్థమండూకాన్ని చేసిందెవరు? స్త్రీ తిరిగి చెడిందనే సామెత ఎవరు నిర్ధారీకరించారు. పురుషుల్లో పోరపొచ్చాలు లేవా? అసలు సర్దుకు పోవటమనేది స్త్రీకి సహజం. తల్లిదండ్రులు, భర్త జన్మతా నేర్పిన విద్యయని పురుషులు కాదని నిరూపించ గలరా? ఆమె సర్దుకోకపోతే ఎన్నో సంసారాలు గంగ పాలయ్యేవి.

"స్త్రీలతి దావవహ్ని పురుషుడాజ్య ఘటంబు, కరగకుండ రాదు కదిసెనేని" అనే సూక్తి నిజమట. స్త్రీలు విచ్చల విడిగా తిరిగితే పెళ్ళికాని తల్లులవుతారట. అలాంటి నియమనిబంధనలు లేకుండా స్వైర విహారం (పెర్మిసివ్ సొసైటీ) ముదిరితే విచ్చల విడిగా తిరిగితే తప్పేమిటి అనేదాకా, వస్తుందట మరి పురుషులు తిరిగితే అది మాత్రం తప్పు కదా అంటే-ఇద్దరూ తిరిగితేనే ప్రేమలు, కడుపులు, కులభ్రష్టత కయిగుతుంది కాని స్త్రీలు ఇంట్లోనే వుంటే ఏంజరుగుతుందని గంభీరంగా ప్రశ్నిచారు 'పండితులు'. స్త్రీని ఇంట్లోకి నెట్టేందుకు ఇదొక నీతిపరమైన ఎత్తుగడ కాదా! అంటే 'ఉమెన్సులిబ్' వారు ప్రమాదకారిణులని ప్రచారం చేస్తున్నారు. పురుషుని కామవాంఛ కన్నా స్త్రీ కామవాంఛ గొప్పప్రమాదమట. స్త్రీకి ఎక్కువ విలువ ఇవ్వబట్టే ఆమెను బైట తిరగరాదంటున్నారట. ఇదంతా ఆమె స్వేచ్ఛా సమానత్వాలను అరికట్టి తమ అధికారాలను నిలబెట్టుకొనే కుతంత్ర మన్నమాట.

'ప్రొమిస్క్యుయిటీ,' అంటే నియమ నిబంధనలు లేకుండా తిరగాలని వనితల కోరిక అట. ఈ 'ప్రొమిస్క్యుయిటీ'కి అవకాశం పురుషుల కంటే స్త్రీలలో హెచ్చుట. దుస్తులను సాధ్యమయినంత వరకు తగ్గించి శరీర అంగాంగాల ప్రదర్శనను బహిర్గతం చెయ్యాలనే కాంక్ష స్త్రీలోనే మిక్కుటంగా వున్నదట. ఇది వారి స్వాభావిక మేనట. ఇది రుజువుచేసి చెప్పవచ్చుట. ఇంతకన్నా వివరించటానికి ఆ మగపురుషునికి తమ సభ్యత అడ్డుపడ్తోందట ఈనాటి ఈ స్త్రీల నడవడికి సంఘం కొంతయినా అభ్యంతరం పెట్టకపోతే ముప్పువాటిల్లు తుందట. ఈ ఘోర నడవడిని గమనించకుండా స్త్రీ స్వాతంత్ర్య వాదనులు పురుష జాతిని దుయ్యబడు తున్నారట. కనుక మహిళామణులు 'మేల్-షోవినిజం, (పురుష దురహంకారాన్ని) గూర్చిన తమ విమర్శలను, హక్కుల ఉద్ఘాటనను హద్దులో వుంచుకోవాలని ఉద్రేకంతో స్త్రీ జాతిని హెచ్చరిస్తూ మేల్కొలి పారు వారు.

పాపం! మగవారి కష్టాలు మాకిప్పటికి అర్ధమయ్యాయి! శతాబ్దాల తరబడి వంట ఇంటికీ, పడకటింటికీ అంకితమైన ఆడవారు కాస్తంత వెలుగు చూద్దామంటే అంత కంపర మెందుకో! ఏదో నెపం వెయ్యాలని కాకపోతే అంగాంగ ప్రదర్శన అంటే ఆడవారికి ఆనందమని హేళనచేసే అధికారం వీరి కెవరిచ్చారు? బనీను కూడా లేకుండా మూడు మూరల లుంగీలతో మాయెదుట తిరుగుతున్న దెవరు? రకరకాల 'బైట్సుతో' రోడ్లమీద తిరిగే రోమియో లెవ్వరు? గతిలేని ఆడవార్ని కొంచి వారిని వ్యభిచార వృత్తి లోకి దింపుతున్న దెవరు? ప్రేమించామని కన్యలను మోసంచేసి వారికి గర్భం తెప్పించి

తప్పుకుంటున్నదెవరు? 'కులట' వ్యభిచారి అని వారికి నామకరణాలు చేస్తున్నదెవరు? కట్నం కోసం అమ్మాయిలను బలి పశువులను చేస్తున్నదెవరు; 'సతి' పేరుతో సజీవ దహనాలు చేస్తున్నదెవరు? 'ప్రేయరు' పేరుతో ఆడవార్ని మఠాల్లో బంధిస్తున్నదెవరు? ఆ జన్మాంతం ఆధారపడే జీవుల్లా, అజ్ఞాన అంధకారాల్లో వారిని బంధించి తాము యజమానులమని, అధికారులమని ప్రకటించుకోవటం అవినీతి, అసభ్యం అనక తప్పదు. ఇప్పుడిప్పుడే చదువని, ఉద్యోగమని బైటకొచ్చి కాస్త గాలి పీల్చుకుంటుంటే సహించలేక మళ్ళా 16వ శతాబ్దానికి నెట్టివేయటం అర్ధరహితం, అవివేకం, అమానుషం అనక తప్పదు. అసలే ఈ పురుష సింహాలను. రాక్షస సమాజాన్ని చూచి బెదరి పోతున్న ఆడవారిని ఇంకా అణగ త్రొక్కాలని సందేశాలివ్వటం మహాద్రోహం. వారి నిస్సహాయతను ఆసరాగా తీసుకొని మతం పేరుతో, నీతిపేరుతో, వారిపై ధ్వజమెత్తటం ఒక విధంగా పైశాచిక లక్షణ మననచ్చు. మహిళలకు మహిళా సంఘాలు చేయూత నివ్వటం నేరమా? ఇందులో హద్దు దాటే దేముంది! పులి నోటిలోని మేకను బ్రతికించటం పాపమంటారా? మనమంతా (మహిళలం) ఒకటైతే వారి ప్రవచనాలు వినేవారుండరని వారిబాధ. కనుక తస్మాత్ జాగ్రత్త! మరి మహిళల్లారా ఆలోచిస్తారా!

# హ్యూమనిజం : స్త్రీ విమోచన :

"పురుషుల మనస్సులలో, వారి ఆచారాలలో, శాసనాలలో, ఆచరణలో ఆధి
కృత, న్యూనత అనే భావాలు యజమాని, బానిస అనే భావాలు ఎంతకాలం వుంటాయో
అంతవరకు మానవ పరిణామం పూర్తికాదు; మానవుల ఆనందం పరిపూర్ణత చెందదు"
అన్నాడు నవ్య మానవవాద తత్వవేత్త ఎమ్. ఎన్. రాయ్ మానవ సమాజంలో సగం
మంది స్త్రీలు. వారికి స్వేచ్ఛా సమానత్వాలు లభ్యమయి నపుడే సమాజం స్వేచ్ఛా
యుతమవుతుంది భారత దేశంలో హిందువుల సంఖ్య అత్యధికం. అందువల్ల హిందువు
లకు స్త్రీయెడ వున్న దృక్పథాన్ని పరిశీలించి సనాతనులు, జాతీయవాదులు, "భారత
నారి ఆదర్శంగా" చిత్రించిన భావాన్ని తీసుకొని రాయ్ విశ్లేషించాడు తన పరిశోధనా
వ్యాసంగ ఫలితంగా 1940లో అతని గ్రంథం 'భారతనారీ ఆదర్శం' ఉద్భవించింది.
దానిలో ప్రాచీనుల భావాలను ఆయన చీల్చి చెండాడాడు. ఆధునిక స్త్రీల వాంఛలను,
ఆశయాలను పేర్కొని సమర్థించాడు. కనుక స్త్రీల యెడ రాయ్ దృక్పథం అందులో
విశదీకరించబడిందని రూఢిగా చెప్పవచ్చు. ఒక రకంగా ఆ గ్రంథాన్ని ఆ సంద
ర్భంగా ప్రామాణిక గ్రంథంగా ఎంచుకోవచ్చు.

## స్త్రీ స్వేచ్ఛ

స్త్రీ పురుషుని వస్తువు; ఈ బానిసత్వ చిహ్నాలకు బంగారుపూత పూస్తుంది ఆధ్యా
త్మిక కలయిక అనే పుక్కిటి పురాణ భావన. మన ధర్మశాస్త్ర సూత్రాలు స్త్రీ స్వాతం
త్ర్యాన్ని హరిస్తున్నాయి. ఆమె జీవితాంతం ఎప్పుడూ ఏదో ఒక పురుష రక్షణలో
వుండాలట! లొంగివుండటం అనే పదానికి రక్షణ అనేది మారుపేరు. నిజానికి ఆయా
దశలలో స్త్రీ తండ్రికి, భర్తకు, తనయుడికి చెంది వుండాలని మను ధర్మశాస్త్రం నిర్దే
శిస్తున్నది స్త్రీ ఏనాడూ స్వతంత్రంగా వుండజాలదు అనే మాట ఆ శాస్త్రపు పల్లవి.
పుట్టుకనుండి ఏమాత్రం స్వేచ్ఛనూ ఆమెకు లేకుండాచేస్తే ఆమె ఎట్లా జీవిస్తుంది? అని
చెప్పిన బరోడామహారాణి ఉపన్యాసాల్ని ఆమోదంతో ఎం. ఎన్. రాయ్ ఈ గ్రంథంలో
ఉటంకిచ్చాడు. అంటే ఆ అభిప్రాయాన్ని తను కూడా సమర్థించాడు. ఇలా స్త్రీలకు
స్వేచ్ఛ కావాలనే అభిప్రాయాన్ని స్పష్టంగా నిర్ద్వంద్వంగా స్పష్టీకరించాడు రాయ్.

## వివాహం

హిందూ వివాహం ఇద్దరు సమానస్తుల బంధం కాదు దాన్ని పవిత్ర బంధంగా
పేర్కొంటారు నిజానికి అందులో పవిత్రత లోపించి కేవలం అది బంధమయింది.

అదయినా స్త్రీల పాలిట మాత్రమే హిందూ వివాహంలో పురుషుడికి ఇవ్వబడిన స్వేచ్ఛ స్త్రీకి ఇవ్వబడలేదు. హిందూమతం బహు భార్యాత్వాన్ని అంగీకరించింది. 1948 తర్వాత శాసనం ద్వారా ఏకసతీత్వ, పతీత్వ వివాహం అమల్లోకి వచ్చింది. హిందూ మతంచేత నిర్దేశింపబడిన వివాహ వ్యవస్థ అవినీతికరం మాత్రమే కాదు, అది హింసా పూరితమైన అమానుషమైన అణచివేత కూడాను. ఆనాడు విడాకులులేవు. విడాకులు లేనందువల్ల బాధకు లోనయింది స్త్రీ. సంతానంకోసం హిందూ భర్త మరో స్త్రీని పెళ్ళాడేవాడు.

అలా మళ్ళీ పెళ్ళాడే ఆచారం వుండేది. భర్త నపుంసకుడయితే తల్లికాకోరిన స్త్రీకి విడాకులు లేనందువల్ల ఆమెకు బంధవిముక్తి లేదు. హిందూ వివాహం విహార యాత్ర కాదని డా॥ భగవాన్‌దాస్ అభిప్రాయ ప్రకటన చేశాడు. స్త్రీలకు హిందూ వివాహం నిజానికి విహారయాత్రకాదు. పెళ్ళిళ్ళ ద్వారా స్త్రీలను కొత్త యజమాన్లకు అప్పగిస్తారు. భర్తల యెడ స్త్రీలు సర్వకాలం విధేయుగా వుండాలి. యాజమాన్యం మార్పుల వల్ల కలిగే సంబంధంలో, బలవంతంగా కలిగే సంబంధంలో క్రమశిక్షణ కోరడమంటే పూర్తిగా బలవంతం చేయడమే అవుతుంది. హిందూ వివాహం స్త్రీలకు ఎలాంటి హక్కునూ ఇవ్వటంలేదు. వివాహబంధం వల్ల ఏర్పడిన సంబంధం నూతన సామాజిక సంబంధాలకు అనుగుణంగా లేదు. స్త్రీలకు ఆ పెళ్లి సహింపరానిది అవుతున్నది. అలా హిందూ వివాహబంధంలో (1940లో రాయ్ చెప్పినమాట) స్త్రీలకు స్వేచ్ఛ లేదు.

## విడాకులు

1948కి పూర్వం హిందూ వివాహంలో విడాకుల ప్రసక్తిలేదు. ఆ స్థితిని గురించి రాయ్ తీవ్రంగా విమర్శించాడు. విడాకులను నిషేధించడం మతప్రామాణ్యంతో దరహంమీద జరిగే మానభంగాల్ని అధికారికంగా ఆమోదించడ మన్నమాట. వ్యభిచారాన్ని ఎప్పుడైతే నైతికంగా గర్హిస్తున్నామో, అప్పుడే విడాకులకు ప్రాతిపదిక ఏర్పడుతోంది. పురుషుడు ద్వితీయ వివాహం చేసుకొని తనకిష్టమైన స్త్రీని పొందవచ్చు. అతనికి సంపూర్ణమైన స్వేచ్ఛ వుంది. పెళ్ళిలోని విశ్వాస ప్రమాణం ఇలా నగుబాటు కావడంలేదా? అని రాయ్ ప్రశ్నించాడు.

మహిళా సంఘాలు కూడా విడాకుల విషయమై పట్టుదల పూనని ఆ రోజుల్లో రాయ్ ఇలాంటి అభిప్రాయాలను వెలిబుచ్చటం సాహసోపేతమే కాక, చాలా దూర దృష్టితో కూడిన విధానం.

## పాతివ్రత్యం

ప్రాతివ్రత్యం పేరుతో హిందూ వివాహంలో స్త్రీ యొక్క వ్యక్తిత్వాన్ని త్యజించి వేయడం జరిగింది. స్త్రీలు వాళ్ళ జీవితాలనే వారి భర్తల పాదాల చెంత కానుకగా సమర్పించుకుంటారు. ఆ భర్తలు స్త్రీల ప్రేమకు ప్రతిఫలంగా తమ ప్రేమను భార్యలకు అందించక పోవచ్చు. తాము ప్రేమింపబడాలనే భావంలేకుండానే వారు భర్తలకు ప్రేమదానం చేస్తారట. నిస్వార్థతకు ప్రతిరూపం హిందూ స్త్రీయట.

"నోరెత్తకుండా ఆమె పరిస్థితులకు లొంగిపోవడాన్ని స్త్రీత్వ సద్గుణంయొక్క ఉన్నతోన్నత రూపంగాను, దానిని అంటి వుండే పేరు ప్రతిష్టలతోను సమానంగా పేర్కొనడం జరుగుతోంది" అని చెప్పిన నీలిమాదేవి మాటలను రాయ్ ఆమోదించాడు. సతీత్వంపేర ఆమె ఆస్తిగా మాత్రమే మిగిలిపోయింది. వస్తువుకు వ్యక్తిత్వం వుండదనే వేరే చెప్పనక్కర లేదుకదా!

## మాతృత్వం

హిందూ వైవాహిక జీవితంలో మాతృత్వానికి ప్రాధాన్యత నిచ్చారు. మతగ్రంథాలు, సామాజిక ఆచారాలు నిర్దేశించిన విధులను వధువు, విధేయతతో నెరవేరుస్తుందనే షరతుతోనే వరుడు కన్యాదానాన్ని స్వీకరిస్తాడు. భార్య విధులలో పిల్లల్ని కనడం మౌలికమైన విధి. దేవుడు జీవక్షేత్రాన్ని ప్రసాదించాడని, దానిని ఆమె వినియోగించాలని గాంధిజీ అన్నాడు. అంటే స్త్రీ శిశువును కనే యంత్రమని మరోరకంగా 'పవిత్ర' భాషలో రోతగా చెప్పడయే దాని అర్థం. దేశం కోసం సంతానాన్ని పొందమని హిట్లరు, ముస్సోలోనీలు స్త్రీలకు ఉద్బోధించారు. రాజకీయ వధ్యశాలలకు మనుషులను సరఫరా చేయడమే మాతృత్వం విధి అని భావిస్తే మాతృత్వానికి వుండే పేరు ప్రఖ్యాతులు సందేహాస్పందం అవుతాయి. ఇటీవల రష్యాలో కూడా అధిక సంతానానికి ప్రోద్బలం చేయడం చూస్తున్నాం. సంతానం కనడం, కనక పోవడం స్త్రీ యొక్క ఇష్టాఇష్టాలపై ఆధారపడాలి. అంతేగాని మతపరమైన విధిగాను, సామాజిక బాధ్యత గాను సంతానాన్ని కనడంలో కలిగే బాధకు స్త్రీలను ఎందుకు లోను చేయాలి? శాస్త్రవిజ్ఞానం ఆమెకు స్వేచ్ఛను ప్రసాదించేవరకు ఇష్టపూర్వకంగా కాక, ఇతరత్రా సంతానాన్ని కనమని ఆమెను శాసించుటకు వీలులేదు, ఆమెను ఎవరూ బలవంతంచేయకూడదు. ఈ సూత్రాలు సర్వకాలాలకు పనికి వస్తాయి. మతధర్మశాస్త్ర విహితమని మస్లింలు, రోమన్ కాథలికు క్రైస్తవులు అధిక సంతానోత్పత్తిని అరికట్టడం లేదు. సామాజిక సిద్ధాంతాల పేరుతో

శ్రమజీవుల 'హితాభిలాషులు' సంతానాన్ని కనవలదని కష్టజీవులకు ఉద్బోధించడం లేదని మనకు తెలుసు. కనుకనే రాయ్ సుభాషితాలు ఈనాటికీ శిరోధార్యాలు అయినాయి.

## కుటుంబ నియంత్రణ

జనాభా పెరుగుదల సమస్యను గురించి పెక్కుమందికి విచిత్రాభిప్రాయాలున్నాయి. వాటిని తరచి చూడవలసిన అవసరం వున్నది. అధిక సంతానోత్పత్తికి సాంస్కృతికంగా వెనుకబడినతనమే కారణం. పారిశుద్ధ్యం, ఆరోగ్యంయొక్క ప్రాథమిక సూత్రాలు కూడా తెలియని అంశం—అంటే సాంస్కృతికంగా వెనుకబడినతనం.

జీవితంలో వివిధ వ్యాసంగాలు కలిగి ఉన్న ధనవంతుల్లో జననాలరేటు దానంటత అదే నియంత్రణ మవుతుంది. ఏ దేశంలో ఎక్కువ సంస్కృతి, సంస్కారం ఉంటుందో అక్కడ అంత తక్కువగా జననాల రేటు ఉంటుంది. (ప్రజానీకపు బాధను సర్వసాధారణంగా తొలగించడానికి కుటుంబ నియంత్రణ తాత్కాలిక పరిష్కారమార్గం). ఈనాటి సామాజిక రాజకీయ పరిస్థితుల్ని, మధ్యతరగతి అనుభవిస్తున్న కొన్ని ఇబ్బందులను అధిగమించటానికి జన్మ నిగ్రహం సాయపడుతుంది. నిరుద్యోగికి జన్మ నిగ్రహవిధానం అవలంబించటం మానసికంగా లాభదాయకం. యువతకు కుటుంబ ఆచారాలు విధించు సంకెళ్ళనుండి స్వేచ్ఛనిస్తుంది. మూకుమ్మడి అక్రమ సంతాన సమస్య లేకుండా చేస్తుంది. జన్మనిగ్రహ విధాన ఆచరణ ఆర్థికంగా అవసరం. కాగా జన్మనిగ్రహ అవశ్యకతను అంగీకరిస్తూ అందుకు అవసరమైన సాధనాల వాడకాన్ని గాంధీజీ నిరసించి బ్రహచర్యాన్ని ఆచరించమని, కామోద్రిక్తులైన భర్తలను ఎదిరించమని స్త్రీలకు ఉద్బోధించటం అసంగతం. ఈ సలహా ప్రకృతి విరుద్ధమైనది. స్త్రీలకు కామప్రవృత్తి ఉంటుంది. లైంగిక ఆకర్షణ పరస్పరం జరిగే ప్రక్రియ. స్త్రీలు తమ భర్తలను ఆ విషయంగా ఎదిరించ దలచరు. ఒకవేళ ఎదిరించ దలచినా స్త్రీలకు అట్టి స్వేచ్ఛలేదు. ఏదయినా అది అసాధ్యం, అసంభవం. (అదీ గాక సంతానాన్ని పొందడమనే జీవ సంబంధమైన సంఘటన సెక్స్ జీవితంపై నిర్మించబడిన సుందర ఉద్వేగం నుండి అచిరకాలంలోనే వేరుపడవచ్చు) స్త్రీ పురుషులు సంభోగంలో పొందే ఆనందానికి, సంతానోత్పాదనా ప్రక్రియకూ సంబంధం లేదు రెంటికి మధ్యఉన్న సంబంధం కేవలం యాదృచ్ఛికమే.

టెస్టుట్యూబ్ బేబీల కాలం ఇది. ఇచ్చట రాయ్ దూరదృష్టి ప్రదర్శితం **అవుతుంది కధా ;**

## సమానత్వం

ప్రజాస్వామ్య జీవన సరళికి స్వేచ్ఛా సమానత్వాలు పట్టుకొమ్మలు. వరకట్న సమస్యను సమానత్వ సిద్ధాంత వ్యతిరేకంగా గమనిస్తున్నాం. ఆనాడు బహు భార్యాత్వాన్ని సమానత్వ వ్యతిరేక చిహ్నంగా రాయ్ పరిగణించాడు. స్వేచ్ఛా సమానత్వాలను, కనీస న్యాయాన్ని స్త్రీలకు సమకూర్చలేకపోతే ప్రజానీకం స్వేచ్ఛను అనుభవించ లేదు. ఈ వాదనలలో రాయ్ ఎంతవరకు వెళ్లాడంటే, హిందూ ధర్మశాస్త్ర ప్రకారం పురుషులు అనుభవించే అదనపు హక్కులను, సౌకర్యాలను వారికి నిరాకరించ దలచకపోతే, న్యాయాన్ని సమానత్వాన్ని గట్టిగా కావాలనుకునే వారు స్త్రీలకు బహుభర్తృత్వ హక్కు కోసం డిమాండు చేయవలసి ఉంటుంది అంటాడు. రాయ్ దానిని సమర్థించటం లేదు. బహుభర్తృత్వ విధానం కుటుంబాన్ని విచ్ఛిన్నం చేస్తుందని ఆయనకు తెలుసు. గడసరిగా ఆయన చెప్పిన మాట అది. సమానత్వ సూత్రంపై ఉండే మక్కువ, గౌరవం అది.

## సనాతన ధోరణులు

స్త్రీలు సమానత్వాన్ని కాక సహచర్యాన్ని మాత్రం ఆశించాలని డా॥ భగవాన్ దాస్ అంటే రాయ్ గట్టిగా విమర్శించాడు. స్త్రీజాతి మానవాళిలో సగమయితే స్త్రీ పురుషులు సమాన స్థాయి కలవారు కాక ఏమవుతారు? సగాలు సమానం కావా? స్త్రీలకు ఆత్మలు లేవా (వేదాంత సూత్రాల ప్రకారం) అని ప్రశ్నించాడు. కుటుంబ వ్యవస్థా వాదాన్ని పేర్కొని ప్రాచ్య సామాజిక వైభవాన్ని కొనియాడే వారిని, క్రమశిక్షణ పేరుతో స్త్రీల అణచివేతను సమర్థించే వారిని రాయ్ సునిశితంగా విమర్శించాడు.

"ద్వేషంతో యుద్ధానికి తలపడకండి. నేను ఆట బొమ్మను, నేను సంతానం కనే యంత్రాన్ని అనకండి. పురుషులను వంట ఇంటిలోకి నెట్టకండి. మీది ఉదాత్తమైన వృత్తి. దాంట్లో ఎవరూ పోటీ పడలేరు. మీకు చాతగాని పనులు చేయాలని ప్రయత్నించకండి. జీవిత సమర రంగం పురుషునిది, దానిలోకి మీరు ప్రవేశించకండి" అని స్త్రీలకు హితవు చెప్పిన జాతీయవాది భూలాభాయి దేశాయ్ వాదాన్ని రాయ్ తుత్తునియలు చేశాడు. ఇది కుతంత్రమని, అవాస్తవికమని దుయ్యబట్టాడు. అనేకమంది మధ్యతరగతి స్త్రీలు, శ్రామిక స్త్రీలు జీవిత సమరంలో ఎప్పటి నుంచో ఉంటున్నారని జ్ఞప్తి చేశాడు. ఈ కుహనా వాదనను ఎండగట్టాడు. కుటుంబాలు ఆర్థికపరంగా ఇబ్బందులకు లోనయినప్పుడు స్త్రీలు జీవిత సమర రంగంలోకి దుమికి ఉద్యోగాలు చేయకుండా ఉంటే, నిరు

ద్యోగ ఫలితంగా ఆకలితో అనేక కుటుంబాలు నాశనమయేవి. అలాంటి స్త్రీలను ఎలా నిరసిస్తారు ఏ మాత్రం ఇంగితజ్ఞానం వున్నవారయినా? స్త్రీలను కేవలం సంతానం కనే యంత్రాలుగా వుండమని శాసించడం, ప్రత్యేక పరిస్థితులలో వారిని ఆట బొమ్మలుగా పరిగణించడం ఈ రెండు పనులకు సావకాశం కల్పించుకోవడానికి చేసేదే దేశాయ్ లాంటి వారి వాదన.

డా॥ భగవాన్‌దాస్, దేశాయ్ ప్రగతి వ్యతిరేకులైన పురుషులకు ప్రతీకలు. అలాంటివారు ఈనాడూ తటస్థిస్తారు. అది మనం గమనిస్తూనే వున్నాం.

## పురుష ద్వేషం, స్త్రీ పురుష వైరుధ్యం

ఆధునిక స్త్రీలు పురుషద్వేషులని అభివర్ణించటం, స్త్రీ పురుష వైరుధ్యాన్ని వారు పెంచుతున్నారని అసత్య ప్రచారం సాగుతున్నది. స్త్రీ పురుషుల మధ్య వైరమనేది దిష్టిబొమ్మ. ఏదైనా వైరముంటే, వైర భావాన్ని ప్రచారం చేసే పురుషులే దాన్ని పోషిస్తున్నారు. స్త్రీలు పురుషాధిపత్యాన్ని, పురుష దురహంకారాన్ని నిరసిస్తున్నారు. అంతేకాని పురుషులను ద్వేషించటం లేదు. అసమానత్వాన్ని స్థిరీకరించదలచిన పురుషులు అలా నిందలు వేస్తారు. పితృస్వామ్య వ్యవస్థపై తిరుగుబాటు చేస్తున్నారు. పురుషాధిక్యతకు లోనుచేసిన ఆర్థిక అశక్తత, సామాజిక ఆచార వ్యవహారాలపై తిరుగుబాటు చేస్తున్నారు. స్త్రీ పురుషుల మధ్య యుద్ధం లేదు. లైంగిక ప్రేరణ సరస్పర ఆకర్షణ శక్తి, వీటిపై ఆధారపడి రెండు లైంగిక వర్గాలమధ్య ఉండే సహజ సమానత్వ సంబంధానికి అనుగుణంగా ఉండని సామాజిక కుటుంబ పరిస్థితులకు (అంటే తమను అణచివేసే పరిస్థితులకు) వ్యతిరేకంగా జరిగే పోరాటమే అది. స్త్రీల ఆర్థిక పరిస్థితిలో సమూలమైన మార్పు వలన స్త్రీల డిమాండ్ (సమానత్వం కోసం) పుడుతున్నదని గ్రహించలేని, గ్రహించని ప్రత్యాఘాతక పురుషునిదే ఈ అవాంఛనీయమైన వాతావరణానికి (ఘర్షణకు) బాధ్యత.

## స్త్రీల డిమాండ్లు

ఈనాడు స్త్రీల డిమాండ్లు స్వేచ్ఛా సమానత్వాల కోసం, శారీరక భద్రతకోసం, తమ వ్యక్తిత్వ హోదా గుర్తింపు కోసం సాగుతున్నది. వివాహంలో భాగస్వామిని ఎన్నుకునే హక్కు, కుటుంబంలో సామరస్యం లేకపోతే విడిపోయే హక్కు, ఆర్థిక స్వేచ్ఛ ఆధునిక స్త్రీ డిమాండ్లని రాయ్ చెప్పాడు. ఆధునిక స్త్రీ స్వేచ్ఛకోసం ఆరాట

పడుతున్నది. అది ఉన్నప్పుడే సామాజిక అరాజకత్వ ప్రమాదం తొలగి పోగలదు.
స్త్రీలు మానవ హక్కులు కావాలని డిమాండు చేస్తున్నారు.

## స్త్రీల ఐక్యత

ఈనాడు స్త్రీలను ఒకవర్గంగా పరిగణించే వారున్నారు. అలాకాక వారు ప్రత్యేక లక్షణాలు ఉన్న లైంగిక తెగ అని అభివర్ణించేవారు ఉన్నారు. రెండవ భావన సబబుగా తోస్తుంది. ధనికులైనా, బీదలైనా సర్వసాధారణంగా స్త్రీలుగా కొన్ని ఇక్కట్లకు లోను అవుతారు పితృస్వామ్య కుటుంబంలో పురుషుడు యజమాని, ప్రభువు కూడాను. అందుకే అన్ని వర్గాల స్త్రీలు తమ హక్కుల కోసం పోరాడతారు. బరోడా మహారాణి ఉపన్యాసాన్ని రాయ్ కొనియాడాడు. అంటే స్త్రీల హక్కుల సందర్భంగా జరిగే పోరాటంలో అన్ని వర్గాల స్త్రీల మధ్య సహకారం కావాలని అభిలషించాడన్నమాట.

## ముగింపు

హ్యూమనిజం స్త్రీ విమోచనను ఎలా కాంక్షిస్తుంది అనేది నేటి ముఖ్యాంశం. హ్యూమనిజం నైతిక దృక్పథం కలది. ఒక వ్యక్తి శ్రమశక్తిని మరో వ్యక్తి అక్రమంగా వాడుకోవటం, అలాగే శ్రమ ఫలితాన్ని దుర్మార్గంగా వినియోగించు కోవడం అవినీతి అంటుంది. బానిస విధానం అవినీతి. ఇంటి చాకిరికి విలువకట్టని పురుష ప్రపంచపు నడత అవినీతి. ఇంటి చాకిరీ నీవే చేయాలి అనే పురుష శాసనం నీతికి విరుద్ధం. పని విభజన పేరుతో స్త్రీ యొక్క శ్రమఫలితాన్ని వాడుకోవడం అక్రమం, అన్యాయం. నీకు శక్తి సామర్థ్యాలు వున్నాయనే కల్లబొల్లి మాటలతో స్త్రీని గృహిణిగా చిత్రించి ఆమెచేత అక్రమంగా చాకిరీ చేయించుకోవటం నైతికచర్య కాదు.

హ్యూమనిజం మనిషి వ్యక్తిత్వాన్ని గుర్తిస్తుంది. ఇప్పటివరకూ స్త్రీని పూర్తిగా వ్యక్తిత్వమున్న మనిషిగా పరిగణించడంలేదు. ఆమె తన భర్త యొక్క నీడమాత్రమే. పైగా అతని దాసిగా ఉండాలట. అతని శ్రేయస్సు తప్ప ఆమె మరో విషయం ఆలోచించరాదు. ఈ స్థితి మార్పుకై ఆందోళనలు భారీగా జరుగుతున్నాయి.

హ్యూమనిజం ప్రజాస్వామ్యాన్ని వాంఛిస్తుంది. విద్య, ఉద్యోగం, వివాహం, వైవాహిక జీవితం, పిల్లల సంరక్షకత్వం, మనోవర్తిలలో ద్వంద్వ నీతిని నిరసిస్తుంది. వరకట్నం, స్త్రీలపై అత్యాచారాలు, వ్యభిచారం లాంటి వాటిని తృణీకరిస్తుంది.

మానవుని హుందా తనాన్ని, గౌరవిస్తుంది. మానవ వక్తి విలక్షణమైన వ్యక్తిగా, ఎవరి హుందా వారిదిగా, స్త్రీ పురుషుల మధ్య తేడాలుండరాదని పోరాడుతుంది. క్రమ

శిక్షణ పేరుతో మానవ జీవితాన్ని యాంత్రికం చేసే వ్యవస్థను వ్యతిరేకిస్తుంది. విధి ఆమె చేయవలసిన పనులను నిర్ణయించలేదంటుంది. స్త్రీ ఇతరులకోసం మనుగడ సాగించాల్సిన అవసరం లేదని, ఆమె తన విలక్షణత్వాన్ని సంరక్షించుకోగలదని వక్కాణిస్తుంది. శాస్త్రీయ దృక్పథాన్ని ఆచరణలో పెడుతుంది హ్యూమనిజం. కాని, మానవ స్వభావం ఇద్దరిదీ ఒక టేనని సైన్సు రుజువు చేసింది. స్త్రీలలో చిత్రకారులు, శిల్పులు రచయితలు, సంగీత, సాహిత్య నిష్ణాతులు వున్నారని వారిలోని సృజనాత్మకతను, విద్వత్తును త్రుంచి వేయరాదని హ్యూమనిజం డిమాండ్ చేస్తుంది. ఇలా అన్ని రంగాల స్త్రీలను ప్రోత్సహిస్తుంది మానవవాదం. శాంతిని కూడా కాంక్షిస్తుంది. శాంతి అంటే యుద్ధానికి, యుద్ధానికి మధ్య విరామం కాదు. శాంతి భావనలో యుద్ధానికి స్థానం లేదు శాంతిని స్త్రీలు కాంక్షిస్తారు. ఏ తల్లీ తన సంతానాన్ని చంపుకోవటానికి ఇష్ట పడదు. భర్తల మరణాన్ని, అంగ వైకల్యాన్ని కోరుకోదు. ఇలా స్త్రీల జీవితాన్ని పెనవేసున్న సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలో స్త్రీకి స్వేచ్ఛ, సమానత్వం నూరుపాళ్ళు వుండాలని విశ్వసించేదే నవ్యమానవవాదం. ఇలా స్త్రీ విమోచనను, స్త్రీవికాసాన్ని కాంక్షించేదే హ్యూమనిజం.

# స్త్రీ విమోచన సాధ్యమా ?

"సగం మంది బానిసలుగా, సగమంది స్వతంత్రులుగా వుండే ఏ జాతి అయినా అభివృద్ధి చెందలేదు." అన్నాడు అబ్రహాం లింకన్ నీగ్రోల బానిస స్థితిపై వ్యాఖ్యానిస్తూ. అలాగే సగభాగమైన స్త్రీలు బానిసత్వంలో మ్రగ్గుతూ, సామాజిక స్పృహ లేకుండా కేవలం వంట ఇంటికీ పడకటింటికి పరిమితమై వున్నన్నాళ్ళూ ఈ దేశానికే కాదు యావత్ ప్రపంచానికీ విముక్తి లేదు. కనుక స్త్రీ స్వేచ్ఛ చాల ముఖ్యమైనదని చెప్పక తప్పదు.

స్త్రీ ఒక వ్యక్తిగా పుట్టింది కాని ఒకనికి భార్యగా పుట్టలేదు. ఆమెకు వివాహమే జీవిత ధ్యేయం కావాలనడం అర్థరహితం. పురుషుని క్రింద లొంగి వుండటం ఇష్టం లేని స్త్రీలు వివాహం మానుకుంటే నిందిస్తారు. తమ ఆదర్శానికి తగినంత ఔన్నత్యం గల పురుషులు లభించని వారిని-పెళ్ళి మానుకుంటే-దూషించడం, గొప్ప లక్ష్యాలు కల స్త్రీలు వ్యవధిలేక భర్త, పిల్లలూ, పెళ్ళి లాంటి బంధాలను విస్మరిస్తే వారిని సంఘం న్యూనతగా చూడటం సర్వసామాన్యం.

ఇంతవరకూ విద్యలో, సాంకేతిక రంగంలో, శాస్త్రీయ పరిశోధనలో, నిర్మాణ
కార్యక్రమాలలో, శాసన నిర్మాణంలో, ఇంకా వివేకం, విజ్ఞానం ప్రదర్శించాల్సిన రంగా
లలో స్త్రీల ప్రాముఖ్యత విస్మరించబడ్డది. అందువల్ల స్త్రీలు పురుషాధిక్య సమాజపు
నిరంకుశత్వానికి తల వొగ్గి ముసుగులోనూ, ఘోషాలోను తమ జీవితాలను వెళ్ళబుచ్చు
తున్నారు. కేవలం తిండీ, గుడ్డా, నీడలకోసం వ్యక్తిత్వాన్ని చంపుకొని దిష్టిబొమ్మలా
బ్రతకటానికి అలవాటు పడ్డారు. కుటుంబ సభ్యుల అవసరాలకు, అహంకారానికి,
సరదాలకు ప్రాధాన్యతనిచ్చి తమ ఇష్టాఇష్టాలను, కోర్కెలను చంపుకోవడం త్యాగంగా
భావిస్తున్నారు.

స్త్రీలు అజ్ఞానంతో, అవిద్యతో కొట్టుమిట్టాడుతున్నారనీ, అందువల్ల వారు సామా
జిక కార్యక్రమాలను నిర్వహించలేరని కొందరు పురుషులు పనికట్టుకొని ప్రచారం
చేస్తున్నారు. ఒకరకంగా ఆలోచిస్తే నేటి దోపిడీ వ్యవస్థకు పురుషులు బానిసలైతే స్త్రీలు
రెండు రకాలైన బానిసత్వాన్ని అనుభవిస్తున్నారు-అన్యాయంతోను, అసమానత్వంతోను
తాణికిసలాడే సమాజానికి ఒకవైపు, పురుష ప్రపంచానికి మరోవైపున కట్టు బానిస
లుగా స్త్రీలు జీవయాత్ర సాగిస్తున్నారు. ఇది కాదనలేని పచ్చి నిజం. మరి ఈ పరిస్థితి
మారేది ఎలా? ఎప్పుడు? అనేది నేడు మనముందు వున్న ప్రశ్నలు.

మానవుడు పాశవికదశ నుండి పురోగమించాడు. ఒకనాటి అసాధ్యాలు ఈనాడు
సాధ్యాలయినాయి. అలాగే స్త్రీలలో కూడా చైతన్యం, జాగృతి చోటు చేసుకుంటున్నాయి.
తగిన అవకాశం, శిక్షణా వుంటే స్త్రీలు చేయలేని పని లేదనేదానికి తార్కాణాలు బోలె
డన్ని వున్నాయి. వాలంటీనా తెరిస్కోవా రోదసీ విహారం చేసి గ్రహాంతరయానానికి
స్త్రీలు వెనుకంజ వేయరని నిరూపించింది. జపాన్ మహిళా బృందం ప్రపంచంలోకల్లా
ఎత్తయిన ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించింది. రసాయన శాస్త్రంలో పరిశోధనలు
చేసి రేడియంను కనుగొన్న మేడం క్యూరి రెండుసార్లు నోబుల్ బహుమతి సంపాదించు
కొన్నది. కృపస్కాయా సహాయం వల్లనే లెనిన్ మహాశయుడు సోషలిస్టు విప్లవ జ్యోతి
అయినాడు. ఎలియనార్ రూజువెల్టు, థెరిసా, దుర్గాబాయి లాంటి వారెందరో స్త్రీలలో
పుట్టలేదా! అసలు ఏ పురుషుడైనా మహోన్నతుడైనాడంటే ఆ వెనుక ఒక మహా త్యాగ
మూర్తి అయిన స్త్రీ వుంటుందనేది నగ్న సత్యం.

వ్యక్తుల మంచితనం వల్ల తమ సమస్యలు చక్కబడతాయని నమ్మి మోస
పోతోంది నారీ లోకం. అసలు వ్యవస్థ మారనిదే స్త్రీల పరిస్థితిలో మార్పు రాదు. వ్యవ
స్థలో మార్పు రావాలంటే అందులో అవమానం, కష్టనష్టాలు పొందుతున్న వాళ్ళే

ఎదిరించాలి. వారిలో ముందుగా తమ సమస్యలను పరిష్కరించుకోగల ఆత్మస్థైర్యం రావాలి. ఈ అసమానతలకు, అవమానాలకు ఒక ముఖ్య కారణం భావదాస్యం ఈ అజ్ఞానం నుండి విముక్తులు కావాలంటే స్త్రీలు విజ్ఞానవంతులు కావాలి.

వ్యక్తికి తన జీవితాన్ని సుఖవంతం చేసుకోవాలనే ప్రాథమిక వాంఛ మిక్కుటంగా వుంటుంది. అయితే ఆ సుఖం అనేదానికి అర్థం మాత్రం ఆ వ్యక్తుల దృక్పథాలను బట్టి వుంటుంది. అసలు వ్యక్తికి ఏమాత్రం స్వేచ్ఛ లేకుండా సుఖపడటం అనేది అర్థరహితం. అలాగే జీవిత సమస్యలు, మానవ విలువల పట్ల ఏమాత్రం అవగాహన లేకుండా సుఖపడుతున్నాం అనుకోవటం అవివేకం. ఇలాంటి భ్రమల్లోనే జీవిస్తున్నారు నేటి మన స్త్రీలు. ఆ భ్రమల నుండీ ఎవరూ ఎవర్నీ ఉద్ధరించలేరు; బైటికి లాగలేరు ఆలా బలవంతంగా ఇతరుల ప్రమేయం వల్ల వచ్చే మార్పుల చేత అసలు సమస్యలు మరింత గందరగోళంలో పడి విషమిస్తాయి. కనుక ఎవరికి వారే అంటే స్త్రీలు వ్యష్టిగాను, సమిష్టిగాను తమ సమస్యలను పరిష్కరించుకోగలిగితే నిజమైన మార్పు వస్తుంది. తద్వారా స్త్రీ విమోచన సిద్ధిస్తుంది.

మహిళా వికాసానికి

# మల్లాది సుబ్బమ్మ

సాహిత్యం

చరిత్ర

1. ఆం|ప్ర. మహిళోద్యమం (1860-1983) రు॥ 25-00
25-00

విమర్శనాత్మక గ్రంథాలు

2. హైందవం : స్త్రీలు 15-00
3. ఇస్లాం : స్త్రీలు 12-00
4. క్రైస్తవం : స్త్రీలు 25-00

వ్యాస సంపుటాలు

5. సమస్యలు : సంస్కరణలు 7-50
6. మహిళా దశాబ్దం 7-50
7. స్త్రీ విమోచన 7-00
8. ఓ మహిళా! ముందుకు సాగిపో 12-00
9. వనితాలోకం 12-00
10. మనం : మనం సంస్కృతి 10-00
11. బానిసా కాదు, దేవతా కాదు 7-00
12. స్త్రీలపై అత్యాచారాలు 6-00
13. స్త్రీల హక్కులు : సమస్యలు 8-00
14. మత ధర్మశాసనాలు : మహిళలు 10-00
15. బంగారు సంకెళ్ళు 5-00
16. హేతువాదం : స్త్రీలు 30-00
17. ATROCITIES ON WOMEN
18. SAGA OF WOMEN S STRUGGLE 10-00
20-00

సంకలనాలు

19. వివాహం : నేడు, రేపు 15-00
20. మహిళా వికాసం : శ్రమ, ఉద్యోగం 10-00
21. వివాహం సంతానం కోసమేనా? 10-00
22. వరకట్న విశ్లేషణ 15-00
23. అశ్లీలం : అసభ్యత 20-00

నవలలు

24. వంశాంకురం 17-00
25. ప్రేమ + సెక్స్ = నీతి 12-00
26. వెలిగిన జ్యోతి 12-00
27. కాంతి కిరణాలు 10-00
28. చీకటి వెలుగులు 5-00
29. ఈ దేశం నాదేనా? 20-00
30. మాతృత్వానికి మరోముడి 120-00

కథలు

CRITIQUE

31. ISLAM & WOMEN 200-00
32. HINDUISM & WOMEN

ESSAYS

33. WOMEN TRADITION & CULTURE 70-00

---

వికాసం, 9 ఎం ఐ జి హెచ్, మెహిదీపట్నం, హైదరాబాద్-500 028 ఫోను: 35429